శ్రీరస్తు

---

శ్రీహయగ్రీవాయనమః

---

# శ్రీమదాంధ్రకవితా పితామహ సర్వతోముఖాంక పంకజాక్ష పాదాంబుజాధీన మానసేందిందిర నందవర వంశోత్తంస శఠగోప తాపస ప్రసాదాసాదిత చతుర్విధ కవితా మతల్లికా అల్లసాని చొక్కయామాత్య పుత్ర పెద్దనార్య ప్రణీతంబయిన

# స్వారోచిషమనుచరిత్రము

---

సంస్కృతాంధ్రాదికావ్యరచనాచతురులగు

---

పండితులచే

సులభముగా నచ్చటచ్చట నత్యావశ్యకంబులగు

టిప్పణులంజేర్చి వ్రాయఁబడిన ప్రతిపదటీకతోఁగూడ

---

నేలటూరు వెంకటసుబ్బాశాస్త్రులవారి

సరస్వతీవిలాసముద్రాక్షరశాలయందు

శంకర- వేంకట్రావువారివలన

ముద్రింపించి ప్రకటింపఁబడియె

---

౧౮౭౩ సం॥ సెప్టెంబరు ౧౫ తేది.



శ్రీ హయగ్రీవాయనమః,



మనుచరిత్రము - సటీకము - ప్రథమాశ్వాసము.



శా॥ శ్రీవక్షోజకురంగనాభ మెదపైఁ జెన్నొందవిశ్వంభరా। దేవిందత్కమలాసమీపమునఁ బ్రీతిన్నిల్పి నాఁడోయనం। గావందారుసనందనాదినిజభక్తశ్రేణికిందోఁచురా। జీవాక్షుండుకృతార్థుఁజేయుశుభదృష్టింగృష్ణరాయాధిపున్॥ ౧

టీక॥ శ్రీవక్షోజకురంగనాభము-శ్రీ-లక్ష్మీదేవియొక్క-వక్షోజ-స్తనసంబంధమైన-కురంగనాభము-కస్తూరి-ఎదపైన్-వక్షస్థలముమీఁద-చెన్నొందన్-ఒప్పుచుండఁగా-విశ్వంభరాదేవిన్-భూదేవిని-తత్కమలాసమీపమునన్-తత్-ఆ-కమలా-లక్ష్మీదేవియొక్క-సమీపమునన్-సరసను-ప్రీతిన్-ప్రేమచేత నిల్పి నాఁడో-ఉంచినాఁడో-అనంగాన్-అనునట్టుగా-వందారు-స్తోత్రము సేయుచున్న-సనందనాది-సనందనుఁడు మొదలుగాఁగల-నిజభక్తశ్రేణికిన్-స్వకీయ భక్తసమూహమునకు-తోఁచు-కనుపడుచున్న-రాజీవాక్షుండు-తామరరేకులవంటి కన్నులుగల విష్ణుదేవుఁడు-శుభదృష్టిన్-మంగళకరమైన వీక్షణము చేత-కృష్ణరాయాధిపున్-ఈకృతినాయకుఁడైన కృష్ణదేవరాయప్రభువును-కృతార్థున్-ధన్యునిగా-చేయున్-ఒనర్చును-అనఁగా విష్ణువక్షస్థలమందు లక్ష్మీస్తనకస్తూరి యంటిన నల్లని దేహకాంతిగలభూదేవిని లక్ష్మీదేవిసరసను నిల్పినాఁడా యేమియనునట్టుగా సనందనాదులకుఁ దోఁచఁబడెనని తాత్పర్యము, ౧॥

ఉ॥ ఉల్లమునందు నక్కటికమూనుట మీకులమందుఁ గంటిమా। చల్లనమేలమాడు నచలాత్మజమాటకు లేఁతనవ్వు సం। ధిల్లఁ గిరీటిఁ బాశుపతదివ్యశరాఢ్యునిఁ జేయుశాంబరీ। భిల్లుఁడు కృష్ణరాయలకభీష్టశుభప్రతిపాదిగావుతన్॥ ౨

టీక॥ ఉల్లమునందున్-డెందమునందు-అక్కటికము-కనికరము-ఊనుట-వహించుట-మీకులమందున్-మీజాతియందు కంటిమా-చూచితిమా-ని-అనఁగా మాయాకిరాతరూపముచేత నర్జునునితో యుద్ధము సేయుసమయమున సామర్థ్యముగలిగియు నర్జునునియందుఁ గరుణించితానేలోఁబడెను గాన నెంతమాత్రమును గనికరములేని మీకిరాతకులమందుఁ గనికరము వహించుటను జూచితిమని-అల్లన్-నేర్పుగా-మేలమాడు పరిహాసముఁ జేసెడు-అచలాత్మజమాటకున్-పార్వతీదేవివచనమునకు-లేఁతనవ్వు-చిఱునగవు-సంధిల్లన్-తూడుకొనఁగా-కిరీటిన్-అర్జునుని-పాశుపతదివ్యశరాఢ్యునిఁ జేయు-పాశుపతమను దివ్యాస్త్రముగలవానినిగాఁ జేయునట్టి శాంబరీభిల్లుఁడు-మాయాకిరాతుఁడైన సాంబమూర్తి-కృష్ణరాయలకున్-కృష్ణదేవరాయలకు-అభీష్టశుభప్రతిపాదిన్-కోరినమంగళములను బొందించువాఁడు-కావుతన్-అగుఁగాక.

ఉ॥ నాలుగు మోములన్ని గమనాదము లుప్పతిలం బ్రచండవా। తూలహతిన్ జనించురొదతోఁ డిగుహావళి నొప్పుమేరువుం। బోలి పయోజపీఠి మునిముఖ్యులు గొల్వఁగ వాణిఁగూడి పే। రోలగమున్న ధాతవిభవోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్, ౩

టీక॥ నాలుగు మోములన్-చతుర్ముఖములయందు-నిగమ-వేదములయొక్క-నాదములు-ధ్వనులు-ఉప్పతిలన్-పుట్టుచుండఁగా-ప్రచండవాతూలహతిన్-ప్రచండ-మిక్కిలి వడి గలిగిన-వాతూల-వాయువులయొక్క-హతిన్-తాఁకుడుచేత-జనించు-పుట్టుచున్న-రొదతోడి-ఘోషముతోఁగూడిన గుహావళి నొప్పు-కొండగవుల చేతఁ బ్రకాశించుచుండెడు మేరువుం బోలి-స్వర్ణపర్వతముతో సమమయి-పయోజపీఠిన్-పద్మపీఠమందు-మునిముఖ్యులు గొల్వఁగన్-మునిశ్రేష్ఠులు సేవించుచుండఁగా-వాణిఁగూడి-సరస్వతీదేవితోఁగూడుకొని-పేరోలగమున్న-పెద్దకొలువుదీరియున్న-ధాత

బ్రహ్మదేవుఁడు - కృష్ణరాయఁడన్ కృష్ణదేవరాయని - విభవో
జ్జ్వలున్ - ఐశ్వర్యముచేతఁ బ్రకాశించువానినిగా - చేయు
తన్ - ఒనర్చునుగాక — అనఁగా బ్రహ్మదేవుఁడు నాలుగుము
ఖములయందు వేదములు ప్రోయుచుండ నెట్లుండెనోనఁ
గా వాయువుయొక్క తాఁకుడుచేత భోరున మ్రోఁగుచుం
డు గుహలుగల మేరుపర్వతమువలెనుండెనని తాత్పర్యము.

ఉ॥ అంకముఁ జేరి శైలతనయాస్తనదుగ్ధములాను వేళ బాల్యాంకవిచేష్టఁ దొండమున నవ్వలిచన్నఁ గబళింపఁబో
యి యా । వంకఁ గుచంబు గానక హివల్లభహారముఁ గాంచి వేడ్క బి । సాంకురశంక నంటెడు గజాస్యునిఁ గొ
ల్తు నభీష్టసిద్ధికిన్॥ ౪

టీక ॥ అంకముఁ జేరి । తొడమీఁదఁ జేరుకొని - శైలతనయాస్త
నదుగ్ధములు - శైలతనయా । పార్వతీదేవియొక్క । స్తనదు
గ్ధములు । చనుబాలు । ఆను వేళన్ - త్రాగుసమయమందు - బా
ల్యాంకవిచేష్టన్ । చిన్నతనమునకుఁ గుఱుతైన చేష్టలచేత -
తొండమునన్ - తొండముతోడ - అవ్వలి - అవతలివైపుననుం
డెడు - చన్నఁ గబళింపఁబోయి - చన్ను గ్రహింపఁబోయి - ఆవం
కన్ - ఆవైపున - కుచంబు - స్తనమును - కానక - కనుపడక పోఁ
గ - అహివల్లభహారముఁ గాంచి - అహివల్లభ । సర్పరాజ
మైన । హారముఁ గాంచి । చూచి । వేడ్కన్ । వేడ్కగా - బి
సాంకురశంకన్ - తామరతూఁడను భ్రాంతిచేత - అంటెడు -
స్పృశించునట్టి । గజాస్యునిన్ - ఏనుఁగుముఖము గల గణాధి
పతిని - అభీష్టసిద్ధికిన్ - కోరిక సఫలమయ్యెడు నిమిత్తముగా - కొ
ల్తున్ - సేవించుచున్నాను - అనఁగా విఘ్నేశ్వరుఁడు పార్వ
తీదేవియొద్దఁ జన్నుగుడుచుచుండి బాల్యముచేతఁ దొండ
ముతో నటి యవతలిచన్ను పుణకఁబోయి పార్వతికి సగము దే
హము శివరూపముగనుక యావైపున చన్ను గనుపడక సర్ప
హారముగనుపడఁగా నది తామరతూఁడనుకొని గజముఖుఁడు
గనుక నేనుఁగకుఁ దామరతూఁడ్లు త్రెంచుట స్వభావమైనం
దున నా సర్పమును నీడ్చిపట్టెనని తాత్పర్యము. ౪

సీ॥ చేర్చుక్కగా నిడ్డ చిన్ని జాబిల్లిచే* సిందూరతిలకంబు చెమ్మగిల్ల । నవతంసకుసుమంబునందున్న యెలదేఁటి
రుతికిం జిదంచితశ్రుతులనీనఁ । ఘనమైన రాపు చనుదోయి రాయిడిఁ* దుంబీఫలంబు దుందుడుకుఁ జెందఁ । త
రుణాంగుళిచ్ఛాయ దంతపుసరకట్టు* లింగిలీకపువింతరంగులీన ॥ తే॥ ఉపనిషత్తులు బోటులై యోలగిం
పఁ* బుండరీకాసనమునఁ గూర్చుండి మదికి । నించు వేడుక వీణ వాయించు చెలువ* నలువరాణి మదాత్మలో వె
లయుఁగాత॥ ౫

టీక॥ చేర్చుక్కగా నిడ్డ - లలాటికరీతిగా నలంకరించుకొన్న - చి
న్నిజాబిల్లిచేన్ - బాలచంద్రునిచేత - సిందూరతిలకంబు - సిం
దూరము అనురంజకద్రవ్యపు చుక్కబొట్టు - చెమ్మగిల్లన్ - తృప్పిం
చుచుండఁగా - అవతంసకుసుమంబునందున్న - అవతంస -
చెవిని విలాసార్థముగా ధరించిన - కుసుమంబునందున్న - పు
ష్పమందున్న - ఎలదేఁటి । కొదమతుమ్మెద - రుతికిన్ - నాద
మునకు - జిందిత । కొంచెముగా - అంచిత - ఒప్పుచుండెడు - శ్రు
తులన్ - సుతులను - ఈనన్ । కల్పించుచుండఁగా - ఘనమైన -
అధికమయిన - రాపు - ఒరియిక గల । చనుదోయి । కుచద్వ
యముయొక్క - రాయిడిన్ । రాపాటుచేత - తుంబీఫలంబు -
వీణ కమర్చిన తుంబకాయ । సొరకాయయనుట - దుందుడుకుఁ
జెందన్ । తొట్రుపడుచుండఁగా - తరుణాంగుళిచ్ఛాయన్ - త
రుణాంగుళి । కోమలములయిన యెఱ్ఱని వ్రేళ్లయొక్క - ఛా
యన్ । కాంతిచేత - దంతపుసరకట్టులు । దంతపుమెట్లు - ఇంగిలీ
కపు । హింగుళి యను రంజకద్రవ్యము యొక్క - వింతరంగులు
చోద్యమైన యెఱ్ఱని వన్నెలు - ఈనన్ । కనుచుండఁగా । ఉపని
షత్తులు । నిగమాంతములు । బోటులై - చెలికత్తియలై - ఓలగిం
పన్ । పరివేష్టించఁగా - పుండరీకాసనమునన్ - తెల్లదామరగ
ద్దియమీఁద । కూర్చుండి - ఉపవిష్టయై - మదికిన్ । మనస్సునకు -
నించు వేడుకన్ । నిండింపుచున్న యుల్లాసముచేత - వీణన్ । వ
ల్లకిని । వాయించు చెలువ । వాయించుచుండు సౌందర్యవతియైన
నలువరాణి - బ్రహ్మ భార్యయైన సరస్వతి - మదాత్మ
లోన్ । మత్ । నాయొక్క - ఆత్మలోన్ । మనస్సునందు । వెల
యుఁగాత । నిలిచియుండును గాక — లలాటిక అనఁగాఁ
బాపటబొట్టు॥ ౫॥

క॥ కొలుతున్ మద్గురువిద్యా । నిలయుం గరుణాకటాక్షనిబిడజ్యోత్స్నా । కలితాశ్రితజనదురిత । చ్ఛల
గాఢధ్వాంతసమితిఁ శఠగోపయతిన్, ౬

టీక ॥ మద్గురున్ - నాయొక్క గురువును విద్యానిలయున్ వి । ద్య । వేదశాస్త్రాదివిద్యలకు । నిలయున్ - నివాసభూతుఁడును -

సింధురాధ్యక్షు*లరిగాఁపులెవ్వాని ఖరతరాసికి| పంచగౌడధాత్రీపదంబెవ్వాని*కసివారుగా నేఁగునట్టి
బయలు|సకలయాచకజనాశాపూర్తికెవ్వాని*ఘనభుజాదండంబు కల్పశాఖి ౹ ౧౨ ౹ తే॥ ప్రబలరాజా
ధిరాజవీరప్రతాప*రాజపరమేశబిరుదవిభ్రాజియెవ్వఁడట్టి శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁ*డొక్కనాఁడు
కుతూహలంబుప్పతిల్ల॥ ౧౩

టీక॥ ఉదయాచలేంద్రంబు- ఉదయగిరిదుర్గము- మొదలుగా-ఎవ్వని-ఏ రాజుయొక్క-కుమారతకున్- కుమారప్రాయమునకు కుమారతకు - నడఁగాఁ ... క్రౌంచాచల రాజము క్రౌంచమను పర్వత శ్రేష్ఠము - అయ్యెన్- ఆయెనో నావాడపతి-నావాడయను దేశము యొక్క-రాజును - శకంధర-శకంధరుఁడను రాజును- సింధురాధ్యక్షులు- గజపతియను రాజును-ఎవ్వని-ఏ రాజుయొక్క- ఖరతరాసికిన్ మిక్కిలి తీక్ష్ణమైన ఖడ్గమునకు - అరిగాఁపులు|పన్నినిచ్చు కాఁపులైరో- ఆపంచగౌడధాత్రీపదంబు- పంచగౌడులనఁగాఁగన్యాకుబ్జాలు సారస్వతులు మొదలుగ నివసించు స్థానములుగనుక యంతపర్యంతమయిన భూమి - ఎవ్వని-ఏ రాజుకు-అసివారుగాన్ | సవారిమార్గముగా- ఏగునట్టి - పోవునట్టి -బయలు|మైదానమాయెనో|సకల-సమస్తమయిన|యాచకజన-యాచకులయొక్క-ఆశాపూర్తికిన్|కోరికలునించుటకు.ఎవ్వని-ఏ రాజుయొక్క-ఘన శ్రేష్ఠమయిన|భుజాదండంబు బాహుదండము కల్పశాఖికో రినపదార్థములనన్నిటినిచ్చుకల్పవృక్షమువంటిదాయెనో-ప్రబల...విభ్రాజీ|ప్రబల|సామర్థ్యము గలిగిన| రాజాధిరాజ రాజాధిరాజయును|వీరప్రతాప|వీరప్రతాపయును|రాజపరమేశ రాజపరమేశయను బిరుదన్ బిరుదావళుల చేత|విభ్రాజి ప్రకాశించుచున్న వాఁడు ఎవ్వఁడు ఏ రాజో- అట్టి శ్రీకృష్ణదేవరాయాగ్రగణ్యుఁడు- అట్టి సంపదగల కృష్ణదేవరాయ శ్రేష్ఠుఁడు- ఒక్కనాఁడు- ఒకదినమందు-కుతూహలంబు- సంతోషము- ఉప్పతిల్లన్ -పుట్టుచుండఁగా అనఁగాఁ గుమారస్వామి క్రౌంచపర్వతమును సాధించినట్టుగాను దయగిరిదుర్గమును శ్రీకృష్ణదేవరాయఁడు సాధించినాఁడనియు నావాడపతి మొదలయిన రాజులచేతఁ బన్ను పుచ్చుకొన్నాఁడనియు హిమవత్ స్థానముపర్యంతమయిన రాజ్యమును విలాసమాత్రముగా నలినాఁడనియు | కల్పవృక్షమువలె నేకోరిన వారికిఁ గోరినట్టుగా సకలవస్తువులనిచ్చినాఁడనియు | ఘనమయిన బిరుదావళులచేతఁ బ్రకాశించినాఁడని తాత్పర్యము, ౧౩॥

సీ॥ ఇందీవరంబులనీను గ్రాల్గన్నుల * శరదిందుముఖులు చామరములిడఁగ|పాణినకూనకణాదబాదరాయణ
సూత్ర*ఫక్కి విద్వాంసులుపన్యసింప|పంచపార్శ్వభూమిన భీరుభటకదంబకరాళ*హేతిచ్ఛటాచ్ఛాయలిరు
లుకొనఁగ|సామంతమండనోద్దామమాణిక్యాంశు*మండలంబొలసియారెండగాయ ।౧౪। తే॥మూరురా
యరగండపెండారమణిమ*రీచిరింఛోళిఁ గలయ నావృతములగుచు| నంకపాళిన టద్దువాలాంచలములు*
చిత్రమాంజిష్ఠవిభ్రమశ్రీవహింప॥
౧౫॥

టీక॥ఇందీవరంబులకన్ -నల్లకలువలను- ఈను-కనుచున్న -గ్రాల్గన్నుల- తళుకు నేత్రములుగల-శరదిందుముఖులు-శరదిందు-శరత్కాలచంద్రునివంటి-ముఖులు-మోములుగల స్త్రీలు-చామరములు-చామరలు- ఇడఁగన్|వేయుచుండఁగా|పాణిన...ఫక్కిన్ * పాణినమూన| పాణినియొక్కయు|కణాద|గౌతమునియొక్కయు| బాదరాయణ| వ్యాసులయొక్కయు-సూత్ర|వ్యాకరణతర్క-మీమాంసలయొక్క- సూత్రములయందలి|ఫక్కిన్-ప్రకరణములను|విద్వాంసులు| పండితులు-ఉపన్యసింపన్ - ప్రసంగించుచుండఁగా|పార్శ్వభూమిన్- రెండువైపులను అభీరు...కొనఁగన్ *అభీరు- భయపడని- భట-బంటులయొక్క- కదంబ|సమూహముయొక్క|కరాళ-భయంకరమైన|హేతిచ్ఛటాకత్తులగుంపుయొక్క ఛాయలు-కాంతులు - ఇరులుకొనఁగన్|చీఁకట్లుగ్రమ్ముచుండఁగా-సామంత...లంబు-సామంత-తనదేశముచుట్టునుండు రాజులయొక్క-మండన-ఆభరణములయందలి|ఉద్దామ-ఉత్కృష్టమైన|మాణిక్య|శోణరత్నములయొక్క | అంశుమండలంబు|కిరణసమూహము-ఒలసి-వ్యాపించి- ఎండరెండగాయన్-లేఁతయెండగాఁగాయుచుండఁగా॥ మూరురాయరగండపెండార - అశ్వపతిగజపతినరపతియను ముగ్గురురాజులకు మగఁడను బిరుదుగల కాలియందె యొక్క - మణిమరీచి- మణి- పద్మరాగరత్నముల యొక్క|మరీచి|కాంతుల యొక్క-రింఛోళిన్-గుంపుచేత-కలయన్- అంతటనావృ

తములగుచున్ ఆవరింపఁబడినవై - అంకపాళీ...ములు*అంకపాళీ। తొడలయందు।నటత్। వలించుచున్న -మకూలాంచలములు। వెలిపట్టువస్త్రము యొక్క యంచులు - చిత్రమాంజిష్ఠవిభ్రమశ్రీవహింపన్*చిత్ర - ఆశ్చర్యకరమైన-మాంజిష్ఠ। ఎఱుపుఛాయగలపట్టువస్త్రపు - విభ్రమ-క్రాంతి యొక్క।శ్రీవహింపన్-సంపదనుబూను చుండఁగా ముందరి పద్యమందుఁ గ్రియ. ౧౫

క॥ భువనవిజయాఖ్యసంస। ద్భవనస్థితసింహపీఠిఁ బ్రాజ్ఞులగోష్ఠిం। గవితామధురిమ డెందముఁ। గవులం గొలువుండి సదయత నన్నుం బల్కెన్. ౧౬

టీక॥ భువన...పీఠిన్*భువనవిజయాఖ్య। భువనవిజయమను పేరుగల।సంసద్భవన।సభామందిరమందు।స్థిత। ఉన్న-సింహపీఠిన్। సింహాసనమందు-ప్రాజ్ఞులగోష్ఠిన్- పండితులయొక్క ప్రసంగమువలన। కవితామధురిమ। కవిత్వము యొక్క మాధుర్యము- డెందమున్।హృదయమును- తవులన్-అంటియుండఁగా-కొలువుండి।కొలువుదీర్చికూర్చుండి సదయతన్। కృపతోఁ గూడినభావముచేత- నన్నుఁబల్కెన్ నన్నుఁ గూర్చి యొకవాక్యము చెప్పెను. ౧౬

తే॥ సప్తసంతానములలోనఁ బ్రశస్తిఁ గాంచి। ఖిలముగాకుండునది ధాత్రిఁ గృతియ కాన। గృతి రచింపుము మాకు శిరీషకుసుమ। పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య॥ ౧౭

టీక॥ సప్తసంతానములలోన్ - ఏడైనసంతానములలో-ప్రశస్తిగాంచి-ప్రసిద్ధినిబొంది-ఖిలముగాకుండునది - ఎన్నటికిని నశింపనిది-ధాత్రిన్-భూమియందు-కృతియ కాన్ ప్రబంధమేకనుక- పెద్దనార్య - పూజ్యుఁడవైన పెద్దనా-శిరీషకుసుమపేశలసుధామయోక్తులన్-శిరీషకుసుమ। దిరిసెనపుపువ్వువలె।పేశల।మృదువైన।సుధామయోక్తులన్। అమృతస్వరూపములైనవాక్యములచేత - మాకున్-మాకంకితముగా - కృతిరచింపుము - ప్రబంధమును నిర్మాణముచేయుము—సప్తసంతానములనఁగా।చెరువుత్రవ్వించుట।ధనము పూడ్చిపెట్టుట। అగ్రహారముఁగట్టించుట।శివాలయము గట్టించుట। తోఁటవేయించుట। కృతినందుట।బావిత్రవ్వించుటయనునేడువిధములైనధర్మములు, ౧౭

క॥ హితుఁడవు చతురవచోనిధి। వతులపురాణాగమేతిహాసకథార్థ। స్మృతియుతుఁడ వాంధ్రకవితా। పితామహుండవెవ్వరీడు పేర్కొననీకున్॥ ౧౮

టీక॥ హితుఁడవు-ఇష్టుఁడవును- చతురవచోనిధివి - ప్రౌఢవాక్యములకుస్థానమైనవాఁడవును - అతుల...యుతుఁడవు అతుల-సమానరహితమైన।పురాణ-పురాణములయొక్క। ఆగమ। ఆగమములయొక్క। ఇతిహాస। ఇతిహాసములయొక్క।కథార్థ।కథలయందలియర్థముయొక్క। స్మృతియుతుఁడవు।జ్ఞాపకశుద్ధితోఁగూడుకొన్నవాఁడవు- ఆంధ్రకవితాపితామహుఁడవు - ఆంధ్రకవిత్వమందుబ్రహ్మవు-నీకున్-ఇటువంటినీకు - పేర్కొనన్- పేరెన్నికచేయుటకు - ఎవ్వరీడు- సమానమెవ్వరు - అనఁగా నాంధ్రకవిత్వమందసమానుఁడవనుట॥పురాణములుస్కాందము మొదలైనవి। ఆగమములు పాంచరాత్రము మొదలైనవి। ఇతిహాసములు భారతము మొదలైనవి। అని తెలియవలెను. ౧౮

క॥ మనువులలో స్వారోచిష। మనుసంభవమరయ రససమంచితకథల। న్వినవినుపు కలిధ్వంసక। మనఘ భవచ్చతురరచనకనుకూలంబున్॥ ౧౯

టీక॥ మనువులలోన్-పదునలుగురు మనువులలోపల- స్వారోచిషమనుసంభవము - స్వారోచిషమనువుయొక్క జననము-అరయన్ విచారించఁగా - రససమంచితకథలన్ రససమంచిత। శృంగారాదిరసములచేతనొప్పుచున్న। కథలన్।కథలచేత-వినవినుపు - వినుటకిష్టమైనదియు-కలిధ్వంసకము- కలికల్మషనాశకమైనదియు - అనఘ-పుణ్యాత్ముఁడవైనపెద్దనా-భవచ్చతురరచనకున్- నీయొక్క ప్రౌఢకల్పనమునకు-అనుకూలంబున్-తగియున్నదియు. ౧౯

వ॥ కావున మార్కండేయపురాణోక్తప్రకారంబున నం జెప్పుమనికర్పూరతాంబూలంబు వెట్టినం బట్టి మహాప్రసా

నలబసి మోదంబున నమ్మహాప్రబంధనిబంధనంబునకుం బ్రారంభించితి నేతత్కథానాయకరత్నంబు నరసమహీనాథువంశావతారం బెట్టిదనిన॥ ౨౦

టీక॥ కావునన్ । కాఁబట్టి- మార్కండేయపురాణ సంగ్రహముగఁ జెప్పఁబడిన కథను- ప్రబంధముఁ జేయుమని- కర్పూరతాంబూలంబు వెట్టినన్ । ఘనసారసహితమైన తాంబూలము నుందరనుంచఁగా । పట్టి- గ్రహించి । మహాప్రసాదంబని-ఇదేఘనమైన సంతుష్టను గ్రహమని- మోదంబునన్- సంతోషముచేత- అమ్మహాప్రబంధనిబంధనంబునకున్ - ఆఘనమైన ప్రబంధముయొక్క-నిర్మాణమునకు-ప్రారంభించితిన్ -ఉపక్రమించితిని-ఏతత్కథానాయకరత్నంబగు- ఈకృతినాయకశ్రేష్ఠుఁడైన-అన్మహీనాథు- అకృష్ణదేవరాయల యొక్క-వంశావతారంబు-వంశముయొక్క-పుట్టుగడ - ఎట్టిదనినన్- ఎటువంటిదనఁగా. ౨౦

సీ॥ కలశపాథోరాశిగర్భవీచిమతల్లి * కడుపార నెవ్వాని గన్నతల్లి । యనలాక్షుఘనజటావనవాటికెవ్వాఁడు * వన్నె వెట్టు ననార్తవంపుఁబువ్వు । సకలదైవతబుభుక్షాపూర్తికెవ్వాఁడు * పుట్టుగానని మేనిమెట్టపంట । కటికిచీకటితిండికరముల గిలిగింత * నెవ్వాఁడు దొగకన్నె నవ్వఁ జేయు ॥ ౨౧ ॥ తే॥ నతఁడు పొగడొందు మధుకైటభారి మఱఁది । కళల నెలవగు వాఁడు చుక్కలకు ఱేఁడు । మిసిమిపరసీమ వలరాజు మేనమామ * వేవెలుంగుల దొరజోడు రేవెలుంగు॥ ౨౨

టీక॥ కలశపాథోరాశిగర్భవీచిమతల్లి-కలశపాథోరాశి- క్షీరసముద్రముయొక్క । గర్భవీచిమతల్లి । గర్భమందలిశ్రేష్ఠతరంగము- కడుపారన్- కడుపుతెనియనట్టుగా- ఎవ్వానిన్- ఏపురుషుని- కన్నతల్లి- కనినతల్లియాయెనో - అనలాక్షు । శివునియొక్క- ఘనజటావనవాటికిన్- ఘన । అధికమైన- జటావనవాటికిన్ - జడలనువనపఙ్క్తికి - ఎవ్వాఁడు ఏపురుషుఁడు- వన్నె వెట్టు - వర్ణము గలగఁ జేయునట్టి- అనార్తవంపు- ఋతుసంబంధము గాని- పువ్వు పుష్పమాయెనో- సకలదైవతబుభుక్షాపూర్తికిన్ -సకలదైవత-సమస్తమైన దేవతలయొక్క బుభుక్షాపూర్తికిన్- ఆఁకలి దీర్చుటకు ఎవ్వాఁడు ఎపురుషుఁడు పుట్టుగానని- అంకురించని- మేని- దేహమనెడు మెట్టపంట- మెరకనేలపంట యాయెనో- కటికిచీఁకటితిండి- గాఢాంధకారమును మ్రింగునట్టి- కరములగిలిగింతన్ - కిరణములను హస్తములయొక్క చక్కిలిగింతచేత - ఎవ్వాఁడు - ఏపురుషుఁడు- దొగకన్నెన్- కలువయను కన్నెపడుచును- నవ్వఁజేసెనో- నవ్వునట్లు చేయునో - అతఁడు- - అట్టి- మధుకైటభారి మఱఁది-విష్ణుమూర్తికి మఱఁదియును- కళల నెలవగు వాఁడు-షోడశసంఖ్యగలకళలకు స్థానభూతుఁడును-చుక్కలకు ఱేఁడు-అశ్విన్యాదినక్షత్రములకు నాథుఁడును- మిసిమిపరసీమ కాంతికిఁ జరమావధియును- వలరాజు మేనమామ-మన్మథునకు తల్లితోడఁబుట్టినవాఁడును- వేవెలుంగులదొరజోడు-వేయికిరణములుగల సూర్యునకీడైనవాఁడును నైన- రేవెలుంగు రాత్రియందుఁ బ్రకాశముగలవంద్రుఁడు పొగడొందున్ ప్రసిద్ధినిబొందుచుండును— అనఁగాఁ జంద్రుఁడు క్షీరసముద్రమందుఁ బుట్టినవాఁడనియు । శివునిజటాజూటమందు ధరింపఁబడినవాఁడనియు । దేవతలకాహారగ్రాహ్యముగాఁ గళల నిచ్చువాఁడనియు । కలువలను వికసింపఁ జేయువాఁడనియు లక్ష్మీదేవికిఁ దోడఁబుట్టినవాఁడనియు । షోడశకళలుగలవాఁడనియు । నక్షత్రములకు రాజనియు । కాంతినిధియనియు । సూర్యునకీడైనవాఁడనియును ॥ తాత్పర్యము - వన్నె వెట్టెడు నార్తవంపుఁబువ్వను పాఠముండు । వనవమైన పువ్వు మేమో యనియర్థము॥ ౨౨

తే॥ ఆసుధాధాముభవమహాంబురాశి కుబ్బు మీఱంగ నందనుఁడుదయమయ్యె । వేదవేదాంగశాస్త్రార్థవిశదవాసనాతన్నిషణ్ణధురంధరుఁడైన బుధుఁడు. ౨౩

టీక॥ ఆసుధాధాము- ఆచంద్రునియొక్క -విభవమహాంబురాశికిన్-విభవ । ఐశ్వర్యమను । మహాంబురాశికిన్ । గొప్పసముద్రమునకు ఉబ్బు మీఱంగన్ ఉప్పొంగుట యతిశయించునట్టుగా-నందనుఁడు-కుమారుఁడు ఉదయమయ్యెన్-జన్మించెను-అతఁడెవఁడనఁగా-వేద...డైన వేద-నాలుగు వేదములయొక్కయు-వేదాంగ-శిక్షాదివడంగములయొక్కయు శాస్త్ర

సీ॥ అంభోధివసనవిశ్వంభరావలయంబు*తనబాహుపురిమరకతముఁ జేసె। నశ్రాంతవిశ్రాణనాసారల
క్ష్మికిఁ*గవికదంబము చాతకములఁ జేసె- గకుబంతనిఖిలరాణ్ణికరంబు చరణమం * జీరంబు సాలభంజికలఁ
జేసె। మహనీయనిజవినిర్మలయశస్సరసికి*గగనంబు కలహంసకంబుఁ జేసె ॥ ౩౫ ॥ నతిశితకృపాణకృత్త
మత్తారివీర* మండలేశసకుండలమకుటనూత్న। మస్తమాల్యపరంపరామండనార్చి* తేశ్వరుండగు నార
సింహేశ్వరుండు॥ ౩౬

టీక ॥ అంభోధివసనవిశ్వంభరావలయంబు- అంభోధివసన। సముద్రమే వస్త్రముగాఁ గలిగిన। విశ్వంభరావలయంబు-భూమండలము-తన-స్వకీయమైన-బాహుపురిమరకతముఁ జేసెన్-బాహుపురి- కేయూరమందలి। అనఁగా బాహుభూషణమందలి। మరకతముఁ జేసెన్। పచ్చయనురత్నముగాఁ జేసెను - అశ్రాం...లక్ష్మికిన్-అశ్రాంత।విరామము లేని।విశ్రాణన। ఈవియను।ఆసారలక్ష్మికిన్।ధారారూపమైన వర్షసమృద్ధికి-కవికదంబము-కవీశ్వరసమూహమును-చాతకములఁ జేసెన్ - వానకోయిలలనుగాఁ జేసెను - కకుబంతనిఖిలరాణ్ణికరంబు-కకుబంత।దిగంతములయందలి। నిఖిల। సకలమైన। రాణ్ణికరంబు। రాజసమూహమును-చరణమంజీరంబు- కాలిగండపెండారమందుఁ జెక్కఁబడిన-సాలభంజికలఁ జేసెన్ - బొమ్మలనుగాఁ జేసెను-మహ...స్సరసికిన్ మహనీయ। పూజింపఁదగిన।నిజ।స్వకీయమైన। వినిర్మల।స్వచ్ఛమైన।యశః।కీర్తియను।సరసికిన్।కొలనుకు గగనంబు-ఆకాశమును - కలహంసకంబుఁ జేసెన్- మరాళమును జేసెను। ఎవఁడనఁగా-అతిశిత...డను-అతిశిత।మిక్కిలి వాడిగలిగిన। కృపాణ।కత్తిచేత।కృత్త।నరకఁబడిన।మత్త। మదించిన।అరివీరమండలేశ।శూరులైన శత్రురాజులయొక్క సకుండల।కర్ణాభరణములతోఁ గూడిన। మకుట।కిరీటములు గలిగిన। నూత్న। నవీనములైన।మస్తమాల్య। శిరోమాలికలయొక్క। పరంపరా।సమూహములనెడు। మండన। అలంకారముచేత। అర్చిత-పూజచేయఁబడిన। ఈశ్వరుండగు-రుద్రుఁడు గలిగిన - నారసింహేశ్వరుండు- నరసింహస్వేశ్వరరాయఁడని సంబంధము.— అనఁగా భూమి నిదన బాహుబలముచేత భరించినాఁడనియు - కవీశ్వరులకు నిరంతరము సునీవు లిచ్చినాఁడనియు - సమస్తదేశాధిపతులను జయించి నవి రుమ్మని మిత్తముగా వారి రూపములను గన కాలిగండపెండారమందు బొమ్మలుగాఁ జెక్కించినాఁడనియు। ఆకాశమును దాఁటి వ్యాపించియుండు కీర్తిగలవాఁడనియు।శివుఁడు కపాలమాలికలు ధరించువాఁడు గనుక తన శత్రురాజుల ననుబహు మందిని ఖండించి వారి శిరస్సులను దండలుగూర్పించి శివునకు సమర్పించినాఁడనియును తాత్పర్యము॥ ౩౬

తే॥ ఆనృసింహప్రభుఁడు తిప్పాంబవలన* నాగమాంబికవలన నందనులఁ గాంచె వీరనరసింహరాయభూవి
భుని నచ్యు* తాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు॥ ౩౭

టీక ॥ ఆనృసింహప్రభుండు - ఆనృసింహదేవరాయఁడు-తిప్పాంబవలనన్- తిప్పాంబయను నామెవలనను- నాగమాంబికవలనన్-నాగమాంబికయను నామెవలనను - నందనులఁ గాంచెన్ కుమారులఁగనెను। ఎవ్వరెవ్వరనఁగా-వీరనరసింహరాయ-వీరనరసింహరాయఁడను- భూవిభునిన్-భూపతిని-అచ్యుతాంశసంభవున్ విష్ణునంశముచేతఁ బుట్టిన-కృష్ణరాయ కృష్ణదేవరాయఁడను- క్షితీంద్రున్- భూమీశ్వరుని గాంచెనని సంబంధము॥ ౩౭

క॥ వీరనృసింహుఁడు నిజభుజ।దారుణకరవాలపరుషధారాహతవీ।రారియగుచు నేకాతప*వారణముగ నే
లె ధరన వారణమహిమన్॥ ౩౮

టీక ॥ వీరనృసింహుఁడు-వీరనరసింహరాయఁడు-నిజ...గుచున్-నిజ-స్వకీయమైన।భుజ।బాహువునందలి - దారుణ-భయంకరమైన।కరవాల-కత్తియొక్క। పరుష-కఠినమైన ధారాహత-వాయిచేత ఖండింపఁబడిన- వీరారియగుచున్। పరాక్రమవంతులైన శత్రువులుగలవాఁడగుచు - ఏకాతపవారణముగన్ - ఏకచ్ఛత్రాధిపత్యముగా- అవారణ.- అడ్డిలేని-మహిమన్- ప్రభావముచేత-ధరన్-భూమిని-ఏలెన్ పాలించెను॥ ౩౮

క॥ ఆవీభునసంతరంబ ధ। రావలయము దాల్చెఁ గృష్ణరాయఁడు చిన్నా। దేవియు శుభమతి తిరుమల। దేవియు నందనకుఁ గూర్చు దేవేరులు గాన్॥ ౩౯

టీక॥ ఆవిభునసంతరంబ- ఆవీరనరసింహరాయనితర్వాత- కృష్ణరాయఁడు - కృష్ణదేవరాయఁడు - చిన్నాదేవియు న్- చిన్నాదేవియును- శుభమతి- మంగళకరమైన మనస్సుగలిన- తిరుమలదేవియు న్- తిరుమలదేవియును- తనకుఁ గూర్చు తనకుఁ బ్రియము లైన - దేవేరులు గాన్ - భార్యలగుచుండఁగా- ధరావలయమున్- భూమండలమును- దాల్చె- ధరించినవాఁడాయెను॥ ౩౯

సీ॥ తొలఁగెను ధూమకేతుక్షోభ జనులకు * నతివృష్టిదోషభయంబు వాసెఁ। గంటకాగమభీతి గడచె నుద్ధత భూమి * భృత్కటకం బెల్ల నెత్తువడియె। మాసె నఘస్ఫూర్తి మరుభూములందును * నెలమూఁడు వానలు నిండఁ గురిసె। నాబాలగోపాల మఖిలసద్వ్రజమును * నానందమున మని నతిశయిల్లెఁ గం॥...... తే॥ బ్రజలకెల్లను గడు రామరాజ్య మయ్యెఁ। జారుసత్త్వాఢ్యుఁ డీశ్వర నారసింహ। భూవిభుని కృష్ణరాయఁ డభ్యుదయ మొందె। పెంపు మీఱంగ ధాత్రిఁ బాలింపుచుండ॥ ౪౦

టీక॥ జనులకున్- సమస్తప్రజలకును - ధూమకేతుక్షోభ- అరిష్టమైనయగ్నివలనఁ గలిగినబాధ- తొలఁగెన్ - ఒడిగిపోయెను- అతివృష్టిదోషభయంబు- అతివర్షములయొక్క భీతి- పాసెన్- విడిచిపోయెను- కంటకాగమభీతి - బందిపోట్లు పడువారివలని భయము- కడచెన్ - అతిక్రమించిపోయెను- ఉద్ధత- దురహంకారులైన- భూమిభృత్కటకంబెల్లన్ - రాజపురములన్నియు- ఎత్తువడియెన్- లేవ లేకపోయెను- అఘస్ఫూర్తి కలుషవిజృంభణము- మాసెన్ - స్వరూపనాశనమాయెను- మరుభూములందున్- నిర్జలభూములయందును నెలమూఁడు వానలు- నెలకుమూఁడేసివర్షములు- నిండఁ గురిసెన్। సంపూర్ణముగా వర్షించెను- ఆబాల...మున్- ఆబాలగోపాలము। చిన్నవాండ్రు గొల్లవాండ్రు మొదలుకొని- అఖిలసద్వ్రజమున్- సమస్తసత్పురుషసమూహమును- ఆనందమున మనిన్ - సంతోషముచేతఁ బ్రదుకుట - అతిశయిల్లెన్- వృద్ధిఁ బొందెను॥ ప్రజలకెల్లన్- జనులకందరికిని- కడు రామరాజ్య మయ్యెన్- మిక్కిలి రామరాజ్యము- అనఁగా శ్రీరాముఁ డేలిన రాజ్యమువలె నుండెను। యెప్పుడనఁగా చారుసత్త్వాఢ్యుఁడు- ఒప్పుచున్నబలముగలిగినట్టి- ఈశ్వరనారసింహ భూవిభుని కృష్ణరాయఁడు- ఈశ్వరప్రభుని కుమారుఁడైన- నారసింహదేవరాయని కొడుకైన- కృష్ణదేవరాయఁడు- అభ్యుదయ మొంది- శ్రేయస్సుఁ బొంది- పెంపు మీఱంగన్ - ఔన్నత్య మతిశయించునట్టుగా - ధాత్రిన్- భూమిని- పాలింపుచుండన్- ఏలుచుండఁగా నని సంబంధము.

మ॥ అలపోత్రిప్రభుదంష్ట్ర భోగివరభోగాగ్రాళి రాలుద్భటా। చలకూటోపలకోటి రూపుచెడ నిచ్చల్ రాయఁగా నైనమొ। క్కలు భూకాంతకు నున్న నయ్యె నరసక్ష్మాపాల శ్రీకృష్ణరా। యలబాహామృగనాభిసంకమదసాంద్రాలేపపంకంబునన్॥ ౪౧

టీక॥ భూకాంతకున్- భూదేవికి అల- ప్రసిద్ధుఁడైన పోత్రి...గ్రాళిన్- పోత్రిప్రభు- ఆదివరాహస్వామియొక్క- దంష్ట్ర। కోరయును। భోగివర- సర్పశ్రేష్ఠుఁడైనయాదిశేషుని యొక్క- భోగాగ్రాళిన్। పడగచివరలపజ్క్తియందలి- రాలు రాళ్లు- అనఁగా మణులును- ఉద్భటాచలకూటోపలకోటిన్- ఉద్భటాచల - అతిశయములైనపర్వతములయొక్క- కూటోపలకోటిన్ - శిఖరములయందలి రాళ్ల సమూహమును- రూపుచెడన్- ఆకారముచెడిపోవునట్టుగా- నిచ్చల్ -నిరంతరమును। రాయఁగా నైన। రాపాడఁగా నేర్పడిన- మొక్కలు। గాయపుగుంటలు। నరసక్ష్మాపాల శ్రీకృష్ణరాయల। నరసింహదేవరాయలకొమారుఁడైన- శ్రీకృష్ణదేవరాయల యొక్క- బాహా...బునన్। బాహా। భుజసంబంధమైన। మృగనాభి। కస్తూరితోడను। సంకుమద। జవ్వాజితోడఁ గూడిన- సాంద్ర। దట్టమైన- ఆలేపపంకంబునన్। పూఁతగంధపు బురదచేత- నున్నన య్యెన్। నున్నబడెను- అనఁగా గుంటలు పూడినవగా నుండెనని యర్థము— అనఁగా భూమిని భరించియుండు నాదివరాహమును. శేషాహిని బర్వతములను దిక్కరించి తనబాహువుచేత నేవహించె నాఁడని తాత్పర్యము.

ఉ॥ క్రూరవనేభదంతహతకుడ్యపరిచ్యుతవజ్రపజ్క్తిఁ బోల్పఁ గుమిపంగసుఖంబు గవులంచు వెసంగొనె పో

టీక॥ కృష్ణరాయభుజ- కృష్ణదేవరాయలయొక్క- భుజమూర్ధా
టోగతిన్- సేనలునడుచుదాడిచేతను- ధర - భూమియందలి
కేంధ్రూళులు - ఎఱ్ఱనిదుమారములు- వింధ్యగహ్వరముల్
జూరంగన్ - వింధ్యపర్వతగుహాలలోఁజొరఁ బారుచుండ -
వీరరుద్రగజరాట్పుచ్ఛ్రాంతముగ్ధాంగనలు- వీరరుద్ర గజ
రాట్పుచ్ఛ్రాంత । వీరరుద్రగజపతియొక్క యంతఃపురసంబం
ధమైన । ముగ్ధాంగనలు । ముగ్ధభావము గలస్త్రీలు । తార
కలన్- తమ రాకుహాలయొందు । కాఁపై యుండుటన్- కాఁ
పురముగానుండుటచేత । భూధి- మహూరమునుగనుఁగొని
చాలనచ్చెరువై- మిక్కిలియాశ్చర్యపడి- ఎఱ్ఱని- ఎఱ్ఱగా
నుండునట్టి-వింతచీఁకటులు । క్రొత్తచీఁకట్లు-వచ్చెన్-వచ్చె
ను- చూడరేయంచున్- చూడవమ్మాయని- వేశ్రమముగా
పోరతింజాతురు- మఱియువింతగాఁజూతురు- అనగానీకృ
ష్ణదేవరాయలువీరరుద్రగజపతిమీఁదికిరంశు వెడలిపోవు
చుండఁగా నాగజపతియంతఃపురస్త్రీలు కోఁహాడిహారిపో
యివింధ్యపర్వతగుహాలయందుండాఁగి యున్నారనుభావము

చ॥ అభిరతిఁ గృష్ణరాయఁడు జయాంకములన్ లిఖియించి తాళస । న్నిభముగఁ బొట్టునూరికడ నిల్పినకంబ
ము సింహభూధరప్రభుతిరునాళ్లకుం దిగుసురప్రకరంబు కళింగమేదినీ। విభుపకీర్తిజాలములు వేయుఁ బెట్టి పఠిం
చునిచ్చలున్ ౪౨॥

టీక॥ అభిరతిన్- అత్యంతాసక్తిచేత - కృష్ణరాయఁడు కృ
ష్ణదేవరాయఁడు జయాంకములన్ । తన గెలుపు బిరుదావ
ళులను - లిఖియించి- వ్రాయించి - తాళసన్నిభముగ-తా
టిమ్రానుపొడవుగలదియై -పొట్టునూరికడన్ - పొట్టునూర
నుపట్టణము దగ్గిర - నిల్పినకంబము- ప్రతిష్ఠచేయించిన స్తం
భమును. సింహభూధరప్రభు- సింహాచలవరాహనారసిం
హస్వామియొక్క- తిరునాళ్లకుం దిగు- తిరునాళ్లకు పోవు
త్సవమునకు దిగివచ్చుచున్న దేవ- సురప్రకరంబు - దేవ
తాసమూహము - కళింగమేదినీవిభు - కళింగభూపతియ
నఁగాగజపతియొక్క - అపకీర్తిజాలము-అపకీర్తియనుకా
టుకను సిని- వేయుఁ బెట్టి- పలువిధములు వ్రాసి - నిచ్చలున్
నిరంతరమును - పఠించున్ - చదువుచుండును - అనగానీకృ
ష్ణదేవరాయలుగజపతిని జయించి పొట్టునూరి యొద్ద జయ
స్తంభము నాటించెనని తాత్పర్యము॥ ౪౨

మహాస్రగ్ధర॥ ఎకరాలన్ మంచువాసాహిణములఁ గలభద్రేభసందోహవాహ। ప్రకరంబుం గొంచుఁ దత్త
త్ప్రభువులవసరన్ రాయభారుల్ విలోకో। త్సుకులై నిత్యంబు శ్రీకృష్ణునియవసరముల్ చూతురంచుండ కో
ల్వంతకయాప్రత్యూషమాసంధ్యముఁ బసవడి తన్మందిరాళిందభూమిన్ ౪౩॥

టీక॥ ఎకరాలన్- మొగసాలలయందును - మంచువాసా
హిణములన్ దూలములసరిపోత్తున స్తంభములమీఁది
కివచ్చినగుఱ్ఱపుతబేలాలయందును - కల- ఉన్నట్టి- భద్రే
భసందోహవాహప్రకరంబున్-భద్రేభ । మదపుటేనుఁగు
లసమూహమును - వాహప్రకరంబున్ । గుఱ్ఱములసమూ
హమును । కొంచున్ - కానుక బెట్టుటకై త్తముతీసుకొని- త
త్తత్ప్రభువులు- ఆయాదేశములరాజులు - పనుపన్- పం
పించఁగా - రాయభారులు - రాయభారమునడుపువారు
అనగావకీళ్లు - విలోకోత్సుకులై - దర్శించుటయందుల్లాస
ముగలవారై - నిత్యంబున్ - నిరంతరమును - కొల్వంతదక-
దర్శనము దొరకక- ఆప్రత్యూషము- ఆప్రత్యూషమనఁగాఁ
దెల్లవారిమొదలుకొని - ఆసంధ్యమున్- ఆసంధ్యమనఁగా
సాయంకాలపర్యంతమును-పసవడి - యత్నపూర్వకముగా
తన్మందిరాళింద భూమిన్ - ఆకృష్ణదేవ రాయల యింటి
ముంగిటియందు - శ్రీకృష్ణుని - సంపదతోఁగూడుకొన్న కృ
ష్ణదేవరాయలయొక్క - అవసరములు - సమయములను
జూతురందంప-అంతటఁగని పెట్టుచుందురు॥ ౪౩

చ॥ మదకలకుంభికుంభనవమౌక్తికముల్ గనుపట్టునట్టమై । వదలకఁ గృష్ణరాయకరవాలమునందగు ధారనీట
న । భ్యుదయమునొంది శాత్రవులపుట్టిమునుంగఁగ ఫేనపఙ్క్తితోఁ । బొదిగొనిపైపయి న్వెడలుబుద్బుదప
ఙ్క్తులవోలె బోరులన్॥ ౪౪

టీక॥ పోరులన్-యుద్ధములయందు-వదలక- ఎడతెగక పం
డును-కృష్ణరాయ-కృష్ణదేవరాయలయొక్క - కరవాలము
నందగు-ఖడ్గమందొప్పుచున్న - ధారనీటన్ - వాయిందను
నీటియందు- అభ్యుదయమునొంది- పుట్టి - శాత్రవులపుట్టి
మునుంగఁగన్-శత్రురాజులయొక్క-పుట్టిమునుఁగుచుండ
ఁగా- ఫేనపఙ్క్తి-తోన్-నురుగుతోఁగూడ । పొదిగిగుంపుగ

యొక్క-వక్షమున-సాంద్రముగానుండు - ప్రేఁపపజ్జ - పే మాతోనల్లినబుట్టలోనున్న - దంతపుబరణిన్ - దంతముతోఁ జేసినకరాటవాఁడు-నిని విన-నిండించిన- ఒకపసరు-ఒకజాతి యగాకురసము - ఇదియదియని చెప్పక- ఇచ్చినవాని దియనివ చింపక తత్పాదాంబుజయుగళిన్-ఆ ప్రవరాఖ్యుని రెండుపాదములయందును పూసెన్-లేపనము చేసెను॥ ౮౦

క॥ ఆమందిడియతఁడరిగిన। భూమీసురుఁడరిగెఁదుహినభూధరశృంగ। శ్యామలకోమలకానన। హేమాద్రిదరీఝరీనదీక్షాపేక్షన్॥ ౮౧

టీ॥ ఆమందిడి-ఆపసరుపూసి-అతఁడరిగిన్- ఆసిద్ధుఁడు పోఁగా-భూమీసురుఁడు- బ్రాహ్మణుఁడైన ప్రవరాఖ్యుఁడు- తుహిన... పేక్షన్-తుహినభూధర।హిమవత్పర్వతముయొక్క-శృంగ-శిఖరములయందలి-శ్యామల- పసరువర్ణముగలిగిన-కోమలలేఁతలైన-కానన-అరణ్యములయొక్కయు- హేమాద్రి-సువర్ణమయములైనకొండలయొక్కయు-ఝరీ-నదీప్రవాహములయొక్కయు నిరీక్షాపేక్షన్-జూచుటయందాసక్తిచేత - అరిగెన్- పోయినవాఁడాయెను-కనియెనగాఁబర్వతబిలమనియర్థము॥ ౮౧

వ॥ అని వినిపించి యమ్మహీసురవరుం డట్లరిగి యెట్లు ప్రవర్తించె నతనిపుణ్యవర్తనశ్రవణంబు మానసంబునకు హర్షోత్కర్షంబు పుట్టించెడు వాని వృత్తాంతంబు కృపాయత్తంబగుచిత్తంబున నానతియ్యవలయు ననియడుగుటయును॥

టీక॥ అనివినిపించి- ఈప్రకారముచెప్పఁగా నాకర్ణించి - అమ్మహీసురవరుండట్లరిగి - బ్రాహ్మణశ్రేష్ఠుఁడైనయాప్రవరాఖ్యుఁడుహిమవత్పర్వతమునకాతీరునఁబోయి-ఎట్లు ప్రవర్తించెన్ - ఏప్రకారముగాసంచరించెను- అతనిపుణ్యవర్తనశ్రవణంబు - అతనియొక్క ధర్మవంతమైననడవడియొక్క వినికి।మనంబునకున్ - మానసమునకు - హర్షోత్కర్షంబుపుట్టించెన్ । సంతోషాతిశయమునుగలుగఁజేసెను - తద్వృత్తాంతంబు - తదనంతరమందలిప్రవర్తనమును - కృపాయత్తంబగుచిత్తంబునన్- దయాగుణమునకధీనమైనమనస్సుచేత - ఆనతియ్యవలయునని - చెప్పవలయునని - అడుగుటయున్ - జైమినిపక్షులనుగూర్చియడుగఁగా॥ ౮౨

శా॥ గంగాస్వచ్ఛతరంగభంగికయశోగాఢచ్ఛవిచ్ఛన్నసా। రంగాంకాంకనిరంకుశప్రతికళాప్రౌఢిప్రియంభావుకా। గాంగేయాచలచాపనూపురవచోగాంభీర్యలీలాస్పదా। బంగాళాంగకళింగభూపసుభటాభ్రశ్రేణిఝంఝానిలా॥ ౮౩

టీక॥ గంగా...కాంక-గంగా।గంగానదియొక్క। స్వచ్ఛ।మాలిన్యరహితమైన। తరంగ।అలలయొక్క। భంగిక।రీతిగలిగిన।యశః।కీర్తియొక్క। గాఢ।సాంద్రమైన।ఛవి।కాంతిచేత। ఛన్న।కప్పఁబడిన।సారంగాంకాంక।చంద్రునియొక్కకళంకముగలవాఁడా-నిరంకుశ...భావుకా- నిరంకుశ।అడ్డులేని।ప్రతికలా।ప్రతివిద్యయొక్క।ప్రౌఢి।ప్రౌఢిమయందు।ప్రియంభావుకా।ఇష్టమునుబొందుచున్నవాఁడా- గాంగేయాచల...లీలాస్పదా- గాంగేయాచల।సువర్ణపర్వతము।అనఁగా మేరుపర్వతమే।చాప।ధనుస్సుగాఁగలిగినశివునియొక్క। నూపుర।కాలియందెయయినశేషాహివలెనే।వచః।వాక్కులయొక్క। గాంభీర్య-గుంభనముదని।లీలాస్పదా।విలాసమునకాధారమైనవాఁడా - బంగాళాంగ...ఝంఝానిలా - బంగాళ।బంగాళదేశముయొక్క।అంగ।అంగదేశముయొక్క।కళింగ।కళింగదేశముయొక్క।భూప।రాజసంబంధులైన।సుభట।శ్రేష్ఠులయినబంటులనునట్టి।అభ్ర।శ్రేణి।మేఘపఙ్క్తికి।ఝంఝానిలా।ఝంఝామారుతమైనవాఁడా- అనఁగా వానతోఁగూడినగాలియయినవాఁడాయనిఫలితార్థము॥ ౮౩

క॥ మండలికతపనశోభిత। మండలిపతిశయనకర్ణమండలితరసా। ఖండకవికావ్యదిగ్వే। దండశ్రుతిదళనసకలహతాడితపటహా॥ ౮౪

టీక॥ మండలిక...శయన। మండలిక।దేశమును।తపన।సూర్యునియందు।శోభిత - ప్రకాశించుచున్న మండలిపతి।శే

సాహాయ్య సేవ। శయన। శయనముగాఁ గలిగినవిష్ణుమూర్తివయినవాఁడా- కర్ణకుండలితరసాఖండకవికావ్య- కర్ణకుండలిత- కర్ణాభరణములుగాఁ జేయఁబడిన। రసాఖండ। శృంగారాదిరసములచేతఁ బరిపూర్ణమైన-కవికావ్య - కవీశ్వరులయొక్క ప్రబంధములుగలవాఁడా - దిగ్వేదండ...పటహా- దిగ్వేదండ- దిగ్గజములయొక్క-శ్రుతికర్ణ। చెవులు బ్రద్దలౌనట్లుగా। కలహ। యుద్ధములయందు తాడిత- కొట్టఁబడిన పటహ- భేరివిశేషముగలవాఁడా— మండలికుఁడనఁగా వింశతియోజన విస్తారదేశపాలకుఁడని శబ్దార్థకల్పతరువు— యీ మొదటిచరణమునకున్నర్థము చక్కఁగా విచారించవలెను

ఉత్సాహ॥ కుకురుకాశకురుకరూశకోసలాంధ్రసింధుబాహ్లీకశకాంగవంగసింహళేశకన్యకామణీ। ప్రకర
పాణిఘటితరత్నపాదుకాకలాచికా। ముకురవీటికాకరండముఖ్యరాజలాంఛనా॥ ౮౫

టీక॥ కుకురు... రాజలాంఛనా-కుకురు-కుకురుదేశమునకును కాశ-కాశదేశమునకును-కురు। కురుదేశమునకును - కరూశ కరూశదేశమునకును- కోసల- కోసలదేశమునకును-ఆంధ్ర ఆంధ్రదేశమునకును- సింధు సింధుదేశమునకును- బాహ్లీక బాహ్లీకదేశమునకును-శక-శకదేశమునకును- అంగ-అంగదేశమునకును-వంగ-వంగదేశమునకును- సింహళ- సింహళదేశమునకును. ఈశ-అధీశ్వరులైన రాజులయొక్క- కన్యకామణి కన్యారత్నములయొక్క-ప్రకర-సమూహముయొక్క- పాణి- హస్తములయందు-ఘటిత కూర్చఁబడిన। రత్నపాదుకా- మణులుచెక్కిన పావుకోళ్లును- కలాచికా- నీళ్లకూజా చెంబులును-ముకుర- అద్దములును-వీటికాకరండ పానుదానులును-ముఖ్య- మొదలుగాఁగలిగిన - రాజలాంఛనా-నృపచిహ్నములుగలవాఁడా— అనఁగాఁ బైనచెప్పఁబడిన రాజకుమార్తెలే దాసీజనమై యూడిగము సేయుచున్నారని తాత్పర్యము॥ కలాచికయనఁగా - దమ్మపడిగయని కొందఱు॥ ౮౬

గద్య॥ ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంకపంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిరనందవరపురవంశోత్తంసశఠగోపతాపసప్రసాదాసాదితచతుర్విధకవితామతల్లికాల్లసానిచొక్కయామాత్యపుత్ర పెద్దనార్యప్రణీతంబైన స్వారోచిషమనుసంభవంబను మహాప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము

టీక॥ ఇది-ఈగ్రంథము- శ్రీమత్ ... ప్రణీతంబైన- శ్రీమత్- సంపదతోఁగూడిన- ఆంధ్రకవితాపితామహ - ఆంధ్రకవిత్వమునకు బ్రహ్మయనునట్టుగా- సర్వతోముఖాంక-అంతట వ్యాపించినట్టిబిరుదుగలిగినవాఁడును। పంకజాక్ష-విష్ణుమూర్తియొక్క-పాదాంబుజ। చరణకమలములకు-అధీన-వశమైన-మాన సేందిందిర-మనస్సనుతుమ్మెదగలిగినవాఁడును। నందవరపుర। నందవరపురసంజ్ఞగల - వంశ-కులమునకు-అనఁగా నందవరీకవంశమునకు-ఉత్తంస శిరోభూషణమైనవాఁడును- శఠగోపతాపస। శఠగోపయతియొక్క-ప్రసాద-అనుగ్రహముచేత- ఆసాదిత-పొందఁబడిన- చతుర్విధ-నాలుగుప్రకారములు- ఆశుగాబంధకవిత్వ చిత్రకవిత్వ గర్భకవిత్వ ఆశుకవిత్వములను భేదములుగలిగినవాఁడును - కవితామతల్లిక। కవిత్వమందు శ్రేష్ఠుఁడైనవాఁడును- అల్లసానిచొక్క-యామాత్యపుత్ర- అల్లసానిచొక్కయయను ప్రధానికుమారుఁడైనవాఁడునునైన- పెద్దనార్య - పెద్దనయను పూజ్యునిచేత-ప్రణీతంబైన- చెప్పఁబడిన। స్వారోచిషమనుసంభవంబను-స్వారోచిషమనుసంభవమనునట్టి-మహాప్రబంధంబునందుఁ-గొప్పప్రబంధమందు - ప్రథమాశ్వాసము- మొదటియాశ్వాసము॥







# స్వారోచిషమనుచరిత్రం.

## రెండవయాశ్వాసము.



క॥ శ్రీఖండశీతనగమ। ధ్యాఖండక్షోణిమండలాఖండలవి। ద్యాఖేలనభోజసుధీ। లేఖద్రుమకృష్ణరాయ లీలామదనా॥ ౧

టీక॥ శ్రీఖండ... ఆఖండల - శ్రీఖండశీతనగ-మలయపర్వతహిమవత్పర్వతములయొక్క-మధ్య-నడుమనున్న అఖండ-సంపూర్ణమైన। క్షోణిమండల। భూవలయమునకు- ఆఖండల-ఇంద్రునివలెనున్నవాఁడును। విద్యాఖేలనభోజ-విద్యావినోదమందు భోజరాజుతో సమానుఁడను। సుధీలేఖద్రుమ సుధీ। విద్వాంసులకు। లేఖద్రుమ। కల్పవృక్షమువలెనున్నవాఁడును। లీలామదనా। విలాసమందు మన్మథునితో సమానుఁడను నైన। కృష్ణరాయ-ఓకృష్ణరాయా యని కృతీశ్వరసంబోధనము—మండలమనఁగా జతురశ్రమమనియుఁ జత్వారింశద్యోజనదేశమనియు వలయాకారమనియుఁ జెప్పుచున్నారు.

వ॥ అవధరింపుము జైమినిమునీంద్రునకుఁ బ్రజ్ఞాసాంద్రంబులగు పక్షీంద్రంబులు అవ్వలికథ యిట్లని చెప్పందొడంగె.

టీక॥ అవధరింపుము। చిత్తగింపుము- జైమినిమునీంద్రునకున్। జైమినియను తాపసశ్రేష్ఠునకు- ప్రజ్ఞాసాంద్రంబులగు-బుద్ధిచేత నిబిడములైన। పక్షీంద్రంబులు - ఖగశ్రేష్ఠములు- అవ్వలికథ-తరువాతికథ-ఇట్లని చెప్పందొడంగెన్-ఈప్రకారమని చెప్పుటకుపక్రమించెను॥

చ॥ అటఁజని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ। పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగ
నిస్స్వన। స్ఫుటనటనానుకూలపరిఫుల్లకలాపకలాపిజాలమున్। గటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్॥ ౨

టీక॥ భూమిసురుఁడు। పుడమివేలుపయిన ప్రవరాఖ్యుఁడు- అటఁజని ఆదిక్కుకయిపోయి - అంబరచుంబి...జాలమున్- అంబరచుంబి-ఆకాశముయొక్క-స్పర్శగలిగిన। శిరః। శిఖరములవలననుండి -సరత్ - జారుచున్న - ఝరీపటల-ప్రవాహసమూహములయందు*ముహుర్ముహుర్లుఠత్ - మాటిమాటికిఁ బొరలుచున్న * అభంగ- ఎడలేని*తరంగ-అలలను మృదంగ। మద్దెలలయొక్క *నిస్స్వన-ధ్వనులచేత* స్ఫుట - ప్రకటముగుచున్న * నటనానురూప- నాట్యమునకుఁదగునట్టుగా పరిఫుల్ల-విప్పఁబడినట్టి*కలాప-పింఛములుగల* కలాపిజాలమున్ - నెమళ్లయొక్క గుంపులుగలిగినదియును * కటక... సాలమున్-కటక। పర్వతముయొక్క నడుమునందు* చరత్ సంచరించుచున్న * కరేణు-ఏనుఁగులయొక్క *కర। తొండములచేత*కంపిత*కదిలించఁబడిన* సాలమున్- మద్దిమ్రాకులుగలిగిన* శీతశైలమున్-హిమవత్పర్వతమును* కాంచెన్- జూచెను—శిరస్సరిజ్ఝరీయనియు పాఠము—కరేణుశబ్దము ఆఁడుయేనుఁగుల యందును మగయేనుఁగుల యందును వర్తించును॥

వ॥ కాంచి యంతరంగంబు తరంగితంబగు హర్షోత్కర్షంబున.

టీక॥ కాంచి-జూచి* అంతరంగంబున్-మనస్సునందు*తరంగితంబగు- తరంగములవలెనాచరింపఁబడిన—అనఁగా నెడతెగకుండనున్నట్టి* హర్షోత్కర్షంబునన్ - సంతోషాతిశయముచేత॥

క॥ నరనారాయణచరణాం - బురుహద్వయభద్రచిహ్నముద్రితబదరీ- తరుషండమండలాంతర-సరణిన్ధరణీ సురుండు సనఁజన నెదుటన్॥ ౩

టీక॥ నరనారాయణ...సరణిన్ నరనారాయణ-నరనారాయణులను విష్ణునంశము వలనసంభవించిన మహాపురుషులయొక్క * చరణాంబురుహద్వయ। పద్మములవంటి పాదయుగళమందలి*భద్ర-శుభకరములైన* చిహ్న - లాంఛనములచేత-అనఁగా హలకులిశచక్రాది రేఖలచేత*ముద్రిత- ముద్రించఁబడిన-బదరీతరు- రేగుచెట్లయొక్క-షండ- సమూహముయొక్క -మండలాంతర- ఆవరణమధ్యమందలి-సరణిన్- మార్గమునందు - ధరణీసురుఁడు - బ్రాహ్మణుఁడైన ప్రవరాఖ్యుఁడు - చనఁజనన్ - పోవుచుఁబోవుచునుండఁగా- ఎదుటన్ - అగ్రభాగమందు॥

౩

మనసులోఁ - నాయొక్క - చిత్తప్రకారము - వర్తించు నడచుకొనునట్టి - కులకాంత - పతివ్రతయైనభార్య - మది నెంత - మనస్సునం దెంతగా - కుందునొకో - వ్యసనపడుచున్నదో - గెడతోడు - అతిసహాయులును - నీడలై - రక్షకులును నయిక్రీడించు - విహరించుచుండునట్టి - సచ్ఛాత్రులు - యోగ్యులైనశిష్యులు - ఇంతకున్ - వీరందఱువిచారమునకంటెను - ఎంతచింతింతురో - ఎంతవిచారపడుచున్నారో ॥ అతిథిసంతర్పణంబులు - గృహాగతజనులయొక్క పూజనములు - ఆవేశిక ఆగంతురతిథియనియమరము - ఏమయ్యెనొకో - ఏమైపోయెనో - అగ్నులేమయ్యెనొకో - అగ్నిహోత్రములేమైపోయెనో - నిత్యంబులైన - నిరంతరాచరణీయములైన - కృత్యములఁబాపి - క్రియలవలననుండి యెడబాపి - దైవంబు - దైవము - కినుకన్ - క్రోధముచేత - ఇట్లు ఈప్రకారము - మిన్నులుపడ్డచోటన్ - ఆకాశము వాలినస్థలమందు । అనఁగా మిక్కిలి దూరమైన యూర్ధ్వభాగమందు పాఱవైచునె - పడవేసునా — అనఁగాఁ గమీఁదఁదన యింటికిఁ బోవుప్రాప్తి లేదని విచారపడెనని తాత్పర్యము॥

క॥ ననునిలు సేరునుపాయం । బొనరింపఁగఁజాలు సుకృతి యొకఁడొదవఁడొకో । యనుచుం జింతాసాగర । మునమునిఁగి భయంబుగదురఁ బోవుచు నెదుటన్॥ ౨౦

టీక॥ ననున్ - నన్ను ॰ ఇలు సేరునుపాయంబు - ఇంటికిఁ జేరునేర్పును * ఒనరింపఁగఁజాలు - చేయఁజాలినట్టి * సుకృతి - పుణ్యాత్ముఁడు * సుకృతీపుణ్యవాన్ధన్యయనియమరము * ఒకఁడొదవఁడొకో - ఒకఁడెవఁడైన సహాయపడఁడుగదా * అనుచున్ - అనియనుకొనుచును - చింతాసాగరమునన్ - విచారమనుసముద్రమందు - మునిఁగి మగ్నుఁడైనవాఁడై * భయంబుగదురన్ - భయముపొందుచునుండఁగా * పోవుచున్ - చనుచు ॰ ఎదుటన్ - తనయెదుట॥ ౨౧

సీ॥ కులిశధారాహతిఁ బొలుపునఁ బైనుండి * యడుగు వోవఁగ జేగురైనతటులఁ । గనుపట్టులోయగంగానిర్ఝరము ధార * చలువమై యయ్యేటికెలఁకులందు । ఇసుకవెట్టిననేల నేచి యర్కాంశులఁ * జొరనీకదట్టమై యిరులుగవయు । క్రముకపున్నాగనారంగరంభానారి * కేళాదివిటపికాంతారవీథిఁ ॥ ౨౧॥ తే॥ గెరలుపికశారికాకీరకేకిభృంగ । సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత । దరులు ప్రతిశబ్దమీనగంధర్వయక్ష । గానఘూర్ణితమగు నొకకొండఁ గనియె॥ ౨౨

టీక॥ కులిశధారహతిఁబొలుపునన్ - కులిశ - వజ్రాయుధముయొక్క - ధారాహతిఁబొలుపునన్ । వాయిచేతినఱుకఁడోయనునట్టుగా * పైనుండి - మీఁదనుండి - అడుగు వోవఁగన్ - క్రిందికంటునట్టుగా ॰ జేగురైన - ఎఱ్ఱజేగురుకాంతిగలిగిన * తటులన్ - దరులయందు * కనుపట్టు - అగుపడుచున్న - లోయన్ - కోనయందు - గంగానిర్ఝరము - గంగాప్రవాహముయొక్క - ధార - సంపాతము చలువమై - శీతలమై యుండు - అయ్యేటి ఆగంగానదియొక్క - కెలఁకులందున్ - రెండుపైపులయందును - ఇసుకవెట్టిననేలన్ - ఇసుకచేరినభూమియందు * ఏచి - పెరిగి * అర్కాంశు సూర్యకిరణములను - చొరనీక - ప్రకాశింపనియ్యక - దట్టమై - సాంద్రమై * ఇరులుగవయు - చీకట్లు గ్రమ్ముచున్న * క్రముక...వీథిన్ - క్రముక । పోకమ్రానులును । పున్నాగ । పొన్నచెట్లును । నారంగ ॥ నారింజచెట్లును । రంభా - అఁటిచెట్లును । నారికేళ । టెంకాయచెట్లును ఆది - మొదలైన - విటపి । వృక్షములఁతోఁగూడిన । కాంతారవీథిన్ వనరాజియందు । కెరలు ఉద్రేకించుచున్న పిక...ధ్వని పిక కోకిలలయొక్కయు । శారికా । గోరవంకలయొక్కయు । కీర - చిలుకలయొక్కయు - కేకి - నెమళ్లయొక్కయు - భృంగ - తుమ్మెదలయొక్కయు । సారస - బెగ్గురులయొక్కయు - ధ్వని - కంఠనాదము * తనలోని - తనలోనున్న * చంద్రకాంత - నెలరాతిమయములైన - దరులు - కొండబిలములు * ప్రతిశబ్దమీనన్ - ప్రతిధ్వనిని బుట్టించుచునుండఁగా - గంధర్వయక్షగానఘూర్ణితమగు - గంధర్వ - గంధర్వులయొక్క - యక్ష యక్షులయొక్క - గాన - సంగీతముచేత । ఘూర్ణితమగు - తిరుగుడుపడుచున్న - ఒకకొండన్ - ఒకపర్వతపుగొందిని - కనియెన్ జూచినవాఁడాయెను । అనఁగా నొకలోయను జూచెను॥

క॥ కనుఁగొని యిది మునియాశ్రమ । మనిత హాతహా ప్రేడమి యచటికరిగిన నాతుం । గననగు నొక తెఱువయనిమనమునఁ గలదిగులు గొంత మట్టుపడంగన్॥ ౨౩

సామర్థ్యముచేత- పలికించు- మొఱయించెడు- గీతప్రబంధ ములకున్- గానములకు। క్రమ...మానములు- క్రమ- సుంద రమైన- కరపంకరుహ- హస్తకమలములయందలి-రత్నక టక- మణిస్థాపితమైన కంకణములయొక్క- ఝణఝణ - ఝణఝణయను- ధ్వనిస్ఫూర్తి। నాదసమృద్ధి- తాళమా నములన్ - తాళప్రమాణములను। తెలుపన్ - తెలియ జే యుచుండగా- ఇంపుదళుకొత్తన్-ఆనందమతిశయించునట్టు గా వీణవాయించుచుండె- వల్లకివినోదించుచు నుండినదై- వీణాతు వల్లకీవిపంచియని యమరము॥ ౩౧

ఉ॥ అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసిల్లఁ గాంతిపెల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపఙ్క్తులు గ్రు

మ్మరింపఁగా। గబ్బి మెఱుంగుచన్నుఁగవ గర్వొప్పి శవన్ మదిలోనికోర్కు లా। గుబ్బతిలంగఁ జూచె నలకూబరస

న్నిభు నద్ధరామరున్ ౩౨

టీక॥ అబ్బురపాటుతోడన్- అదరుపాటుగా। నయనాంబు జములు - కమలములవంటికన్నులు - వికసిల్లన్। వికా సమునొందఁగా- కాంతి-శోభ- పెల్లుబ్బి-పొంగి -కనీనికలు తారకలు-తారకాక్ష్ణః కనీనికా ఇత్యమరము- వికసితోత్ప లపఙ్క్తులు। వికసిత। పూచిన-ఉత్పల। నల్లగలువయొక్క। ప ఙ్క్తులు । మాలికలు। క్రుమ్మరింపఁగాన్- చల్లుచుండఁగా- గబ్బి- వట్రువైన - మెఱుంగు - కాంతిగలిగిన- చన్నులు - కుచములు। గగుర్పొడుచన్। రోమాంచమునొందుచుండఁగా మదిలోని - మనస్సునందున్న- కోర్కులు - వాంఛలు-ఆగు బ్బతిలంగన్। సందడిఁజేయుచుండఁగా। నలకూబరసన్నిభున్ కుబేరపుత్రుఁడైన నలకూబరునితో సమానమైన చక్కఁదన ముగలిగిన* అద్ధరామరున్ -బ్రాహ్మణుఁడైన యాప్రవరా ఖ్యుని। జూచెన్। కనుఁగొనెను॥ ౩౨

ఉ॥ జూచి ఝణంఝణత్కటకసూచితవేగపదారవిందయై లేచి కుచంబులుం దుఱుము లేనడుమల్లలనాడ నయ్యె

డం। బూచినయొక్కపోకనును బోదియఁ జేరి విలోచనప్రభా। వీచికలం దదీయపదవిం గలశాంబుధి వెల్లిగొల్పుచున్

టీక॥ జూచి। కనుఁగొని। ఝణం... విందయై। ఝణంఝణ త్కటక। ఝణంఝణయనిధ్వనిచేయుచున్నకడియములచే త। సూచిత। తెలుపఁబడిన। వేగ। త్వరగలిగిన। పదారవిందయై పాదపద్మములుగలదై। లేచి। గుబాలునలేచి। కుచంబులున్ స్తనములును। తుఱుమున్। కొప్పును। లేనడుము। సూక్ష్మమ ధ్యమును। అల్లలనాడన్। కదలుచుండఁగా। అయ్యెడన్। అ స్థలమందు। పూచిన। వికసించిన। ఒక్క। ఒకానొక। పోక నును బోదియన్। నున్నని క్రముకవృక్షముచాటున* చేరి। ప్రవేశించి - విలోకన-జూపులయొక్క-ప్రభా-కాంతులను వీచికలన్ -తరంగములచేత - భంగస్తరంగ ఊర్మిర్వా స్త్రియాంవీచియనియమరము - తదీయ-ఆప్రవరునిసంబంధమైన - పదవిన్-సౌందర్యవిభవమును - కలశాంబుధి వెల్లిన్-క్షీరసముద్రప్రవాహమును - కొల్పుచున్ కలుగఁజేయుచును-తదీయ। ఆవరూథినిసంబంధమైనదియనికొందఱు॥ ౩౩

మ॥ మునుమున్ బుట్టెడుకొంకు లౌల్యమున డెందంబున్ విస్తీర్ణతం। జొనుపం గోర్కులు క్రేళ్లుద్రిప్ప ముది

మెచ్చు లెప్పలల్లార్పన। త్యనుషంగస్థితి జిచ్చపాటొసఁగ నొయ్యారంబునం జంద్రిక। ద్దనుకం జూచె లతాం

గి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్॥ ౩౪

టీక॥ మునుమున్ ముందుముందుగా* పుట్టెడు జనించుచు న్న* కొంకు సంకోచము-లౌల్యమున డెన్ చంచలభావము మీఁగా మోదంబు సంతోషము విస్తీర్ణతన్ విశాలత్వము ను చొనుపన్ ప్రవేశింపఁజేయఁగా। అనఁగా విప్పఁజేయగా కోర్కులు వాంఛలు క్రేళ్లుద్రిప్పన్ దుముకుపరుగులెత్తిం చఁగా మదిమెచ్చులు హృదయమందున్న శ్లాఘలు* రెప్పలల్లార్పన్ పక్ష్మముల నాడింపగా అత్యనుషంగస్థి తిన్ అత్యంతాసక్తిచేత జిచ్చపాటొసంగన్ నిశ్చేష్టతను గల్పించఁగా ఒయ్యారంబునన్ విలాసముచేత చంద్రికలు వెన్నెలలు తనుకన్ కాయఁగా లతాంగి తీఁగెవంటిదేహ ముగలవరూథిని ప్రఫుల్లనేత్రపద్మంబులన్ ప్రఫుల్లిత। వి కిసిలిపూచిన। నేత్రపద్మంబులన్। పద్మములవంటినయన ములచేత భూసురున్ బ్రాహ్మణోత్తముఁడైన ప్రవరాఖ్యు ని జూచెన్ వీక్షించెను॥ ౩౪

౪౭| తే॥ కనకనగసీమఁగల్పవృక్షములనీడఁ । బచ్చరాచట్టుగమిరచ్చపట్టుమాకుఁ। బద్మసంభవవైకుంఠభర్గసభలు । సాముగరిడీలుమాకుగోత్రామరేంద్ర॥ ౪౭

టీక ॥ గోత్రామరేంద్ర - బ్రాహ్మణశ్రేష్ఠుఁడా- చిన్న- లేఁతవయసుగల - వెన్నెలకందు - నెలబాలుని | అనఁగా బాలచంద్రుని - వెన్నుఁదన్ని - వీఁపును బాదతాడనముఁ జేసి- అనఁగా ననుసరించి- సుధాబ్ధిన్ - పాలకడలియందు - పొడమిన - జనించిన - చెలువ స్త్రీ | అనఁగా లక్ష్మీదేవి- మాకున్ మాకు - తోఁబుట్టు - కూడఁబుట్టినది - రహిఁ పుట్టన్ - ప్రీతిపుట్టునట్లుగా - జంత్రగాత్రముల - వీణాకంఠముల చేత - రాల్లరఁగించు - పాషాణములను గరఁగఁజేసెడు- విను..వి గ్రత్తమైన - గాంధర్వంబు - గానము - మాకున్- మాకు విద్య చదువు - ననవిల్తు - మన్మథునియొక్క - శాస్త్రంబు- శాస్త్రసంబంధములైన | అనఁగాఁ గామకళాశాస్త్రసంబంధములైన - మినుకులు - వాక్యములు - ఆవర్తించుపని - వల్లించు కార్యము - మాకున్ - మాకు - వెన్నతోఁబెట్టినది చిన్నతనములో నవనీతముఁ బెట్టునప్పుడే కూడనునిచినది- హయమేధ రాజసూయములు నాన్ - హయమేధ| అశ్వమేధము । రాజసూయములునాన్ । రాజసూయమనునట్టిగా పేర్పడ్డ - ప్రసిద్ధిని బొందిన - సవనతంత్రంబులు- యాజవిధులు - మాకున్ - మాకు - ఉంకువలు - ఓలులు-కనకనగసీమన్ - మేరుపర్వతప్రదేశమందు - కల్పవృక్షములనీడన్ - సంతానములను దేవవృక్షచ్ఛాయను - పచ్చరాచట్టుగమి - మరకతమణులయొక్క-కొండగుంపు * మాకున్-మాకు రచ్చపట్టు-కొలువుతీరెడుస్థానము * పద్మసంభవ - బ్రహ్మదేవునియొక్కయు * వైకుంఠ - విష్ణుదేవునియొక్కయు * భర్గ - సాంబమూర్తియొక్కయు * సభలు - కొలువుసావడులు * మాకున్ * మాకు * సాముగరిడీలు * మల్లవిద్యాశాలలు॥ ౪౭

కం॥ పేరువరూథినియండ్రుమ । మ్మారఘృతాచీతిలోత్తమాహరిణీహే । మారంభాశశిరేఖలువార । గుణాఢ్యలుమదీయలగుప్రాణసఖుల్॥ ౪౮

టీక ॥ పేరు । నామధేయము * వరూథినియండ్రు । వరూథినియని చెప్పుదురు। కుమార । చిన్నవాఁడా । ఉదారగుణాఢ్యలు। అతిశయమైన గుణసంపత్తిగలిగిన | ఘృతాచీతిలోత్తమాహరిణీహేమారంభాశశిరేఖలు । ఘృతాచి । తిలోత్తమ । హరిణి । హేమ। రంభ । శశిరేఖలను నామములుగల యప్సరసలు | మదీయలగు । నాసంబంధినులైన । ప్రాణసఖులు । ప్రాణప్రదమైన చెలికత్తెలు ౪౮

మ ॥ బహురత్నద్యుతిమేదురోదరదరీభాగంబులంబొల్చుని । మ్మిహికాహార్యమునంజరింతుమెప్పుడుంబ్రేమన్నభోవాహినీ । లహరీశీతలగంధవాహపరిఖేలన్మంజరీసౌరభ। గ్రహణేందిందిరతుందిలంబులివిమత్కాంతారసంతానముల్ ౪౯

టీక ॥ బహు...భాగంబులన్ । బహు । విస్తారములైన।రత్న । మణులయొక్క । ద్యుతి । కాంతులచేత । మేదుర। దట్టములైన | ఉదర । గర్భములుగల । పిచండకుక్షిజఠరోదరతుందమనియమరము । దరీభాగంబులన్ । కొండబిలప్రదేశముచేత । పొల్చు-ఒప్పుచున్న | ఇమ్మిహికాహార్యమునన్ | ఈహిమవత్పర్వతమునందు | ఎప్పుడున్ | ఎల్లప్పుడును ప్రేమన్ | ప్రీతిచేత - చరింతుము- సంచరించుచుందుము - నభో...బులు-నభోవాహినీ | ఆకాశగంగయొక్క- లహరీ| ప్రవాహముయొక్క| శీతల। చల్లదనముతోఁగూడిన - గంధవాహ । వాయువువలన। పరిఖేలత్ । మిక్కిలి కదలుచున్న | మంజరీ : పూగుత్తులయందలి - వల్లరీమంజరీయనియమరము । సౌరభ । వాసనలయొక్క |గ్రహణ । స్వీకారముగలిగిన | ఇందిందిర । తుమ్మెదలచేత । తుందిలంబులు । సంపూర్ణములైనవి - ఇవి - ఈతోఁచుచున్నయవి - మత్కాంతారసంతానములు - మత్కాంతార । నాసంబంధమైన యడవియందలి - సంతానములు।కల్పవృక్షములు | చూడుమాయని శేషము॥ ౪౯

క ॥ భూసురకైతవకుసుమశ । రాసనమాయింటివిందవైతివిగైకొ । మ్మాసనమస్మన్మణిభవ । వాసీనతసేదఁదేఱియాతిథ్యంబున్ ౫౦

టీక ॥ భూసుర - బ్రాహ్మణుఁడవు - కైతవకుసుమశరాసన- కైతవ।కపటముతోఁగూడిన।కుసుమశరాసన।మన్మథుఁడా। మాయింటివిందవైతివి-మాగృహబంధువైతివి।అస్మన్మణిభవనాసీనతన్ ।అస్మత్ - మాయొక్క-మణి-రత్నమయమైన

భవన * మందిరమునందు - ఆసీనతన్ * కూర్చుండుటచేత - సేదఁదేటి - ఊరటనుబొంది * ఆసనమున్ - పీఠమును • ఆతిథ్యంబున్ - అతిథిపూజను * కైకొమ్మా - గ్రహింపుమా । అనఁగా మాయింటికి బంధువుఁడవై వచ్చితివి గాన మణిస్థాపితమైన మాగృహమునకువచ్చి పీఠము మీఁదఁగూర్చుండి బడలికదీర్చుకొని యతిథిపూజను గ్రహింపుమా యనుట॥ ౫౦

తే॥ కుందనమువంటి మేను మధ్యందినాత। పోష్ణహతిఁ గందె వడ డాఁకె కొప్పులాలుకు। వదనమస్మద్గృహంబుఁ బావనముఁ జేసి। బడలికలు వాసి చనుమన్న బ్రాహ్మణుండు॥ ౫౧

టీక ॥ కుందనమువంటి - తప్తకాంచనముతో సమానమైన * మేను - శరీరము * మధ్యందినాతపోష్ణహతిన్ - మధ్యందిన। పగలింటి - ఆతపోష్ణహతిన్ । ఎండ వేఁడిమి తాఁకుడుచేత * కందెన్ - నల్లనాయెను * ఒప్పులాలుకు - ముద్దులు గులికెడు * వదనము - మోము * వడదాఁకెన్ • శ్రమఁ జెందినది * అస్మద్గృహంబున్-మాయిల్లును • పావనముఁ జేసి - పవిత్రమొనర్చి। అనఁగా మాయింటికివచ్చి * బడలికలు వాసి - శ్రమ వారించుకొని * చనుమన్నన్ - పొమ్మని పలుకఁగా • బ్రాహ్మణుండు - విప్రుఁడు॥ ౫౧

ఉ॥ అండజయాన నీ వొసఁగునట్టి సపర్యలు మాకు వచ్చె నిం। దుండఁగ రాదు పోవలయు నూరికి నింటికి నిప్పుడే మఱా। కుండ నొకండు వచ్చు మఱియొండునె భక్తియ చాలు సత్క్రియా। కాండము దీర్ప వేగఁ జనఁగావలయుం గరుణింపు నాపయిన్॥ ౫౨

టీక ॥ అండజయాన - హంసనడలవంటి నడలుగలదానా * నీవొసఁగునట్టి - నీవుచేయునట్టి * సపర్యలు - పూజలు * పూజా నమస్యాపచితిస్సపర్యార్చార్హణాస్సమా ఇత్యమరము • మాకువచ్చెన్ - మాకుఁజేరినది * ఇందుండఁగరాదు - ఇచ్చటనుండఁదగదు • ఊరికిన్ - గ్రామమునకు * పోవలయున్ చనవలెను * ఇంటికినిప్పుడు - మీగృహమునకు సమయమందు * నను రాకుండ నొకండు - నేను రాకున్న నొకటి * వచ్చు మఱియొండునే • వచ్చిన మఱియొకటా * భక్తియ చాలున్ - భక్తియుండుటయే చాలును • సత్క్రియాకాండము - సత్కర్మకలాపము * తీర్పన్ - నిర్వర్తించుటకు । అనఁగా మాధ్యాహ్నికకృత్యములు జరిగించుటకొఱకు * వేగఁ జనఁ గావలయున్ - శీఘ్రముగాఁ బోఁదగినది * కరుణింపు నాపయిన్ - నామీఁద దయచేయుము॥ ౫౨

ఉ॥ ఏనిఁక నిల్లు సేరుటకు నెద్ది యుపాయము మీమహత్త్వము। ల్మానిసి దివ్యముల్ మదిఁదలంపఁగ నెందును మీకసాధ్యము। ల్గానముగానఁ దల్లి ప్రజలన్ననుఁ గూర్పుమటన్న లేఁతన। వ్వాననసీమ నదోఁప ధవళాయతలోచన వానికిట్లనున్॥ ౫౩

టీక ॥ ఏన్ - నేను • ఇఁకన్ - ఇంకమీఁద * ఇల్లు సేరుటకున్ - గృహము పొందుటకు • ఎద్ది యుపాయము - ఉపాయమేది * మీమహత్త్వములు - మీప్రభావములు * మానిని - ఓవరూథిని • దివ్యములు - దేవతాసంబంధములు * మదిఁదలంపఁగన్ - మనస్సున స్మరింపఁగా • ఎందున్ - ఎచ్చట • మీకసాధ్యములు - మీకు సాధింపఁగూడని కార్యములు • కానముగానన్ - చూడముగనుక • తల్లి - ఓజననీ ప్రజలన్ - జనులలో * ననుఁగూర్పుము - నన్నుఁ జేర్పుము • అటన్నన్ - ఆ విప్రవరుఁడు పలుకఁగా • లేఁతనవ్వు - చిఱునగవు * ఆననసీమన్ - ముఖప్రదేశమందు • వక్త్రాస్యే వదనంతుండమాననం లపనం ముఖమిత్యమరము * తోఁపన్ - కనుపడునటుగా • ధవళాయతలోచన - తెల్లనికాంతులు గలిగి విశాలములైన నేత్రములు గలిగిన వరూథిని * వానికిట్లనెన్ - ఆప్రవరునకిట్లనఁబలికెను ౫౩

ఉ॥ ఎక్కడియూరు కాల్నిలువకింటికిఁ బోవలెనంచు నెంచెదీ। వక్కట మీకుటీరనిలయంబులకున్ సరిరాకపోవునే। యిక్కడిరత్నకందరము లిక్కడిచందననందనోత్కరం। బిక్కడిగాంగసైకతము లిక్కడియీలవలీనికుంజముల్॥ ౫౪

టీక ॥ ఎక్కడియూరు - ఎక్కడిగ్రామము । అనఁగా నూరిలోనేమి సామ్రాజ్యమున్నదనుట • కాల్నిలువక - నిలువ మనసు రాక - ఇంటికిఁ బోవలెనంచున్ - గృహమునకుఁ జనవలెనని - యెంచెదు - తలంచుచున్నావు - ఈవు - నీవు - అక్కట - అయ్యయో - మీకుటీరనిలయంబులకున్ - మీస డి పెలవు - ఇక్కడి - ఈస్థలమందున్న - రత్నకందరములు - మణిమయములైన గుహలును - ఇక్కడి - ఈస్థలమందున్న • చందననందనోత్కరంబు - శ్రీగంధవృక్షములుగల యుద్యానవనసమూహమును - ఇక్కడి • ఈ చోటునన్న - గాంగసైకతములు - మిన్నేటి యిసుకది

బ్బలు - ఇక్కడి - ఈప్రదేశమునను్న - ఈలవలీకుజములు - ఈతమలపాకుతీగలపొదలును - సరిరాకపోయెనే - సమానముగాక పోయెనా - అనఁగా వానికంటె నతిశయములైనవేకదాయనుట। లవలీయనఁగా వెన్నెలతీఁగయనఁ గొందఱు॥ ౫౪

ఉ॥ నిక్కము దాఁపనేల ధరణీసురనందన యింక నీపయిం। జిక్కె మనంబు నాకు ననుఁ జిత్తజుబారికి నప్పగించెదో। చొక్కి మరందమద్యముల చూఱలఁ బాటలు వాడు తేంట్లసోం। పెక్కిన యల్లపూపొదరిండ్లను కౌఁగిట నాదరించెదో॥ ౫౫

టీక॥ నిక్కము - యథార్థమైనమాట - దాఁపనేల - మఱుఁగు వెట్టనేమి ప్రయోజనము - ధరణీసురనందన - బ్రాహ్మణకుమారుఁడా - ఇంకన్ - ఇఁకమీఁద - నాకున్ - నాకు - నీపయిన్ - నీమీఁద - మనంబు - చిత్తము - చిక్కెన్ - తగిలియున్నది - ననున్ - నన్ను - చిత్తజుబారికిన్ - మన్మథబాధకు - అప్పగించెదో - ఇల్లట వెట్టెదో - చొక్కి - పరవశతనొంది - మరంద - మకరందరూపమైన - మద్యములన్ - సారాయియొక్క - చూఱలన్ - కొల్లలచేత - పాటలు వాడు గానములు సేయుచున్న - తేంట్లన్ - తుమ్మెదలచేత - సోంపెక్కిన - శృంగారమతిశయించుచున్న - అల్లపూపొదరింటన్ - ఆపూపొదలయందు - కౌఁగిటన్ - ఆలింగనముచేత - ఆదరించెదో - ప్రీతిచే సేవవో - అనఁగా సంభోగించుచున్నావా లేదాయనుట॥ ౫౫

క॥ అనుటయుఁ బ్రవరుఁడిట్లను। వనజేక్షణ యిట్లు వలుకవరుసయె వ్రతులై। దినములు గడిపెడి విప్రులఁ। జను నే కామింప మదివిచారము లేదే॥ ౫౬

టీక॥ అనుటయున్ - వరూథినియీ ప్రకారము పలుకఁగా - ప్రవరుండిట్లనన్ - ప్రవరాఖ్యుఁడీ తీరునఁ బలికెను। ఏమనఁగా - వనజేక్షణ - ఓవరూథినీ - ఇట్లు బలుకన్ - ఈ రీతి నివచింప - వరుసయె - న్యాయమా - వ్రతులై - వ్రతనియమములుగలవారై - దినములుగడిపెడి - వారములుపోఁగొట్టెడు విప్రులన్ - బ్రాహ్మణులను - కామింపన్ - కోరుటకు - చనునే - తగునా - మదిన్ - మనస్సునందు - విచారము లేదేమి పివేచనవలదా - ఇదియుక్తము - ఇదియయుక్తమనునట్టి యాలోచనయుండవలయుననుట॥ ౫౬

ఉ॥ వ్రేలిమియున్ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె భుక్తికి। న్వేళ యతిక్రమించె జననీజనకుల్ గడు వృద్ధులాఁకటన్। సోలుచుఁ జింతతో నెమరుసూచుచునుండుదు రాహితాగ్ని నే। తూలు సమస్తధర్మములు తొయ్యలి నేఁడిలు సేరకుండినన్॥ ౫౭

టీక॥ వ్రేలిమియున్ - వైశ్వదేవము మొదలయిన హోమమును - సురార్చనయున్ - దేవతార్చనయును - విప్రసపర్యయున్ - బ్రాహ్మణపూజయును - చిక్కెన్ - నిలిచెను - భుక్తికిన్ - భోజనమునకు - వేళ యతిక్రమించెన్ - సమయము దప్పెను - జననీజనకులు - తల్లిదండ్రులు కడువృద్ధులు మిక్కిలి ముదుసళ్లు - ఆఁకటన్ - ఆకలిచేత - సోలుచున్ - బడలుచు - చింతతోన్ - విచారముతో - ఎమరు సూచుచున్ - ప్రతీక్షించుచు - ఉండుదురు - నివసింతురు - ఆహితాగ్నినే - నేను సోమయాజిని - నేఁడిలు సేరకుండినన్ - నేఁడు గృహము చేరఁబోకుంటినేని - తొయ్యలి - ఓవరూథినీ - సమస్తధర్మములు - సకలమైన విహితాచారములును - తూలున్ - చెడును॥ ౫౭

ఉ॥ నా పలుకుల్ విన్నఁబాటు వదనంబున బొంచుక దోఁపఁ బల్కె నో। భావజరూప యిట్టియెల ప్రాయము వైదికకర్మనిష్ఠలం। బోవఁగ నింక భోగముల బొందుట యెన్నఁడు యజ్ఞకోటులం। బావనుఁడౌటకున్ ఫలము నాకవుఁగిళ్ల సుఖింపనే కదా॥ ౫౮

టీక॥ నాపలుకుల్ - ప్రవరాఖ్యుఁడీ రీతిని బలుకఁగా - విన్నఁబాటు - ఖిన్నత్వము - వదనంబునన్ - ముఖమందు - ఇంచుక దోఁపన్ - కొంచెముకనుపడునట్టుగా - పల్కెన్ - వరూథినివచించెను - భావజరూప - మన్మథునివంటియాకారము గల యో ప్రవరాఖ్యుఁడా - ఇట్టియెలప్రాయము - ఇటువంటి లేఁతవయసు - వైదికకర్మనిష్ఠలన్ - వేదచోదితకర్మాచరణముల చేత - పోవఁగ నింకన్ - అతిక్రమించిపోవుచుండఁగా నిఁక మీఁద - భోగములఁ బొందుట యెన్నఁడు - సుఖములననుభవించుట యేకాలము యజ్ఞ - కోటులన్ - అనేకములైన యగ్నిష్టోమాదియాగములయందు - పావనుఁడౌటకున్ - పవిత్రుఁడయినందుకు - ఫలము - లాభము - నాకవుఁగిళ్లన్ - అప్సరసలు యినవారి యాలింగనములయందు - సుఖింపనే కదా - సుఖపడుటకే కాదా॥ ౫౮

సీ॥ సద్యోవిపిచ్ఛిన్న సారంగనాభికాహృతమై పిసాళించు మృగమదంబు। కసటువోఁ బీరెండఁ గరఁగి కఱ్ఱలనం

బు - కల్లు - అసుమదంబునన్ - త్రావినమత్తుచేతను * అదటునన్ - బలిమిచేత - చిదిమినన్ - గిల్లినను - యెఱుంగక - తెలియక - మదనహరుసైనన్ - మన్మథసంహారకుఁడైనసాంబమూర్తినైనను - చదురునన్ - చతురతచేత - కదియగమకించు - సమీపింపందలఁచుచున్న - తిమురు - తిమురుగల కోమరుప్రాయంపుమదంబునన్ - యవ్వనముచేతను - అనన్య...బునన్ - అనన్యకన్యాసామాన్య - ఇతరలైనయప్సరసలకులేని - లావణ్యరేఖా - రూపరేఖలవలనఁగలిగినకుదిరికయొక్క | మదంబునన్ - క్రొవ్వుచేతను - ఒంటిపాటునన్ ఒంటరిపాటునకంటికిఁబ్రియుండై - నేత్రమునకింపైనవాఁడై - తంగేటి - గోశ్రేణివృక్షమునఁబెట్టిన - జుంటివందంబునన్ - తేనెపెఱవలె - గొంటుతనంబెఱుంగక - నేర్పరితనము తెలియక - కఱుంగటనున్న - సమీపమందున్న - అమ్మహీసురకుమారు - ఆవిప్రకుమారుఁడైన ప్రవరాఖ్యునియొక్క - తారుణ్యమౌగ్ధ్యంబులంజేసి - తారుణ్య - యౌవనమునను - మౌగ్ధ్యంబులంజేసి - మూఢత్వమువలనను - తనవైదగ్ధ్యంబు - తననేర్పు - మెఱయంగలిగెనని - ప్రకాశింపఁగలిగెనని - పల్లవించు - చిగిరించుచున్న - ఉల్లంబు - మనస్సుయొక్క - ఉల్లాసంబునన్ - సంతోషముచేతను - కమరు - పుట్టెడు - మదంబునన్ - మత్తతచేత * ఓసరించక - తొలఁగక - చంచలదృగంచలప్రభలు - చంచల - కదలుచున్న - దృగంచలప్రభలు - నేత్రాంతకాంతులు - అతని ఆప్రవరాఖ్యునియొక్క - ముఖాంబుజంబునన్ - కమలము వంటిమోమునందు - పొలయన్ - ప్రసరించునట్టుగా - వలయమణిగణచ్ఛాయాకలాపంబులు - వలయ - హస్తకంకణములయందలి - మణిగణ - రత్నసమూహముయొక్క ఛాయాకలాపంబులు - కాంతులసమూహములు - ఉప్పరంబెగయన్ - ఉపరిభాగమునకునెగరఁగా - కొప్పుజక్కంజెక్కుచున్ - ధమ్మిల్లమునెన్నగాసవరించుకొనుచు - జక్కువగిబ్బలంబోని - చక్రవాకములవలెనున్న - తనగబ్బిగుబ్బలంజొబ్బిలు - తనస్థూలములైనస్తనములనుండివడిసెడు - కుంకుమరసంబునన్ - కాశ్మీరజన్మద్రవముచేత - పంకిలంబులగు - అడుసునంబడిన - హారముక్తాతారకంబులు - హార - హారసంబంధమైన - ముక్తాతారకంబులు - నక్షత్రములవంటిముత్యములు - నఖకోరకంబులన్ - మొగ్గలవంటిగోళ్లచేత - గీఱి - గోటసవరించి - తీరుపడఁజేయుచున్ - పొందుపరచుచు - పతితకుసుమకేసరంబులు - పతిత - రాలిన - కుసుమ - పుష్పములయొక్క - కేసరంబులు - కింజల్కములు - తాల్చునెపంబునన్ - విదర్చునట్టివ్యాజముచేత - పయ్యెదవిప్పి - పైఁటచెఱఁగువిదలించి - చక్కసవరింపుచున్ - పొందుపరచుచు - అంతంతఁబొలయుచు - అంతటంతటవ్యాపించెడు - చెలులన్ - చెలికత్తెలను - తలమూపకయుండన్ - మెలఁగకుండునట్లు - తత్తఱంబునంజేసి - వేగిరపాటువలన - బొమముడిపాటుతోన్ - భ్రుకుటిసంజ్ఞతో మగుడిమగుడిచూచుచున్ - తిరిగితిరిగివీక్షించుచు - చిడిముడిపాటుచూపులన్ - కోపయుక్తములైనదృష్టులయందు - అంకురించు - మొలుచుచున్న - ఝంకెనలన్ - బెదరింపులచేత - వారింపుచున్ - తొలఁగించుచు - చేరి - సమీపించి - ఇట్లనియెన్ - ఈతీరునఁబలికెను॥ ౭౯

శా॥ ఎందే డెందము గందళింప రహి చే నేకాగ్రతన్ నిర్వృతిం। జెందుం గుంభగతప్రదీపకలికాశ్రీఁదోఁప
నందిందుఁబో। కెందే నింద్రియముల్ సుఖంబుగను నాయింపే పరబ్రహ్మమా। నందో బ్రహ్మయటన్న ప్రాఁచ
దువు నంతర్బుద్ధి నూహింపుమా॥ ... ... ... ... ... ... ... ... ... ౮౦

టీక॥ ఎందేన్ - దేనియందైనను - డెందము - హృదయము రహిచేన్ - ప్రీతిచేత - కందళింపన్ - చిగిరింపఁగా - ఏకాగ్రతన్ - అనన్యవృత్తిత్వముచేత - నిర్వృతిన్ - సుఖమును చెందున్ - పొందునో - ఇంద్రియములు - మనస్సుమొదలయినవి - అందిందుఁబోక - అక్కడిక్కడఁజనక - కుంభగతప్రదీపకలికాశ్రీఁదోఁపన్ - కుంభగత - ఘటమునుబొందిన ప్రదీపకలికా - మొగ్గవంటిదృఢమైనదివ్వెయొక్క - శ్రీఁదోఁపన్ | సంపత్తివలెస్ఫురింపఁగా - ఎందేనిన్ - ఎక్కడనైనను | సుఖంబుగనున్ | సౌఖ్యమునుబొందునో - ఆయింపే - ఆసౌఖ్యమే | పరబ్రహ్మము | పరమాత్మస్వరూపము ఎటులనఁగా - ఆనందో బ్రహ్మయటన్న - ఆనంద - ఆనందమే - బ్రహ్మ - బ్రహ్మము - అటన్న - అనిపలికిన - ప్రాఁచదువున్ - శ్రుతివాక్యమును - అంతర్బుద్ధిన్ - అంతఃకరణముచేత - ఊహింపుమా - ఊహచేయుమా - అనఁగా మనస్సునునింద్రియములనునిట్టట్టుగదలక యెచ్చట సుఖమనుభవించునో యాసౌఖ్యమే యానందమునునదే పరబ్రహ్మ

మనఃపద్మము*ఝల్లనఁ - ఝల్లుమనఁగా* మోము వెల్లనై - ముఖము తెల్లవోయి౦కనలుచుఁ - కోపగించుచును*నీరుదేలు - నీళ్లుగ్రమ్ముచున్న౦ తెలిగన్నులఁ - శ్వేత నేత్రములచే తఁ౦ఆతఁడు - ఆప్రవరాఖ్యుని*పుల్కు పుల్కనఁ - పుల్కు పుల్కుమనికన్నీరుదొరఁగునట్టుగా*కనుఁగొని - చూచి*మాటల౦ దొడవు - పలుకుల యందుఁబుట్టుచున్న౦ గద్గదికఁ - కౌతుకుచేత*తలయూఁచి - శిరఃకంపముచేసి* అక్కటా - అయ్యయో*వనిత - ఆఁడుది*తనంతఁదాఁ - తనకుఁదానే*వలచివచ్చినఁ - మోహించి రాఁగా* పరికిఁ - ఎవరికైనను*చుల్కనగాదె - లాఘవముగాదా। అనఁగానువనుట॥ ౭౪

మ॥ వెతలం బెట్టకుమింక నన్ననుచు నీవీబంధమూడన్ రయో। ద్ధతిమూర్ఛిల్లి గడన్ వడిన్ స్వేదలు చిందం గొప్పువీ
డం దనూ। లతదోడ్తోఁ బులకింపఁగా ననునయాలాపంబిదీ నాస్యయై। రతిసరంభము నీఁజనిర్జరవధూరత్నం
బు పై పాటునన్॥ ... ... ... ... ... ... ... ... ... ... ౭౫

టీ॥ వెతలం బెట్టకుము వ్యథలను బట్టుపకుము*ఇంక నన్ననుచుఁ - ఇంకమీదనన్ననిపలుకుచు నీవీధంబంధమూడన్ - పోఁకముడి స్రస్తమగుచుండఁగా రయోద్ధతిన్ - త్వరితాతిశయము చేత।ఊర్పులు నిగుడన్ - శ్వాసవాయువులు దీర్ఘములగుచుండఁగా*వడిన్ స్వేదలు చిందన్ - త్వరితముగాఁ జెమ్మటలు రాలుచుండఁగా*కొప్పువీడన్ - ధమ్మిల్లము వదలిపోఁగా*తనూలత - తీఁగవంటి దేహము*తోడ్తోఁ బులకింపఁగాన్ - వెంటనే గగుర్పొడవఁగా*అనునయాలాప - బతిమాలెడు మాటలచేత*అతిదీనాస్యయై - పేదమొగముగలదై *రతిసరంభము - సురతము యొక్క వేగము*మీఱన్ - అతిశయించఁగా*నిర్జరవధూరత్నంబు - అచ్చరలమిన్న*పైపాటునన్ - పైఁబడుటచేత। ౭౫

శా॥ ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై। యంచుల్ మ్రోవఁగ గౌఁగిలించి యధరం
బాసింపవో శ్రీహరీ। యంచుఁ బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయం బంటి పొ। మ్మంచుం ద్రోచెఁ గ
లంచు నే సతులమాయల్ ధీరచిత్తంబులన్॥ ౭౬

టీ॥ ప్రాంచద్భూషణబాహుమూలరుచితోన్ - ప్రాంచద్భూషణ। మిక్కిలి ప్రూజితములయిన యాభరణముల యొక్కయు। బాహుమూల। కక్షప్రదేశముల యొక్కయు। రుచి తోన్। కాంతితోడ*బాలిండ్లు - కుచములు*పొంగారన్ - పులకించఁగా*పై యంచులు - ఉపరిభాగములు*మ్రోవఁగన్ - ఆనునట్లు*కౌఁగలించి - ఆలింగనముచేసి*అధరంబు - ఓష్ఠము* ఓష్ఠాధరౌతు రదనచ్ఛదౌదశన వాససియనియమరము. ఆసింపవ - అపేక్షింపఁగా*హో - కిట్టా*శ్రీహరీయంచున్ - శ్రీహరీయని పలుకుచును* బ్రాహ్మణుఁడు - ప్రవరాఖ్యుఁడు * ఓరమోమిడి - మొగముతిప్పుకొని*తదీయా - ఆవరూథినిసంబంధమయిన* అంసద్వయంబంటి - రెండుమూఁపులనుబట్టుకొని*పొమ్మంచున్ - పొమ్మని*త్రోచెన్ - నెట్టెను। దీనికాశ్చర్యపడఁబని లేదేలనఁగా*ధీరచిత్తంబులన్ - విద్వాంసుల మనస్సులను*ధీరో మనీషీజ్ఞఃప్రాజ్ఞస్సంఖ్యావాన్ పండితఃకవియనియమరము। సతులమాయలు - సతుల। స్త్రీలయొక్క। మాయలు। వంచనలు*కలంచునే - కలఁతనొందించునా। అనఁగా విజ్ఞానసంపన్నులయిన వారిస్థిరచిత్తములను స్త్రీలమాయలు కలఁతనొందించనేరవని భావము॥ ౭౬

క॥ త్రోపువడి నిలిచి ఘనల। జ్జాపరవశ యగుచు గొప్పు సవరించి యొడల్। దీపింప నతనిఁ జుఱచుఱఁ। గోపన
వీక్షించి గ్రేటుకొను చుంబలికెన్॥ ... ... ... ... ... ... ... ... ౭౭

టీక। త్రోపువడి - నెట్టువడి - నిలిచి - లేచినిలుచుండి - ఘనలజ్జాపరవశ యగుచున్ - ఘన। అధికమైన। లజ్జా। సిగ్గుచేత - మందాక్షం హ్రీస్త్రపావ్రీడాలజ్జా యని యమరము పరవశ యగుచున్। మై మఱచినదై - కొప్పు సవరించి - కబరి చక్కఁబెట్టుకొని - ఒడలు - శరీరము - దీపింపన్ - ప్రకాశింపఁగా - అతనిన్ - ఆప్రవరాఖ్యుని - చుఱచుఱన్ - చుఱచుఱమనునట్టుగా - కోపనవీక్షించి - క్రోధమునం జూచి - గ్రేటుకొనుచున్ - వెక్కుచును - పలికెన్ - వచించెను। ౭౭

ఉ॥ పాటునకింతులోర్తురె కృపారహితాత్మక నీవు ద్రోవని। చోటభవన్నిశాంతము సోఁకెఁగనుంగొనుమం
చుఁ జూపియా। పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చెఁ గలస్వనంబుతో। మీటినవిచ్చు గుబ్బచను మిట్టలనశ్రు
లు చిందువందుగన్॥ ... ... ... ... ... ... ... ... ... ... ౭౮

వలసినవి - సురలు - దేవతలు - అహల్యాజారుఁడైన- అహల్యకువిటుఁడయిన - జంభాసురారిణ్ - దేవేంద్రుని-స్వారాజ్యముణ్ - స్వర్గరాజ్యమును - ఏలంగనీరై రే- పాలింపనీక పోయిరా - అనఁగా నేలనిచ్చి నారేకదా యనుట- యీకథయును రామాయణ బాలకాండమం దేచూడవలసినది - వారికన్నణ్ - ఇట్టివారికన్నను - నీమహత్త్వంబు నీప్రభావము - ఘనమె - అధికమై నదా - పవనపర్ణాంబుభక్షులై - పవన- వాయువును - పర్ణ - ఆకులును - అంబు-ఉదకమును- భక్షులై - భుజించెడువారై - నవసి - కృశించి ఇనుప - ఇనుముతోఁజేసిన - కచ్చడాల్గట్టుకొని- గోచులు బిగించుకొనెడు - మునిముచ్చులెల్లణ్ - మునులనెడు తొంగలందఱు - తామరసనేత్రలిండ్లణ్ - స్త్రీలయొక్క-గృహములయందు - బందాలుగా రే - సేవకులుగారా- అనఁగాఁదపస్సుచేసిస్వర్గమునుబొందియప్సరసలయందుబద్ధానురాగులైయుండువారేకదా యనుట॥ ౭౨

క॥ అదిన నేమియునన కవ్వనజగంధి। మేనిజవ్వాదిపసగదంబించునొడలు। గడిగికొనివార్చి ప్రవరుండు
గార్హపత్య। వహ్ని నిట్లనిపొగడెభావమునఁదలఁచి॥ ౭౩

టీక॥ అనినణ్ - ఈరీతినివరూధినిపలుకఁగా - ఏమియుననక - ప్రత్యుత్తరమొకటిపలుకక - అవ్వనజగంధి - అవరూధినియొక్క - మేని - శరీరమందున్న - జవ్వాదిపసణ్ - సంకుమదమునయొక్క-పంకముతోడ - కదంబించుకొనిన-ఒడలు- తనశరీరమును-కడిగికొని- ప్రక్షాళనముచేసుకొని-అనఁగాస్నానముచేసి - వార్చి - ఆచమించి ప్రవరుండు- ప్రవరాఖ్యుఁడు - గార్హపత్యవహ్నిణ్ - గార్హపత్యాగ్నిని-భావమునఁదలఁచి - మనస్సునందుస్మరించి - ఇట్లనిపొగడెణ్- ఈరీతిగా స్తోత్రముచేసెను॥ ౭౩

ఉ॥ దివిషద్వర్గమునీ ముఖంబుననతృప్తింగాంచునన్నీశుఁగా। స్తవముల్ సేయుఁ శ్రుతుల్ సమస్తజగదంతర్యా
మివినీవయా। హవనీయంబును దక్షిణాగ్నియునునీయందుద్భవిల్లుంగ్రతూ। త్సవసంధాయకనన్నుఁగావఁ
గదవే స్వాహావధూవల్లభా॥ ౭౪

టీక॥ దివిషద్వర్గము - దేవతాసమూహము - నీముఖంబునన - నీమోమువలననే - తృప్తింగాంచుణ్ - తనివినిబొందును - అనఁగాదేవతలకునగ్నిహోత్రుఁడేముఖమని ప్రసిద్ధము - నిన్నీశుఁగాణ్ - నిన్నునీశ్వరునిగా- శ్రుతులు-వేదములు - స్తవముల్ సేయుణ్ - స్తోత్రములొనర్చును - స్తవ స్తోత్రం స్తుతిర్నుతి యనియమరము- సమస్తజగదంతర్యామివినీవ - సమస్తజగత్ - సకలజగములకు - అంతర్యామివినీవ - అంతరాత్మవునునీవే - ఆహవనీయంబుణ్ - ఆహవనీయాగ్నియును - దక్షిణాగ్నియుణ్ - దక్షిణాగ్నియును - నీయందుణ్ - నీయందే - ఉద్భవించుణ్ - సంభవించును - క్రతూత్సవసంధాయక - యజ్ఞరూపమైన యాహ్లాదమును జేయునట్టి - స్వాహావధూవల్లభా - స్వాహాదేవియను స్త్రీకిఁబ్రియుఁడవైనయగ్ని దేవా- నన్నుణ్-నను- కావఁగదవే - రక్షింపవే॥ ౭౪

ఉ॥ దానజపాగ్నిహోత్రపరతంత్రుఁడ నేనిభవత్పదాంబుజ। ధ్యానరతుండ నేనిఁబరదారధనాదులఁ
గోరనేనిస - న్మానముతోడ నన్ను సదనంబుననిల్పుమినుండుపశ్చిమాం - భోనిధిలోనఁగ్రుంకకయమున్నర
యంబునహవ్యవాహనా॥ ౭౫

టీక॥ దానజపాగ్నిహోత్రపరతంత్రుఁడనేనిణ్ - దాన - ధారాపూర్వకముగానిచ్చుటయు- జప- మంత్రావృత్తి - అగ్నిహోత్ర - వహ్నికి- పరతంత్రుఁడనేనిణ్ - పరాధీనుఁడనైతినేని - అనఁగావీనియందాసక్తిగలవాఁడనైతినాయనుట - పరతంత్రఃపరాధీనయనియమరము - భవత్పదాంభుజధ్యానరతుండనేనిణ్ - భవత్ - నీయొక్క - పదాంబుజ - పాదకమలములయొక్క - ధ్యాన - స్మరణమునందు- రతుండనేనిణ్ - ఆసక్తిగలవాఁడనయితినా - పరదారధనాదులణ్ - అన్యస్త్రీలు - అన్యధనములు మొదలయిన వానిని - కోరనేనిణ్ - ఇచ్ఛయించనివాఁడనయితినా - సన్మానముతోడణ్ - ఆదరముతోడ - ఇనుండు- సూర్యుఁడు పశ్చిమాంభోనిధిలోనణ్ - పడమటిసముద్రములోపల-క్రుంకకయమున్న - మునుఁగకముందే- అనఁగాసూర్యాస్తమానముకాకమున్నెయనుట - హవ్యవాహనా - ఓయగ్నిదేవా - రయంబునణ్ - శీఘ్రముగా - నన్నుణ్-నను - సదనంబునణ్ - నాగృహమందు - నిల్పుము ప్రవేశపెట్టుము॥ ౭౫

వ॥ అని స్తుతియించినగ్నిదేవుండమ్మహీదేవుదేహంబునసన్నిహితుండగుటయు నమ్మహాభాగుండుగండు

మీఁతిపోషపుకొండనఖండసంధ్యారాగప్రభామండలాంతర్గతుండగుపుండరీకవనబంధుండునుంబోలె సంతప్తకనకద్రవధారాగౌరంబగుతనుచ్ఛాయాపూరంబున నక్కాన వెలిఁగింపుచు నిజగమననిరోధినియగు నవ్వరూథినిహృదయకంజంబు నరంజిల్లనమందరాగరసమరందంబు నందందపొంగంజేయుచుఁ బావకప్రసాదలబ్ధంబగుపవనజవంబున నిజమందిరంబున కరిగి నిత్యకృత్యసత్కర్మకలాపంబులు నిర్వర్తించె నని మార్కండేయుండు క్రోష్టికిం జెప్పెనని చెప్పిన॥ ... ... ... ... ... ... ... ... ౬౭

టీక॥ అని - ఇట్లని- స్తుతియించినన్- స్తోత్రముచేయఁగా-అగ్నిదేవుండు ౘ వైశ్వానరుఁడు - అమ్మహీదేవు- ఆబ్రాహ్మణునియొక్క - దేహంబునన్ - శరీరమునందు - సన్నిహితుండగుటయున్ - ప్రవేశించినవాఁడగుటచేత - అమ్మహాభాగుండు - ఆమహాత్ముఁడైన ప్రవరాఖ్యుఁడు - గండుమీఱి- అతిశయించి - పొడుపుకొండన్ - ఉదయాద్రియందు- అఖండ...డగు - అఖండ - సంపూర్ణమైన- సంధ్యారాగ-సంజకెంజాయలయొక్క - ప్రభామండల - కాంతిసమూహమునకు - అంతర్గతుండగు - నడుమనున్న - పుండరీకవనబంధుండునుంబోలెన్ - పద్మకాననబాంధవుఁడైనసూర్యునివలె - సంతప్తకనకద్రవధారా గౌరంబగు - సంతప్త - పుటపాకములచేతఁ దీరిన । కనకద్రవధారా । బంగారునీటిధారలవలె - గౌరంబగు - పసిమిగలిగిన తనుచ్ఛాయాపూరంబునన్ - దేహకాంతి ప్రవాహముచేత - అక్కాన వెలిఁగింపుచున్ - ఆయరణ్యమును దేజరిల్లఁ జేయుచు - నిజగమననిరోధినియగు - నిజగమన - తనప్రయాణమునకు - నిరోధినియగు - నిర్బంధపెట్టెడు - అవ్వరూథిని - ఆవరూథినియొక్క - హృదయకంజంబునన్ - చిత్తకమలమందు - రంజిల్లు - ప్రకాశించుచున్న - అమందరాగరసమరందంబునన్ - అమందరాగరస - అధికమైనయనురక్తిరసమను - మరందంబున్ - పూదేనియను- అందందపొంగంజేయుచున్ - అంతకంతకును బుసబుసపొంగునట్లు చేయుచు పావకప్రసాదలబ్ధంబగు - పావకప్రసాద- అగ్నిదేవునను గ్రహముచేత - లబ్ధంబగు- పొందఁబడిన - పవనజవంబునన్ - వాయువేగముచేత - నిజమందిరంబునకున్ - నిజ - స్వకీయమైన - మందిరంబునకున్ - గృహమునకు - అరిగి - పోయి నిత్యకృత్యసత్కర్మకలాపంబులు- నిత్యకృత - నిరంతరముఁ జేయఁదగిన - సత్కర్మ - సత్క్రియలయొక్క । కలాపంబులు - సమూహములును - నిర్వర్తించెనని - నెరవేర్చెనని - మార్కండేయుండు - మృకండుపుత్రుఁడు - క్రోష్టికిం జెప్పెనని - క్రోష్టియనుమునికివచించెనని - చెప్పినన్ - పక్షులుపల్కఁగా॥ ౬౭

క॥ జైమినియాదివ్యఖగ - గ్రామణులం గాంచి వేడ్కఁ గడలుకొనంగా - నామీఁద వరూథినివిధ - మేమయ్యెనొ
యింకఁ జెప్పవే నాకనుడున్॥ ... ... ... ... ... ... ... ... ... ౬౮

టీక॥ జైమిని- జైమినిమునీశ్వరుఁడు- ఆదివ్యఖగగ్రామణులన్ - ఆదివ్య - ఆదేవతాసంబంధములైన- ఖగగ్రామణులన్ - పక్షిశ్రేష్ఠములను । ఖగేవిహంగవిహగవిహంగమవిహాయసయవియమరము । కాంచి। చూచి। వేడ్క - సంతోషము । కడలుకొనంగాన్। వ్యాపించుచుండఁగా-ఆమీఁదన్ - అవ్వల। వరూథినివిధము । వరూథినియొక్క ప్రకారము - ఏమయ్యెన్ ఏమిగాజరిగెను। నాకున్। నాకు। తెలియఁ జెప్పవే - ఎఱుంగవచింపవే అనుడున్ - అనఁగా॥ ౬౮

శా॥ నిస్తంద్రప్రతిభాసుధీనుతదిశోన్మీలద్యశశ్శ్రీవధూ। హస్తాగ్రామలకాయమానమహనీయాంభోజగ
ర్భాండసైన్యస్తోమోత్థరజోవ్రజస్థగితకృష్ణాగౌతమీమధ్యభూ।న్యస్తోకోత్కలరాట్పురీహరణలీ
లావార్యశౌర్యోదయా॥ ౬౯

టీక॥ నిస్తంద్రప్రతిభాసుధీనుత। నిస్తంద్ర। నిశ్చలమైన-ప్రతిభా। బుద్ధివిశేషముగలవాఁడాఁడా। సుధీనుత। విద్వాంసులచేత స్తోత్రముచేయఁబడినవాఁడా । దిశో...గర్భాండ। దిశోన్మీలత్ । దిక్కులయందువికసిల్లుచున్న - యశశ్శ్రీవధూ। కీర్తిలక్ష్మియను స్త్రీయొక్క - హస్తాగ్ర। కరాగ్రమందు- ఆమలకాయమాన - ఉసిరికకాయవలెనున్న - మహనీయ। ఘనమైన- అంభోజగర్భాండ - బ్రహ్మాండముగలవాఁడా। సైన్య...దయా- సైన్యస్తోమ। సేనాసమూహముచేత - ఉత్థ - ఎగరఁగొట్టఁబడిన। రజోవ్రజ। పరాగసమూహముచేత । స్థగిత । కప్పఁబడిన। కృష్ణాగౌతమీమధ్యభూమి। కృష్ణాగోదావరులనడిమిభాగమందున్న పుడమియందలి - అస్తోక - అధికమైన। ఉత్కలరాట్ । ఉత్కలదేశాధిపతియొక్క। పురీహరణలీలా। పట్టణములనుహరించునట్టివిలాసమునందు । అవార్య । నివారింపశక్యముగాని। శౌర్యోదయా। పరాక్రమసమృద్ధిగలవాఁడా॥ ౬౯

క॥ బిసరుహనయనానవవిధ। కుసుమాయుధయవధికుధరకూటాంచలభూ। విసృమర తేజశ్చంపక। భసలద
సత్కీర్తిమలినపరిపంథినృపా॥ ౯౦

టీక॥ బిసరుహనయనా- పద్మములవంటి నేత్రములుగల స్త్రీలకు- నవవిధకుసుమాయుధ - నవవిధ - నూతనప్రకారముగ గలిగిన- కుసుమాయుధ- మన్మథునివంటి వాఁడా- అవధి...నృపా- అవధికుధర- చక్రవాళపర్వతముయొక్క- కూటాంచలభూ। శృంగాగ్రభూమియందు - కూటో స్త్రీ శిఖరం శృంగమనియమరము- విసృమర- వ్యాపించిన - తేజశ్చంపక- ప్రతాపమను - సంపంగిపుష్పమునకు - భసలత్ - తుమ్మెదవలెనాచరింపఁబడిన - అసత్కీర్తి - అపయశస్సుచేత - మలిన। మాలిన్యముగల వారగుచున్న - పరిపంథినృపా - శత్రురాజులుగలవాఁడా॥ ౯౧

కవిరాజవిరాజితము ॥ నలనృగరంతిభగీరథభారతనందనకల్పయనల్పయశ। శ్చులుకితలోకవిలోకివధూజన
నూనశరాసనమానఘన। ప్రళయఘనాఘనఘోషజయానకభాంకృతిభీమచపేటలుఠ। త్కలుబరిగీకటక
క్షితిరక్షకకన్నడరాజ్యరమారమణా॥ ౯౨

టీక॥ నల...కల్ప - నల- నలమహారాజుతోడను- నృగ - నృగమహారాజుతోడను - రంతి- రంతిదేవునితోడను - భగీరథ భగీరథమహారాజుతోడను- భారతనందన - భరతవంశసంభవుఁడైనధర్మరాజాదులతోడను-కల్ప- సమానుఁడైనవాఁడా- అనల్పయశశ్చులుకితలోక- అనల్ప- అత్యధికమైన యశః- కీర్తిచేత- యశఃకీర్తిసమాఖ్యయనియమరము- చులుకిత- పుడిసిలింపఁబడిన- లోక - జగముగలవాఁడా * విలోకివధూజననూనశరాసన -విలోకి -చూచుచున్న- వధూజన- స్త్రీసమూహమునకు- నూనశరాసన- మన్మథుఁడవైనవాఁడా- మానఘన - అభిమానమునందు గొప్పవాఁడా- ప్రళయ...రక్షక- ప్రళయ- లయకాలమందు- ఘనాఘన- ఉన్నతమేఘముయొక్క- ఘోష - ధ్వనివంటిధ్వని గలిగిన- జయానక- జయభేరియొక్క- భాంకృతి - భాంకారవము- భీమ- భయంకరమైన- చపేట- చంపదెబ్బలచేత లుఠత్ - పొరలుచున్న - కలబురిగీ - కలబురిగియను - కటకపట్టణముయొక్క- క్షితిరక్షక- రాజుగలవాఁడా - కన్నడరాజ్యరమారమణా- కన్నడ - కన్నడదేశముయొక్క- రాజ్యరమా- రాజ్యలక్ష్మికి-రమణా- అధిపతివైనవాఁడా॥

గద్య॥ ఇది శ్రీమదాంధ్రకవితాపితామహసర్వతోముఖాంకపంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిరనందవరవంశోత్తంసశఠగోపతాపసప్రసాదాసాదితకవితామతల్లికాలసానిచొక్కయామాత్యపుత్ర పెద్దనార్యప్రణీతంబైనస్వారోచిషమనుసంభవంబనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము॥ ౯౩

---

దీనికిఁటీక ప్రథమాశ్వాసప్రకారమేయనియెఱుంగునది.

---

# స్వారోచిషమనుచరిత్రము.



## మూఁడవయాశ్వాసము.

క॥ శ్రీవేంకటేశపదప। ద్మావేశితసదయహృదయహరనిటలనట। త్పావకపరిభావిమహః। ప్రావృతసకలాశకృష్ణరాయమహీశా॥ ౧

టీక॥ శ్రీవేం...దయ- శ్రీవేంకటేశ - సంపద్యుక్తుఁడైన వేంకటేశ్వరస్వామియొక్క - పదపద్మ - కమలములవంటిపాదములయందు - ఆవేశిత- ప్రవేశపెట్టబడిన - సదయ - కృపతోఁగూడుకొన్న- హృదయ - మానసముగలిగినవాఁడా- హర...లాశ- హర- రుద్రునియొక్క - నిటల - నొసటియందు- నటత్ - నృత్యముఁజేయుచున్న -పావక-అగ్నిహోత్రుని- పరిభావి- తిరస్కరించుచున్న- మహః - తేజస్సుచేత- ప్రావృత-ఆవరింపఁబడిన- సకలాశ - సమస్తదిక్కులుగలవాఁడా- కృష్ణరాయమహీశా- కృష్ణరాయభూనాథా అనిసంబోధన— వేం - పాపం - కటతి నాశయతీతి- వేంకటః పర్వతః. తస్య ఈశః- పతిః- వేంకటేశయని॥ ౧

వ॥ అవధరింపుమమ్మహాత్మునకుఁబక్షులిట్లనియె॥

టీక॥ అవధరింపుము- చిత్తగింపుము * అమ్మహాత్మునకున్- మహానుభావుఁడైన యాజైమినిమునీంద్రునకు * పక్షులిట్లనియెన్ - కథచెప్పుచున్న పులుగులీవక్ష్యమాణ ప్రకారముగాఁబలికెను॥

శా॥ అభూదేవకుమారుఁ డేగినఁదదీయానూనరమ్యాకృతిం। దా భావంబుననిల్పి యంగభవకోదండోగ్రమౌర్వీరవ। క్షోభాకంపితధైర్యయై యలఁతనచ్చోనిల్వకచ్చెల్వత। ద్భూభృన్మేఖలవెంటఁగోనలఁబడెన్దుఃఖాబ్ధినిర్మగ్నయై॥ ... ... ... ... ... ... ... ... ... ... ౨

టీక॥ ఆభూదేవకుమారుఁడు - ఆబ్రాహ్మణచిన్నవాఁడు; అనఁగా బ్రవరాఖ్యుఁడు * ఏగినన్ - పోఁగా * తదీయానూనరమ్యాకృతిన్- తదీయ- ఆప్రవరునియొక్క - అనూన- సంపూర్ణమైన, రమ్య- మనోహరమైన - ఆకృతిన్- రూపమును- తా భావంబుననిల్పి- తాను మనస్సుననుంచికొని * అంగ...యై -అంగభవ- మన్మథునియొక్క - కోదండ ధనస్సునందున్న - ఉగ్రమౌర్వీ । తీక్ష్ణమైననారియొక్క- రవక్షోభా - టంకారధ్వనివ్యాకులచేత * కంపిత- కదలింపఁబడిన* ధైర్యయై ధీరత్వముకలదై * అలఁతన్- ఆయాసముచేత* అచ్చోనిల్వక- అస్థలమందుండక * అచ్చెల్వ అవరూధిని- దుఃఖాబ్ధినిర్మగ్నయై । దుఃఖాబ్ధి। వ్యసనసాగరమున । నిర్మగ్నయై మునిగినదై * తద్భూభృన్మేఖలవెంటన్ తద్భూభృత్ -ఆహిమవత్పర్వతముయొక్క - మేఖలవెంటన్ మధ్యభాగము వెంబడి * కోనలఁబడెన్ । లోయలఁలోప్రవేశించెను॥ ౨

క॥ తిరుగుచు ధరణీసురవరుఁ। డరిగినచొప్పరసియరసియటుగానక యా। హరిణాంకముఖి సఖీజన। పరివృతయై మగుడివచ్చి భావములోనన్॥ ౩

టీక॥ తిరుగుచున్-కోనలలోన చరించుచు* ధరణీసురవరుడు - బ్రాహ్మణశ్రేష్ఠుఁడైన ప్రవరాఖ్యుఁడు * అరిగినచొప్పు। పోయినజాడ * అరసియరసి - విచారించివిచారించి* అటుగానక-అక్కడ గనుఁగొనక * ఆహరిణాంకముఖి చంద్రునివంటి మోముగల యావరూధిని * సఖీజనపరివృతయై సఖీజన- చెలికత్తెలచేత- పరివృతయై -చుట్టఁబడినదై * మగుడివచ్చి మరలనేతెంచి। భావములోనన్-తనమనస్సులోపల॥

ఉ॥ అక్కటివాఁడు నాతగులమాఁఅడిచేసి దయావిహీనుఁడై। చిక్కక త్రోచిపోయె నరిఁజేరఁగరాని వియోగసాగరం। బెక్కడనీఁదుదాన నిఁక నీకొఁ అనోములు నోఁచినట్టినే। నెక్కడ వానికౌఁగిలది యెక్కడ మాహా విధి నేమి సేయుదున్॥ ... ... ... ... ... ... ... ... ౪

టీక॥ అక్కటి- వాఁడు। అనయాశూన్యుఁడగు బ్రాహ్మణుఁడు * నాతగులము-నావలపు * ఆఁడిచేసి- వ్యర్థముచేసి * దయావిహీనుఁడై - కృపలేనివాఁడై * చిక్కక- దొరకకను* త్రోచిపోయెన్- నిగ్రహించి చనెను- దరిఁజరఁ

గరాని - ఒడ్డుఁజేరశక్యముగాని - వియోగసాగరంబు - వియోగ - విరహమను - సాగరంబు - సముద్రమును - ఎక్కడనీఁదుదానఁ - ఏతీరునఁదరించుదానను - ఇంకఁ - ఇంకమీఁద - ఈకొలఁదినోములునోఁచినట్టి - ఈతక్కువ వ్రతములుచేసినట్టి - నేనెక్కడ। నేనెచ్చట - వానికౌఁగిలియెక్కడ - ఆతనియాలింగనమెక్కడ - అనఁగానలభ్యమనుట - హావిధి హాదైవమా - ఏమిసేయుదుఁ - ఏమియొనర్పఁగలను॥ ౪

ఉ॥ కమ్మనికుందనంబుకసుగందనిమేనును దేఁటిదాఁటులఁ - బమ్మెరవోవఁద్రోలుతెగబారెడువెంట్రుకలిం
దుబింబముం - గిమ్మనసీదుమోముగిరిక్రేపులుమూపులుగౌనుగానరా। దమ్మకచెల్లవానివికచాంబకముల్
శతపత్రజైత్రముల్॥ ౫

టీక॥ అమ్మకచెల్ల - ఆశ్చర్యము - వాని - ఆపురుషునియొక్క - కసుగందనిమేనును - కోమలమైనశరీరమును - కమ్మనికుందనంబు - పరిమళించునపరంజివంటిది - తెగబారెడు - బారెడుకొలతగలిగిన - వెండ్రుకలు - కురులు - తేఁటి - తుమ్మెదల - దాఁటులఁ - బారులను - బమ్మెరవోవఁ - భ్రమనొందునట్టుగా - త్రోలుఁ - పారఁదరుమును - మోము - ముఖము - ఇందుబింబముఁ - చంద్రమండలమును - కిమ్మనసీదు - ఏమానినోరెత్తనీయదు - అనఁగాఁదిరస్కరించునుట - మూపులు - భుజశిరములు - గిరిక్రేపులు - కొండపిల్లలవంటివి - కౌను - నడుము - కానరాదు - అదృశ్యము - వికచాంబకములు - విప్పుగన్నులు - శతపత్రజైత్రములు - కమలములనుజయించినవి॥ ౫

ఉ॥ చొక్కపుఁబ్రాయముఁమిగులపోయగముంగలప్రాణనాయకుం। డెక్కడవశ్యతఁరతులనేఁకటదీర్చి
సమేలమొప్పఁగా నక్కునఁగారవించి ప్రియమందఁగనోఁచనియింతినైన నయారా - చక్కఁదనంబదేమిటికిజ
వ్వనమేటికినేర్పులేటికిఁ॥ ౬

టీక॥ చొక్కపుఁ - సిద్ధమైన ప్రాయముఁ - వయస్సును - మిగులఁ - మిక్కిలి - పోయగముఁ - చక్కఁదనమును - కల - కలిగిన - ప్రాణనాయకుండు - జీవితేశ్వరుఁడు ఎక్కువవశ్యతఁ - అత్యంతమైనవశీకరముచేత - రతులఁ - సంభోగములచేత - ఏఁకటఁదీర్చి - కోరికతుదముట్టించి - సమేలమొప్పఁగాఁ - చనువమరునట్టుగా - అక్కునఁగారవింపఁ - రొమ్ముపైనిడికొని సన్నించునట్టుగా - ప్రియమందఁగఁ - ప్రీతినొందునట్లు - నోఁచని - నోఁచుకొనని - అనఁగానట్టియదృష్టరేఖలేని - ఇంతినైన - స్త్రీసంబంధమైన - ఆచక్కఁదనంబదేమిటికిఁ - ఆసౌందర్యమెందుకు జవ్వనమేటికిఁ - యౌవనమెందుకు। నేర్పులేటికిఁ - నైపుణ్యములెందుకు - అనఁగానుండియునిరర్థకమనుట॥ ౬

ఉ॥ ఎంతతపంబుఁజేసిజనియించినవారొకొమర్త్యభామినుల్। గాంతుఁడవజ్ఞజేసినను గాయము వాయు
మరేనమర్త్యనై। చింతలవంతలంజివికిసిగ్గఱితిఁజావులేనినాదుచె। ల్వంతయుశూన్యగేహమునకెత్తిన
దీపికయయ్యెనక్కటా॥ ౭

టీక॥ మర్త్యభామినులు - మనుష్యస్త్రీలు - ఎంతతపంబుజేసి - మిక్కుటమైనతపస్సొనర్చి - జనియించినవారొకో - పుట్టినవారొకదా - ఏమనఁగా - కాంతుఁడు పెనిమిటి - అవజ్ఞఁజేసినఁ - అవమానమొనర్చినయెడ - కాయము వాయుదురు - శరీరముఁద్రొయుదురు - ఏనమర్త్యనై - నేనుదేవతాస్త్రీనై * చింతలవంతలంజివికి - విచారకష్టములచేత - కృశించి - సిగ్గఱితిఁ - సిగ్గుమాలినదాననైతిని - చావులేని చావని - నాదుచెల్వంతయుఁ - నాయందమంతయు - శూన్యగేహమునకుఁ - పాడువడినమందిరమునకు - ఎత్తినఁ పెట్టిన - దీపికయయ్యెఁ - దీపమాయెను * అక్కటా * అయ్యయో - అనఁగాసంతాపవాక్యము, ౭

వ॥ అనివితర్కింపుచుంగ్రించుఁదనంబునంబునఃపునఃపరిభవకారియైకాఁటియుంబెట్టుసిరిపట్టిబెట్టేయుంగాఁడిచ
మనలరంపకట్టియలగుట్టుచెడివెచ్చవెచ్చనైహెచ్చివిచ్చలవిడింగాయునుద్దామవిరహదవదహనదాహం
బునదేహంబుతల్లడిల్లమల్లడిఁగొనిపెల్లడరునిట్టూర్పుగాడ్పులవిసరులంగసరెత్తియంతకంతకంత రంగం
బుననింతింతనరాకపొంగిచింతాసాగరంబు వేగిరంబవెల్లివొడిచెన నందుమడిచిననడంగకసాఁలెపుందారకలనీ
రికలెత్తుపొగరుననిగనిగలినుమడిగనిగుడమిగులఁదగల ఘనసలుభుగులున నెగసియుప్పులకుప్పలగు రెప్పలంజి
ప్పిలుకాటుకకప్పుప్పళించికరంబదరదళ దరుణకమలదళశోణంబులగుదృక్కోణంబులఁదిగువాఱుకన్నీరుచె

సమూహముచేత - చెన్నగు - ఒప్పుచున్న - మిన్నువీటి గి - ఆకాశముతునిసి - పడిబడినవడువునన్ - మీఁదఁబడిపరీతిగా - పెడఁగువడన్ - వెలుఁగుచునుండఁగా - కలయన్ అంతటవ్యాపించునట్లుగా - తలకొను - పొటమరించుచున్న - పులకల - రోమాంచములను - మొలకలపైరునకున్ - సస్యాంకురములకు| పాఱుప్రవహించుచున్న - దుర్వారవారిపూరంబనన్ - దుర్వార| అడ్డిలేని | వారిపూరంబనన్ - ఉదకప్రవాహమనునట్లుగా - క్రమక్రమంబునన్ - పసనపరుసగా - అంగములన్ - అవయవములయందు| అంగం ప్రతీ కోవయవయనియనురము - క్రమ్మ - వ్యాపించుచున్న || చిఱుచెమటలక్రొత్తగాఁబుట్టుచున్న స్వేదములను - మిన్నేటి - ఆకాశగంగయొక్క - పెన్నీటి - ఎక్కువనీళ్లయొక్క - వఱ్ఱోడ్డ - వరదయందుఁబడి - మునుంగకుండన్ - మునిఁగిపోకుండను - సవరించినన్ - చక్కఁబఱచఁగా - మించు - అతిశయించుచున్న - కుంభప్లవంబనన్ - కుండతెప్పయోయనునట్లుగా - పరిభ్రష్టోత్తరీయంబై - జాఱిపోయినపైఁటగలదై - బయలుపడి - బైటఁబడి - అబ్బురంపు - ఆశ్చర్యకరమైన - గుబ్బచనుదోయి - గుబ్బలవంటిచన్నుఁగవ| అనఁగా శిఖరములవంటి స్తనద్వయము - నిబ్బరంపు - స్తిమితమైన - మెఱుంగులీనన్ - కాంతులనుగనుచుండఁగా - కుపిత...పడుచున్ - కుపిత| కోపగించుకొనిన| హర| సాంబమూర్తియొక్క| నయన| ఫాలనేత్రమునందున్న - శిఖిశిఖా - జ్వాలలచేత| భస్మీకృత| బూడిదెచేయఁబడిన| స్మర| మన్మథుయొక్క| విరహ| వియోగములనఁబుట్టిన| శోకంబునంబడి - దుఃఖముసుబొంది - చందురునింబట్టుకొని - జాబిల్లిఁబట్టికొని - అడలు - పఱచుచున్న రతిరమణిచందంబునన్ - మన్మథుని భార్యయైనరతీదేవివలెనే - కుసు...బునన్ - కుసుమిత| పూచిన| లతాంతనిశాంత| పొదరింటియందు| శశికాంత| నెలరాలచేతనిర్మించిన| వేదికాంతరంబునన్| అరుసమీఁదు - మేనుఁజేర్చి - శరీరమును బొందించి - వివిధదశాంతరంబులన్ - వివిధ - నానాప్రకారములైన - దశాంతరంబులన్ - అవస్థాభేదములచేత| అనఁగా మనస్సంగజాగరకృశత్వాదులచేత - వేఁగుచుండెన్ - తపించుచుండెను - అంతన్ - ఆసమయమందు|| ౧౩

చ|| తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథా | భరవివశాంగి నంగభవుబారికి నగ్గముఁజేసి క్రూరుఁ
డై | యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ | స్ఫురణ వహించెనోయనన భోమణిదాల్చెఁ
గషాయదీధితిన్|| ౧౪

టీక || తరుణిన్ - పడుచుగలదియగు - అనన్యకాంతన్ - పరాధీనురాలుకాని - అతి...శాంగిన్ - అతిదారుణ| మిక్కిలిభయంకరమైన| పుష్పశిలీముఖ| పువ్వులేబాణములుగాఁగల మన్మథునియొక్క | వ్యథాభర - దుఃఖభారముచేత - పీడాబాధావ్యథాదుఃఖమని యమరము - వివశాంగిన్ | శరీరస్మృతిలేకయున్న పరవశనిని - అంగభవుబారికిన్ - మన్మథునికోపదృష్టికి - అగ్గముఁజేసి - లోఁబడఁజేసి - క్రూరుఁడై - కఠినుఁడై - మహీసురాధముఁడు - బ్రాహ్మణాధముఁడైన ప్రవరాఖ్యుఁడు - అహంకృతితోన్ - గర్వముతో - అరిగెన్ పోయెను - అని - ఇట్లనుకొని - రోషభీషణస్ఫురణవహించెనోయనన్ - రోష| కోపముచేత| భీషణ - భయంకరమైన - స్ఫురణన్ - తేజస్సును - వహించెనోయనన్ - ధరించినాఁడోయనునట్లుగా - నభోమణి - సూర్యుఁడు - కషాయదీధితిన్ - అరుణకాంతిని - తాల్చెన్ - వహించెను || అనఁగా సాయంకాలముకావచ్చునప్పుడు సూర్యబింబమెఱ్ఱగానుండెనని తాత్పర్యము : అంగభవుబారికినఁగా మన్మథవ్యథకుగోచరముజేసియని ఫలితార్థము|| ౧౫

సీ|| ఉరుదరీకుహరసముత్థశార్దూలముల్ * రుధిరవారిశోణితశంకఁద్రావ| వనకుంజమధ్యశాద్వలచరన్మృ
గపఙ్క్తి * దావపావకభీతిఁదల్లడిల్ల | నాశ్రమాంతరభూరుహాగ్రములున్నికోటి * బద్ధకాషాయవిభ్రాం
తిఁజూడ | ఘనసానుశృంగశృంగాటకంబులుగాంచి * యమరులు హేమాద్రియనుచు భ్రమయ|| తే|| గాసెఁ
జేరలఁగతిఁగింశుకప్రవాళ | ఘుసృణకిసలయాకంకేళికుసుమగుచ్ఛ | బంధుజీవజపారాగబాంధవంబు | ల
స్నగంబున జరఠాతపములు|| ౧౬

టీ || ఉరుదరీకుహరసముత్థశార్దూలములు - ఉరు| గొప్పలైన| దరీకుహర| కొండయలవంకగుహలయందు| సముత్థ| నిద్రవలననుండి లేచిన| శార్దూలములు| పెద్దపులులు - రుధిరవారిశోణితశంకన్ - రుధిరవారి| ప్రవాహజలములను| శోణితశంకన్| రక్తమను భ్రాంతిచేత - ద్రావన్ - పానముసేయునట్లుగా - వనకుంజమధ్యశాద్వలచరన్మృగపఙ్క్తి - వ

చూపోటన్ - ఆకారస్ఫురణము గలుగుటచేతనని చంద్రపరమైన యర్థము - ఇందుకు నైషధమున నాలవ సర్గలో నేడవ శ్లోకమందుఁ బ్రయోగము చూడవలసినది మొట్టమొదట సూర్యునివలన జన్మము కలుగుటచేతనని యమధర్మరాజుపరమయిన యర్థాంతరము - దక్షాధ్వరధ్వంసి - దక్షుని యజ్ఞభంగముఁ జేసినవీరభద్రుని యొక్క - తన్నుగనుటన్ పాదతాడనమును బొందుటచేతననియర్థము - ఇందుకు భాగవతము చతుర్థస్కంధమందుఁ గథ విచారించవలసినది - దక్షయాగవిధ్వంసకుఁడైన శివునిచేతఁ దిరస్కరింపఁబడుటచేతననియర్థాంతరము - ఇందుకు లింగపురాణము పూర్వభాగములో నిలా వయధ్యాయములోఁ జూడవలసినది కానియాందువలన మిగుల సమాధానము కాలేదు గాననింకఁ బురాణాంతరములయందుఁ జూడఁదగ్గది - పరివేషమిషమునన్ పరిధియను వ్యాజముగలిగిన (పరివేషస్తుపరిధియని యమరము) పాశంబుదాల్చుటన్ - వల్లెత్రాడు ధరించుటచేతనని యర్థము - పాశము ధరించుటచేతనని యర్థాంతరము - కప్పు - నైల్యము - అనఁగా కళంకము దేహమునందుఁ గానఁబడుటన్ శరీరమందుఁ గనుపడుట చేతననియర్థము నల్లనికాంతి శరీరమందుఁ గనుపడుట చేతనని యర్థాంతము - కాలవశంబునఁ గాని - కాలాంతరమునందే కాని అనఁగా రాత్రికాలమందుఁ గాని - తోఁచకయుంటన్ - కనుపడకయుండుట చేతనని యర్థము అంత్యకాలమందుఁ గాని కనుపడకయుండుటచేతననియర్థాంతరము - సతతనిష్ఠురగదాన్వితుఁడవగుటన్ సతత। నిరంతరమును। నిష్ఠుర। కఠినమైన। గద। క్షయరోగముతో। అన్వితుఁడవగుటన్। కూడుకొన్నవాఁడగుటచేతననియర్థము - గదాయుధముతోఁ గూడుకొన్నవాఁడగుటచేతననియర్థాంతరము - పూని - ప్రయత్నపడి పహించి - పాండుక్షేత్రమునన్ - తెల్లని దేహముచేత - ప్రవర్తించుటన్ - మెలఁగుటచేతననియర్థము - పాండురాజుభార్యయైన కుంతియందుఁ బ్రవర్తించుటచేతనని యర్థాంతరము - ఇక్కడ క్షేత్రశబ్దము దేహమందును భార్యయందును వర్తించుచున్నదని తెలియవలెను - ప్రకటానురాగతారకుఁడవగుటన్ - ప్రకటానురాగ। ప్రసిద్ధమైన ప్రేమగల। తారకుఁడవగుటన్ - అశ్వని మొదలయిన నక్షత్రములు గలవాఁడగుటచేతననియర్థము - ప్రసిద్ధమైయనుసరించుచున్న రక్తిమగలకన్నికలు। అనఁగా గల్లగ్రస్తగతవాఁడగుటచేతననియర్థాంతరము - ఈచెప్పఁబడినధర్మములచేతను॥ రాజ - రాజనామముగలచంద్రుఁడా - నీవున్ - నీవును - అలధర్మరాజునకున్ - ఆధర్మరాజునకును - ప్రాణిలోకంబుకున్ - శరీరిసమూహమునకు - బాధలఁబఱచునపుడు - వ్యథలఁబెట్టుకాలమున - ఆత్మలోనరసి చూచినన్ - మనస్సున విచారించి కనుఁగొనఁగా - అంతరంబెద్ది - తారతమ్యమేమున్నయది। అనఁగా లేదనుట ఆధన్యునందున్ - పుణ్యవంతుఁడయినయాధర్మరాజునందు ధర్మపదము ధర్మయనువాక్యము ఒక్కటెక్కుడు - ఒక్కటియెక్కువ। అనఁగా నీవు రాజవును నాతఁడు ధర్మరాజును గను కఁ బూపు వ్యాత్మునియందు ధర్మయను పద మొక్కటెక్కువయనుట। కాఁబట్టి నీవు యమధర్మరాజుకంటెఁ గ్రూరుఁడవనిభావము॥ మార్కండేయునినిమిత్తము యమధర్మరాజును శివుఁడు పాదతాడనము చేసినట్టు లనేకస్థలములం దున్నది॥

చ॥ ఒకపెనుఁబాము ఏఁచుచలమొప్పరసాతలసీమ కుంజకో। రకములు భూతధాత్రికి సగల్ దివికిం బగదీరునట్లుగా। మెకిమెకపాటుతోడ నినుఁ బ్రింగక పోదెపుడుం ద్రిలోకకం। టకుఁడవు గాన నీయెడలు నజ్జగఁ జేసికరంగలాంఛనా॥

టీక॥ కురంగలాంఛనా - ఓచంద్రుఁడా - త్రిలోకకంటకుఁడవు గానన్ - త్రిలోక। స్వర్గమర్త్యపాతాళములను మూఁడు జగములకును కంటకుఁడవు గానన్। క్షుద్రశత్రుఁడవు గనుక - ఒకపెనుఁబాము ఏఁడు - ఒకమహనైనసర్పరాజు। అనఁగా రాహువు - చలమొప్పన్ పచ్చరము వహించినట్టుగా - రసాతలసీమన్ - పాతాళలోకమునకును - చకోరకములు - వెన్నెలపులుగులు - భూతధాత్రికిన్ - భూలోకమునకును - సురలు - దేవతలు - దివికిన్ - స్వర్గలోకమునకును - పగదీరునట్లుగాన్ - విరోధము తీర్చుకొనునట్లుగా - మెకమెకపాటుతోడన్ - మిటకిమిట్టిపాటుతోడ - నీయెడలున్ - నీశరీరము నజ్జుగఁ జేసి నలినలిగాఁ జేసి - ఎపుడున్ - సతతమును - నినుఁ బ్రింగకపోదు - నిన్నుఁ గబళించక పోదు। అనఁగా బ్రింగి నేర్చి గుదురనుట - అనఁగాఁ బర్వములయందు రాహువు గ్రసించుచున్నాఁడనియుఁ జకోరములు కిరణములను భక్షించుచున్నవనియు దేవతలు కళలను హరించుచున్నారనియును తాత్పర్యము॥

సీ॥

క॥ వాతాపివలననెఱిఁగితొ- శీతకిరణకడుపుఁజొచ్చి జీర్ణింపనియా। నీతినిసుఁడినీయునాయువు। చేతసుర లుచెడరుగానిచేయుపవె వారిన్॥ ౬౦

టీక॥ శీతకిరణ- ఓచంద్రుఁడా- కడుపుఁజొచ్చి- కుక్షిలోఁ బ్రవేశించియు- జీర్ణింపని- అరగకయుండునటి- ఈనీతి- ఈ న్యాయము- వాతాపివలనన్ - వాతాపియనురాక్షసుని వలన- ఎఱిఁగితొ- గ్రహించినావా యేమి-నినుఁడినియున్- నిన్నుభక్షించియును- సురలు-దేవతలు- ఆయువుచేతన్-ఆ యుస్సుచేత- చెడరుగానినశించిపోరుగాని- చేయుపవె వా రిన్- వారిని నాశనముచేయవా। అనఁగాఁ జేయనేచేతువ నియనుట—వాతాపియను వానికథ రామాయణ ఆరణ్య కాండ౧౧వసర్గలోఁజూడవలసినది। ఈకథయేమనఁగా వాతాపియిల్వలులను రాక్షసులిద్దరుండిరియందులోనిల్వలుఁడు ముని వేషముదాల్చి వాతాపిని మేకనుజేసి తనయాశ్రమమునకువచ్చినమునికి వాతాపిని ఛేదించి పాకముఁజేసి విందుఁబెట్టిలెస్సగానామునిభోజనముచేసినతరువాత వాతాపీయనిపిల్వఁగాభక్షించినముని కడుపు చించుకొని వాతాపి బైటికిరాఁగానామునిదేహము వాతాపియిల్వలులిద్దరును భక్షించుచుండిరీరీతిన బహుదినములు జరుగుచు నుండఁగానగస్త్యమహామునిని నెల్లవారలుప్రార్థింపఁగానొకదిన మందాయాశ్రమమునకుఁ బోవఁబూర్వరీతిచేత నేసకలము జరిగించిబైటరమ్మనియిల్వలుఁడు పిలువఁగానగస్త్యుఁడు వాతాపియెప్పుడో జీర్ణమాయెననఁగానిల్వలుఁడుకోపముచే నుకొని పైఁబడ రాఁగానగస్త్యుఁడుహుంకారముచే వానిభస్మముగావించెననియున్నది- ఇల్వలవాతాపులపుట్టుక-దూర్వాసులవలన నజాముఖియిందని శంకరసంహితలోనున్నది॥ ౬౦

తే॥ త్రిపురసంహారమొనరించునపుడుహరుఁడు। బండిగల్లుగనీమేను గండిఁజేసె। నదియు సెలవాటితెగటార వైతిచంద్ర। యకటరోహిణివలనిపథ్యమునఁజేసి॥ ౬౧

టీక॥ త్రిపుర - మూఁడుపట్టణములయొక్క - సంహారమొనరించునప్పుడు - నాశముచేయుసమయమందు - హరుఁడు- సాంబమూర్తి - బండిగల్లుగన్ - రథచక్రమగునట్టుగా - నీమేను-నీశరీరము - గండిఁజేసెన్ - రంధ్రముచేసెను- అదియున్ - ఆగాయమును - రోహిణివలని- నీభార్యయైనరోహిణివలనఁగలిగిన - అపథ్యమునఁ జేసిభార్యసంగమదోషమువలననైన- సెలవాటి - సెలవేసి - అకట - అయ్యో చంద్ర - చంద్రుఁడా- తెగటారవైతి- చావవైతివిగదా— త్రిపురములనుసాంబమూర్తిసంహరించినకథ శంకరసంహిత - బ్రహ్మోత్తరఖండ - కర్ణపర్వము - మొదలయినవానియందుఁజూడవలెను॥ ౬౧

తే॥ పాలఁబుట్టినమాత్రన మేలిగుణము। నేఁడునీకేలగల్గు నోనీరజారి। నీటఁబుట్టినవాఁడు కాఁడోటువహ్ని। గాల్చుచున్నాఁడుజగమెల్లఁగరుణలేక॥ ౬౨

టీక॥ నీరజారి- ఓచంద్రుఁడా - పాలఁబుట్టినమాత్రన-క్షీరసముద్రములోజన్మించినమాత్రముచేతనే - మేలిగుణము- మంచిగుణము - నేఁడునీకేలగల్గున్ - ఎన్నడు లేనిదియిప్పుడిన మునీకునేటికినవచ్చును - అనఁగాఁగలుగనేరదనుట - నేమనఁగా- వహ్ని - అగ్నిహోత్రుఁడు - నీటఁబుట్టినవాఁడుకాఁడోటు - నీళ్లలోజన్మించినవాఁడేకాఁడా - జగమెల్లన్ - లోకమునంతయు - కరుణలేక - దయలేక - కాల్చుచున్నాఁడు - దహించుచున్నాఁడు చూడలేదాయని భావము — అనఁగాజన్మస్థానముకారణము-గాదుగుణమేకారణమనుట - భారతమందు - వృత్తేనహిభవత్యార్యః నకులేనన విద్యయా- అనివచించెనుగానజన్మతఃప్రాశస్త్యము లేదనుట

క॥ గోవధముసేయుతురకల। దైవంబవునీవు మొదలఁదక్కకపాంథ। స్త్రీవధముసేయుచుండెదె। నీవర్తనమేమిచెప్పనీరజవైరీ॥ ౬౩

టీక॥ నీరజవైరీ-ఓచంద్రుఁడా-నీవు- ఈవు- మొదలన్-తొలుత-గోవధముసేయు- ఆవులజంపునట్టి- తురకల-తురుష్కులయొక్క - దైవంబవు- దైవమవు-అనఁగాఁదురకలు నెలఁజూడుపు చూచినతర్వాత గానినాశకులదేవతలను గొలువరుగనుక వారికిముఖ్యదైవమనుట - తక్కక - కాఁబట్టిసంకోచములేకుండ పాంథస్త్రీవధముసేయన్ - విరహిణీస్త్రీలను

అజుడౌటన్ - బ్రహ్మయగుటచేత - మునుమున్న - ముందు ముందుగా - పడివాగెఁగొనివచ్చు - కళ్లెము వేససిద్ధపఱచి తేఁబడిన - రాయంచకోదమయినఁగన్ - వయస్సుగలరాజహంసవాహన మోయున్నట్టుగా - ఇకక్కడసూర్యుండు దయకాలమందు బ్రహ్మస్వరూపుఁడును । మధ్యాహ్నకాలమందు శివస్వరూపుఁడును సాయంకాలమందు విష్ణుస్వరూపుఁడును నయి త్రిమూర్త్యైక్యాత్మకత్వము వహించుచున్నాఁడని ప్రసిద్ధము ॥ ఉదయగిరిమీఁదన్ - తూర్పుకొండమీఁదను - కోపురంబుండి - చెట్లకొనలనుండుకొని - వైగులఁజూచుచుండి - నిగుడి - సాగివచ్చుచున్న - అహితరవిరశ్మిచేన్ - శత్రుఁడైనసూర్యునియొక్క కిరణముస్త్రాటిచేత - బద్ధుఁడగుచున్ - కట్టఁబడినవాఁడగుచు - తోడిబలగమైనట్టి - కూడనుండుతనకుంగైన - చుక్కల - నక్షత్రములయొక్క - వలస త్రోవఁజూపన్ - ఉపద్రవాదులచేస్వదేశమును విడిచిపోయినవారిమార్గమును గనుపఱచుటకు - ప తెంచెననన్ - వచ్చెనోయన్నట్టుగా - వేగురుచుక్కవొడిచెన్ - తెలవారిచుక్కపొడచెను॥ ౨౫

మ॥ సకలాశాగతినర్మకోపవిరతి శ్రౌతక్రియారంభణాత్మకవర్గత్రయికిన్ మదుచ్చరితశబ్దజ్ఞానమే మూలమిం
తకుఁజాలన్ వినుఁడంచుఁ దెల్పుగతిఁ జెంతం గొండపై పల్లెలం । గృకవాకుల్ మొరసెం గృహాపరిఁద్రి
భంగిన్ భుగ్నకంఠధ్వనిన్॥ ౨౬

టీక॥ సక...కిన్ - సకలాశాగతి - సమస్తదిక్సంచారరూపమైనదియు - నర్మకోపవిరతి - ప్రణయకోపత్యాగరూపమైనదియు - శ్రౌతక్రియారంభణాత్మక - వేదవిహితకర్మోద్యమరూపమైనదియునయిన - వర్గత్రయికిన్ - అర్థకామధర్మములకు మదుచ్చరిత - నాచేతఁబలుకఁబడిన - శబ్దజ్ఞానమే - శబ్దముయొక్క తెలివే - అనఁగా నాకూఁత వినుటయే - మూలము - కారణము - ఇంతకుఁజాలన్ - ఇదివఱకుఁజాలును - వినుఁడంచున్ - ఆలకింపుఁడని - తెల్పుగతిన్ - తెలియఁజేయునట్టుగా - చెంతన్ - సమీపమందు - కొండపై పల్లెలన్ - పర్వతముమీఁదనున్న - చిన్నయూళ్లయందు - గృహాపరిన్ - ఇండ్లమీఁదను - కృకవాకులు * కోడిపుంజులు ( * కృకవాకుస్తామ్రచూడః కుక్కుటశ్చరణాయుధయనియమరము * ) భుగ్నకంఠధ్వనిన్ - కొద్దిగా చేయఁబడినగళరవముచేత * త్రిభంగిన్ - మూఁడువిధములౌనట్టుగా - మొరసెన్ - కూసెను - అనఁగాఁ దెల్లవారవచ్చునప్పుడు కోళ్లు కూయఁగా జనులందఱు స్వకార్యములకొఱకు లేచి సమస్తదిక్కులకుఁ బోవుచున్నారనియు దంపతులదివఱకు బొలయలుకలతోనుండియిప్పుడు తెల్లవారవచ్చెఁగదాయనియా కోపమును విడిచి పెట్టిసంభోగమున నుపక్రమించుచున్నారనియును పక్షికాలమైనదిగనుక వేదవిహితమైన స్నానసంధ్యాదులు జరిగించుచున్నారనియు భావము॥ ౨౭

మ॥ ఇనుఁడస్తాద్రికిఁబోవఁ గొల్లఁగొని నేఁడే తేఁ దద్దీప్తినం । జనసంబంధజబాంధవంబున రతిశ్రాంతాంగ
నానేత్రకో । ణనికాయంబున డాఁచితద్ధవళిమం బాఁబూనెనో చొప్పమా । ఱ్పనన్ వెల్వెలబాఁఱె దీపక
ళికాప్రాతంబు శాతోదరీ॥ ౨౮

టీక। ఇనుఁడు - సూర్యుఁడు - అస్తాద్రికిఁబోవన్ - పడమటికొండకుఁబోఁగా - కొల్లఁగొని - దోచుకొని - నేఁడే తేన్ - నేఁటిదినము తిరిగిరాఁగా - తద్దీప్తిన్ - ఆతేజస్సును అంజనసంబంధజబాంధవంబునన్ - అంజనసంబంధజ - కాటుకయొక్క సంబంధమువలనఁబుట్టిన - బాంధవంబునన్ - చుట్టఱికముచేత - రతి...బునన్ - రతిశ్రాంత - సంభోగజాగరమువలన నలసిన । అంగన - స్త్రీలయొక్క - నేత్రకోణనయనైకదేశమును - అనఁగా నేత్రాంతములనుట - నికాయంబునన్ - గృహమునందు - డాఁచి - మరుగుచేసి - తద్ధవళిమన్ - ఆనేత్రములయందలి ధావళ్యమును - బాఁబూనెనో - తానువహించెనోయేమి - చొప్పుమాఱ్పన్ - మాఱువేషముగనుపఱచుటకు - అనన్ - అనునట్టుగా - శాతోదరీ - కృశోదరివైన యోవరూథినీ - దీపకళికా - దీపాంకురములయొక్క - ప్రాతంబు - సమూహము - వెల్వెలఁబాఱెన్ - తెల్లఁదెల్లగాఁబోయెను — ఈపద్యములో నంజనసంబంధజబాంధవంబుననన్న చోట దీపముల మీఁదఁ బట్టిన కాటుకలు స్త్రీల నేత్రములకుఁ బెట్టుకొనుటచేత దీపములకును స్త్రీల నేత్రములకును సంబంధ బాంధవ్యముగలిగినదని తాత్పర్యము - సూర్యుని తేజస్సును వహించి దీపకళికలు రాత్రియందు నెల్లగాఁ దేజరిల్లి తెల్లవారవచ్చునప్పుడు తెల్లఁదెల్లగ

టీక ॥ అర్ధచంద్రునిసొంపుఁ గ - సగము గా మడుఁగా బిళ్లయొ క్క - కళను - అవఘళించు - తిరస్కరించుచున్న - లలాటప ట్టిదీర్చిన - పలకవంటినొసటియందుదిద్దిన - గంగమట్టితో డఁ గ - గంగాసంబంధమైనమృత్తికతోడను - చెక్కుటద్దము లందుఁ గ - దర్పణములవంటి గండస్థలములయందు - జిగి వె ల్లువలువింప - కాంతిప్రసరించుచున్న - రమణీయమణి కుండలంబులతోడఁ గ - రమణీయ-సుందరమైన - మణికుండ లములతోడఁ గ - రత్నఖచితములైన కర్ణాభరణములతోడ ను - పసిఁడిఁ వ్రాంత చెఱఁగు - బంగారువ్రాసిన పనిగిలిగిన యంచులయొక్క - మిసిమిదోఁపఁ గ - కాంతిగనుపడునట్టు గా - చెలంగు - ఒప్పుచున్న - అరుణాంశుకోత్తరీయం బుతోడఁ గ - అరుణాంశుక - ఎఱ్ఱనిరంగుగల - ఉత్తరీయం బుతోడఁ గ - పైయంగవస్త్రముతోడను - సరిలేని రాకట్టు సమానరహితమైన రత్నములచెక్కుటగల - జాళువా మొలకట్టుఁ గ - బంగారు మొలత్రాడుచేత - బెడఁగారు వె లుఁగుచున్న - నీరాకఁ పిసిఁ జెతోడఁ గ - కొంచెముగా యగలదోవతికచ్చముతోడను॥ధవళధవళములగు- మిక్కి లితెల్లనైన - జన్నిదములతోడఁ గ - యజ్ఞోపవీతములతోడ ను - కాశికాముద్రయిడిన - కాశీముద్రఁ జెక్కిన - ఉంగర ములతోడఁ గ - ఊర్మికలతోడ - శాంతరసమొలక - శాం తరసముతోఁ బఁడుచున్న - బ్రహ్మతేజంబుతోడఁ గ - బ్రా హ్మణవర్చస్సుతోడను - వియచ్చరప్రవరుఁడు - గంధర్వ శ్రేష్ఠుఁడు - అపుడు- ఆసమయమందు - ప్రవరుఁడయ్యెఁ గ ప్రవరుఁడాయెను - ననఁగాఁ బ్రవరాఖ్యునిరూపమువహిం చెను॥ ౯౩

క ॥ ఇటనవ్వరూధినియునొ । క్కొటఁగతిపయసఖులుదనన్నుఁ గొలిచినడువఁ గాఁ । జటులఝళఝళరవప ద । కటకసమాకృష్టకేళికలహంసికయై ॥ ౯౪

టీక ॥ ఇటఁ గ - ఇక్కడ - అవ్వరూధినియుఁ గ - ఆవరూధిని యును - ఒక్కొటఁ గ - ఏకముఖముగా - కతిపయసఖులు కొందరుచెలికత్తెలు - తన్నుఁ గొలిచినడువఁ గాఁ గ - తనను బరివేష్టించినడుచుచునుండఁ గా - చటు...యై -చటుల-చం చలమైన - ఝళం ఝళరవ - ఝళం ఝళయను ధ్వనితోఁ గూడుకొన్న - పదకటక - కాలియందెలచేత - సమాకృష్ట- రప్పించఁబడుచున్న - కేళికలహంసికయై- క్రీడార్థముగాఁ బెంచఁబడినమధురముగాఁ బలుకుసు రాళముగలదై - అనఁ గాఁ గాళ్లయందెల ధ్వనితోనడుచు చునుండహంసయును భ్రాంతిచేతఁ బెంపుడం చలు వెంటఁబడివచ్చుచున్నవనితా త్పర్యము. ౯౫

సీ ॥ ఉరగఫూత్కారధూమోగ్రగంధముఁ బాసి - పొలయఁ బోయీతావిమలయపవనుఁ । డనలాక్షు పెడ బొబ్బనలమినతలదిమ్ముఁ - బాయఁ బోయీ తేంట్లపాటమరుఁడు। ఘర్మసామీప్యసంకలితదాహస్ఫూర్తి నీఁగఁ బోయీచల్లనీడమధువు।గరళసొందర్యాత్తకరసుధాకటుకత్వ- ముడుపఁ బోయీ తేనెనోషధీశుఁ॥

తే ॥ డనఁగజంపకకురువకపనసతినిశ । నిచులవంజులదాడిమీవిచికిలామ్ర। పాటలీపూగకేసరప్రముఖతరు ల । సొబగుమీఱుసుద్యానంబుఁ జొచ్చియచట॥ ౯౬

టీక ॥ మలయపవనుఁడు - చందనాచల సంబంధమైనవా యువు - ఈతావిఁ గ - ఈపరిమళముచేత - ఉరగఫూత్కా రధూమోగ్రగంధముఁ బాసి - ఉరగ - సర్పములయొక్క - ఫూత్కార - ఫూత్కారమువలనఁ బుట్టిన - ధూమ - పొగ యొక్క - ఉగ్రగంధముఁ బాసి - తీక్ష్ణమైనవాసనను విడి చిపెట్టి - పొలయఁ బో - వ్యాపించునుసుమా - మరుఁడు- మన్మథుఁడు - ఈ తేంట్లపాటఁ గ- ఈతుమ్మెదలయొక్కగా నముచేత - అనలాక్షు - అగ్ని నేత్రముగాఁ గలశివునియొ క్క - పెడబొబ్బఁ గ - పెద్దసింహనాదముచేత - అలమిన తలదిమ్ముఁ గ - పొందినతలనొప్పిని- పాయఁ బో- వదలించు కొనునుసుమా - మధువు- వసంతుఁడు - ఈచల్లనీడఁ గ- ఈ చల్లనైనఛాయచేత - ఘర్మసామీప్య సంకలితదాహస్ఫూ ర్తిఁ గ - ఘర్మసామీప్య - గ్రీష్మకాలముయొక్కచేరువచేత సంకలిత - పొందఁబడిన - దాహస్ఫూర్తిఁ గ- తాపాతిశయ మును - నీఁగఁ బో - పోఁగొట్టుకొనునుసుమా - ఒషధీశుఁ డు - చంద్రుఁడు - ఈతేనెఁ గ - ఈమకరందముచేత- గరళ సొందర్యాత్త- కాలకూటముతోఁ గూడఁ బుట్టుటవలనఁ బొం దఁబడిన - కర - కిరణసంబంధమైన - సుధా - అమృతమం దలి - కటుకత్వముఁ గ - కారపుగుణమును - ఉడుపఁ బో పోఁగొట్టును సుమా— అనఁ గానీవనవృతు సంబంధమై నపరిమళముచేత నుతుమ్మెదపాటలచేత నానీడచేతను దే నెచేత నును లయపవనుఁడు మొదలైనవారేత మ

యుండలి యసహ్యములను బోఁగొట్టు కొందురని చెప్పఁచునుండఁగా నితరులమాట చెప్ప నేమని లేదని భావము॥ అనఁగన్ - అనునట్లుగా. చంప...రులన్-చంపక- సంపెఁగలును పురువక- ఎఱ్ఱగోరంటలును। పనస। పనసవృక్షములును।తిలక। నెమ్మిమ్రాకులును। నిచుల। ప్రబ్బలిచెట్లును।వంజుల।అశోకవృక్షములును। దాడిమీ। దానిమ్మలును। విచికిల-సన్నమల్లెలును। ఆమ్ర। మామిళ్లును। పాటలీ। కలిగొట్టును। పూగ। పోఁకమ్రాఁకులును। కేసర। సురపొన్నలును। ప్రముఖ మొదలుగాఁగల। తరులన్। వృక్షములచేత। సొబగుమీఱు శృంగారమతిశయించుచున్న।ఉద్యానంబున్- ఆక్రీడవనమును- చొచ్చి- ప్రవేశించి. అచటన్- అక్కడ॥ ౯౬

మ॥ పవమానప్లవమానపంకజరజఃపాళీపిశంగచ్ఛవీ। భవదభ్యర్ణవికీర్ణకృత్రిమసరిత్పాథస్తరంగాహతైం।
దవపాషాణవితర్దికాతలమునన్నాళీకపత్త్రాక్షులు । త్సవ మొప్పన్విహరింపుచున్ సరసవాచాప్రౌఢిమల్
మీఱఁగన్॥ ౯౭

టీక॥ పవ...మునన్- పవమాన। వాయువువలన। ప్లవమాన। తెప్పగాఁదేలుచున్న ।పంకజ। కమలములయొక్క।రజఃపాళీ। పరాగసమూహముచేత। పిశంగచ్ఛవీభవత్ । పచ్చనికాంతిగలిగినదిగానగుచున్నదియు। అభ్యర్ణ।సమీపమందు వికీర్ణ। వ్యాపించుచున్న। కృత్రిమసరిత్ । కల్పితమైననది యొక్క। పాథస్తరంగ। నీటికెరటముల చేత-ఆహత।అంతటఁగొట్టఁబడుచున్నదియు। ఐందవపాషాణ। చంద్రకాంతమణుల చేతఁగట్టఁబడిన । వితర్దికాతలమునన్। తిన్నెమీఁద- నాళీకపత్త్రాక్షులు - తామరరేకులవంటి నేత్రములుగల స్త్రీలు-ఉత్సవ మొప్పన్- వేడుకమించునట్లుగా- విహరింపుచున్- విలాసముగా సంచారము చేయుచును - సరసవాచాప్రౌఢిమల్ మీఱఁగన్- సరస। శృంగారాదిరసములతోఁగూడిన। వాచా।ప్రౌఢిమల్ మీఱఁగన్ । వాక్యచమత్కారములతిశయించునట్లుగా॥ ౯౭

చ॥ బటువయివిఱ్ఱవీఁగిపరిపాటిఁగఁబూవిపరాగపుంజమొ । క్కొటఁగలయంగఁబర్వఁగొనగొమ్మనుఁగోయి
లమించనొప్పెఁజెం। గటియేలమావిహారరుచిగండవొడింగనుపట్టినీలతా। స్ఫుటతరచూచుకంబగుచుఁబొ
ల్చువనేందిరగుబ్బచన్నకన్॥ ౯౮

టీక॥ బటువయి - వట్రువయయి - విఱ్ఱవీఁగి - విజయఁబడి పరిపాటిఁగఁబూచి - తనుమాత్రముగాఁబుష్పించి - పరాగపుంజము - పుష్పాడిసమూహము - ఒక్కొటఁగలయంగఁబర్వన్ - అంతటఁగలిసియున్నట్లు వ్యాపించఁగా - కొనగొమ్మనుఁగోయిలమించన్ - చివరనున్నశాఖమీఁదఁ గోయిలయొప్పఁగా - చెంగటియేలమావి - సమీపమునందలిగున్నమామిడి - ఒప్పెన్ - అమరియుండెను - యెటువలెననఁగా- హారరుచిన్ - ముత్యాలపేరులయొక్క-కాంతిచేత - గండవొడింగనుపట్టి - బుక్కాపొడిచేతఁజూడనొప్పి - నీలతాస్ఫుటతరచూచుకంబగుచున్-నీలతాస్ఫుటతర నైల్యము చేతవికాసనమైన - చూచుకంబగుచున్ - చన్నుమొనగలదగుచు. పొల్చు - వెలయుచునుండు-వనేందిర- కాననలక్ష్మియొక్క- గుబ్బచన్నన్ - కదలనిబటువైన స్తనమో యనునట్లుగా నొప్పెనని సంబంధము॥ ౯౮

తే॥ వెలఁది యిచ్చోటిసంపంగివిరులుగహనదేవతలయిండ్ల నెత్తినదీపశిఖలు । గాకయుండినఁ బంచబంగా
ళముగుచుఁ। బాఱునే మత్తమధుకరపటలతమము॥ ౯౯

టీక॥ వెలఁది- ఓచెలియా- ఇచ్చోటిసంపంగివిరులు - ఈ వనమందలిచంపకపుష్పములు- గహనదేవతల- వనదేవతలయొక్క- ఇండ్లనెత్తిన-గృహములలోఁబెట్టిన- దీపశిఖలు- దీపజ్వాలలుసుమా- కాకయుండినన్- అటులఁగాకపోయెనేని- మత్తమధుకరపటలతమము- మత్తమధుకర। మదించినతుమ్మెదలయొక్క। పటల।సమూహమను। తమము।చీఁకటి- పంచబంగాళముగుచున్ - పటాపంచలై - పాఱునే- పాఱిపోవునా- అనఁగా సంపంగిపువ్వులు దీపకళికలవలె నేజ్వలించునవియనియు దీపములకును జీఁకటికిని నెట్లువిరోధమో యటువలెనే సంపంగిపువ్వులకును దుమ్మెదలకును విరోధమనియుఁ దాత్పర్యము॥ పంచబంగాళమనఁగా శూన్యమనుట॥ ౯౯

చ॥ అపరిమితానురాగసుమనోలసనయై చిగురాకుచేతులం। దపసినిఁగౌఁగలించెవనితాయిదెరంభదలంపరం
భ దా। నపరిమితానురాగసుమనోలసనయై చిగురాకుచేతులం। దపసినిఁగౌఁగలించుటు చిత్రముకాదాయని
నవ్వెరంభయన్॥ ౧౦౦

టీక ॥ అపరిమితానురాగసుమనోలసన్మై - అపరిమిత - మితములేని - అనురాగ - పొందఁబడినరక్తిమగలిగిన - సుమనః - పుష్పములచేత - అలసన్మై - ఓపికలేనిదై - చిగురాకుచేతులన్ - కిసలయములనుహస్తములచేత - వనితా - ఓచెలియా - ఇదె రంభ - ఇదోయట్టిచెట్టు - తపసిని - అవిసిచెట్టును - కౌఁగలించెన్ - ఆలింగనచేసుకొనెను - అనియొకస్త్రీపలుకఁగా ॥ రెండవస్త్రీ - యీవాక్యములకేయర్థాంతరముచేసి-పలుకుచమత్కారమెట్టిదనఁగా తలంపన్ - విచారింపఁగా - రంభదాన్ - రంభయనునప్సరసతాను - అపరిమితానురాగసుమనోలసన్మై - అపరిమిత - మితములేని - అనురాగ - ప్రేమతోఁగూడిన - సుమనః - మంచిడెందముచేత - అలసన్మై - ఓపికలేనిదై - చిగురాకుచేతులన్ - పల్లవములవంటిహస్తములచేత - తపసిని - స్వర్గము బొందినతపస్సంపన్నుని - కౌఁగలించుట - ఆలింగనచేసుకొనుట - ఉచితంబెకదా - యుక్తమేకదా - అని - ఇట్లని రంభయన్ - అచ్చటనున్నరంభయును - నవ్వెన్ - హసించెను॥ ౧౦౦

తే ॥ కొమ్మకన్నుఁగవకుఁగోరగింపఁగఁబూచి। తఱుచుజొత్తుగ్రక్కెదాసనంబు। గవయుసీతమాలగహనాంధకారవి। తానమునకునుదయభానుడయ్యె॥ ౧౦౧

టీక ॥ కొమ్మ - ఓచెలియా - కన్నుఁగవకున్ - నేత్రయుగమునకు - కోరగింపఁగఁబూచి - వెకసమగునట్టుగాఁ బుష్పించినదై - తరుచు - మిక్కిలి - జొత్తుగ్రక్కి - ఎఱ్ఱనికాంతినిబ్రసరింపజేయుచున్న - దాసనంబు - జపాపుష్పపుచెట్టు - కవయు - ఆవరించుచున్న - ఈతమాలగహనాంధకారవితానమునకున్ - ఈతమాలగహన - ఈచీఁకటిమ్రాకులయడవియనునట్టి - అంధకార - కారుచీఁకటియొక్క - వితానమునకున్ - సమూహమునకు - ఉదయభానుఁడయ్యెన్ - ఉదయించుచుండుసూర్యునివంటిదై - వెలిఁగెనుసుమాయనియర్థము — అనఁగాసూర్యుఁడెట్లనికాంతితోనుదయింపఁజీఁకటులేప్రకారముగావిఱిసిపోవునో యాప్రకారముగానిండఁబూచినదాసనపుచెట్టువలనఁజుట్టునున్నచీఁకటిమ్రాకులయొక్క నైల్యమువిఱిసి పోవుచున్నదనితాత్పర్యము॥ ౧౦౧

తే॥ శ్యామలోపరినిబిడపత్త్రాభ్రములకుఁ। గాండషండంబుదిగువానకాల్లుగాఁగఁ - బంకరుహనేత్రవర్షర్తు శంకనొసఁగు। పోఁకబోదియనవకంపుమ్రోఁకఁగంటె॥ ౧౦౨

టీక ॥ శ్యామలోపరినిబిడపత్త్రాభ్రములకున్ - శ్యామల - నల్లనైన - ఉపరి - మీఁదనున్న - నిబిడపత్త్ర - దట్టమైనయాకులను - అభ్రములకున్ - మేఘములకు - కాండషండంబు - కాండ - మ్రాకులస్కంధములయొక్క - షండంబు - సమూహము - దిగువానకాల్లుగాఁగన్ - భూమికిడిగివచ్చునట్టియుదకధారలవుచునుండఁగా - వర్షర్తుశంకనొసఁగు* వర్షర్తు - వర్షాకాలము యొక్క - శంకనొసఁగు - సందేహమును గలుగఁజేయుచున్న - అనఁగావర్షాకాలమనిపించుచున్న * పోఁకబోదియ - క్రముకవృక్షముయొక్క - నవకంపు - నేవళమైన - మ్రోఁకన్ - చాలునను - పంకరుహనేత్ర - ఓచెలియా - కంటె - చూచితివా॥ ౧౦౨

ఉ॥ చూతమెడాసిపక్వతరశుక్తిపుటాంతరదృశ్యమౌక్తికవ్రాతములై వెలుంగుగరువంపుగొటారులనొప్పు తామ్రపర్ణీతటమట్టుజీర్ణదళబృందసమావృతపాండురప్రసూనాతిమనోజ్ఞమూలములనర్థినెసంగుమధూకసాలముల్॥ ౧౦౩

టీక ॥ పక్వ...వ్రాతములై - పక్వతర - పండఁబాఱిన - శుక్తిపుటాంతర - ముత్తెపుచిప్పలలోపల - దృశ్య - చూడఁదగిన - మౌక్తికవ్రాతములై - ముత్తియముల సమూహములుగలవై - వెలుంగు - తేజరిల్లుచున్న - గరువంపు - పొడవుగల - కొటారులనొప్పు - శుక్తిరాసులచేతనమరుచున్న * తామ్రపర్ణీతటమట్టు - తామ్రపర్ణీ - తామ్రపర్ణియను నేటియొక్క - తటమట్టు - ఒడ్డువలె - జీర్ణ...ములన్ - జీర్ణదళ - రాలినపండుటాకులయొక్క - బృంద - సమూహముచేత సమావృత - లెస్సగానావరింపఁబడిన - పాండుర - తెల్లనైన ప్రసూన - పుష్పాలచేత - అతిమనోజ్ఞ - మిక్కిలిసుందరమైన - మూలములన్ - మొదళ్లచేత - అర్థినెసంగు - లెస్సగానొప్పిన - మధూకసాలములు - ఇప్పచెట్లు - చూతము - ఎడాసి - సమీపించి - చూతమె - కనుఁగొనుదమా - ఆయిప్పరసలుతమలోదామనుకొనిరని తెలియవలెను — తామ్రపర్ణీనదియందు ముత్యపుచిప్పలుపుట్టుచున్నవనిప్రసిద్ధము ॥ ఇకడముత్యపుచిప్పలకునురాలినపండుటాకులకును - నుపమానోపమేయ

ఉ ॥ కాంచి కలక్వణత్కనక కాంచిక యై యెదు రేగి యప్పుడ । కాంచన కేతకీ కుసుమ గాత్రి వయస్యల డించి తన్నికుం। జాంచలవీథిఁ దాటు ఘనాంత చలచ్చపలాకృతిం గలం। గాంచిన వస్తువుం దెలిసి కాంచిన యట్లను రక్తిఁ గాంచుచున్ ॥ ౧౩౩

టీక ॥ కాంచి - వీక్షించి - కలక్వణత్కనక కాంచికయై - కల అవ్యక్తమధురమౌనట్లుగా - క్వణత్ - ధ్వనిచేయుచున్న । కనక - బంగారముతోఁ జేసిన - కాంచికయై - ఘంటలయొడ్డాణముగలదై - ఎదురేగి - అభిముఖముగాఁ బోయి - అప్పుడు - ఆసమయమందు - ఆ కాంచన కేతకీకుసుమ గాత్రి - ఆకాంచన - సువర్ణమయమైన - కేతకీకుసుమ - మొగిలిపూవంటి - గాత్రి - దేహముగల యావరూథిని - వయస్యల డించి - చెలికత్తెలను విడిచి పెట్టి - తన్నికుంజాంచలవీథిన్ - తన్నికుంజ । ఆపొదలయొక్క । అంచలవీథిన్ - చివరలచాలుపునందు - దాటుచున్ - సంచరించుచును - ఎట్టులనెననఁగా - ఘనాంతచలచ్చపలాకృతిన్ - ఘనాంత - మేఘముయొక్క చివరయందు - చలచ్చపలాకృతిన్ - చలించుచునుండు మెరుపుతీఁగవలెనని యన్వయము - కలన్ గాంచిన వస్తువున్ - స్వప్నములోఁ జూచినపదార్థమును - తెలిసి కాంచిన యట్లు - మేలుకొని చూచిన ట్లుగా - అనురక్తిఁ గాంచుచున్ - అనురాగము బొందుచు ॥

ఉ ॥ ఆకమలాక్షి యింపున దృగంచలమించుక మూసి హర్షబా । ష్పాకుల శోణకోణరుచు లగ్రమునం జనఁ జూచు చూపు తీ। రై కనుపట్టెఁ దమ్మరస మంటికొనన్ వెడవింటివాఁడు క్రోధైకధురీణతం గఱచియేసిన సింగిణికోలయో యనన్ ॥ ౧౩౪

టీక ॥ ఆకమలాక్షి - ఆవరూథిని - ఇంపునన్ - ఇష్టముచేత దృగంచలమున్ - నేత్రాంతములను - ఇంచుకమూసి - కొంచెముగా మీలితముఁ జేసి - యనఁగా రెప్పలోరగాఁ జేసి ✻ హర్షబాష్పాకుల శోణకోణరుచులు - హర్షబాష్పాకుల - ఆనందమువలనఁ బుట్టిన - కన్నీరుచేతఁ దొట్రుపడుచున్న - శోణ - ఎఱ్ఱనైన - కోణరుచులు - కొలుకుల కాంతులు - అగ్రమునం జనన్ - ముందు మిగులునట్లుగా - చూచు చూపు - వీక్షించు వీక్షణము - తీరై కనుపట్టెన్ - చక్కనై కనుపడెను ఎట్టులనెననఁగా - తమ్మరసమంటుకొనన్ - తాంబూలగస మంటుకొనునట్టుగా - వెడవింటివాఁడు - మన్మథుఁడు క్రోధైకధురీణతన్ - కోపమందలి ముఖ్యమైన భారవాహిత్వచేత - కఱచియేసిన - కసిదీరునట్లు కొఱికి వేసిన - సింగిణికోలయో యనన్ - శృంగధనుస్సుయొక్క బాణమో యనువట్లుగా నేకనుపట్టెనని సంబంధము - అనగా వరూథిని యొక్క చూపనకును - మన్మథుని బాణమునకును సుపమానము - కొలుకులయందలి రక్తిమకును - అంటిన తమ్మరసమునకును - ఉపమానము ॥ ౧౩౪

సీ ॥ తొలుదొల్త వానిఁ గన్నులఁ గాంచినప్పుడ ✻ పల్లవాధరి గుండె ఝల్లుమనియె - నట రెండుమూఁడంజలరుగునప్పుడ కాళ్ళఁ ✻ బంకజాక్షికిఁ దొట్రుపాటు గదిరె । డాయంగఁ జనునప్పుడ ముఖాంబుజంబునఁ ✻ గంబుకంధరకు దైన్యంబు దోఁచెఁ । గదసి నిల్చినయప్డ కనుదోయి రెప్పల ✻ లలనకు మిగులఁ జంచలత బెరసెఁ ॥ తే ॥ కటకటా యనునపుడ గద్గదిక వొడమెఁ । జెఱఁగు వట్టినయపుడ చేఁ జెమట గ్రమ్మె । సొలసి మాటాడ నుంకించె దలఁచి మోముఁ ✻ దెరకొనఁ జూచినపుడ కన్నీరు వడిసె ॥ ౧౩౫

టీక ॥ తొలుదొల్తన్ - మొట్టమొదట - వానిన్ - ప్రవరాఖ్యరూపము ధరించిన గంధర్వుని - కన్నులఁ గాంచినప్పుడ - కంట్లఁ జూచినక్షణమందే - పల్లవాధరి గుండె - చిగురుటాకువంటి పెదవిగల ఆవరూథిని యొక్క హృదయము - ఝల్లుమనియెన్ - ఝల్లుమనెను - అట రెండుమూఁడంజలు - తర్వాత రెండుమూఁడడుగులు - అరుగునప్పుడ - నడువఁగానే - కాళ్ళన్ ✻ పాదములయందు - పంకజాక్షికిన్ - తామరలవంటి కన్నులుగల వరూథినికి - తొట్రుపాటు గదిరెన్ - తొందరపాటు గలిగెను - డాయంగఁ జనునప్పుడ - సమీపించి పోఁగా - ముఖాంబుజంబునన్ - పద్మవంటి మోమునందు - కంబుకంధరకున్ - శంఖవంటి కంఠముగల వరూథినికి - దైన్యంబు దోఁచెన్ - దీనభావము గనుపించెను - కదసి నిల్చినయప్డ - సమీపించి నిలుచుండఁగానే - కనుదోయి రెప్పలన్ - నేత్రయుగపక్ష్ములయందు - లలనకున్ - వరూథినికి - మిగులన్ - మిక్కిలి చంచలత బెరసెన్ - చాంచల్యము బొందెను - కటకటా యనునపుడ - అయ్యయ్యో యనునప్పుడే - గద్గదిక వొడమెన్ - డగ్గుత్తిక కలిగెను - చెఱఁగు వట్టినయపుడ - వానిదుప్పటికొంగు పట్టుకోఁగానే - చేఁ జెమట గ్రమ్మెన్ - హస్తమునందల్ల

స్వేదము క్రమ్ముకొనెను- పొలసి- బడలి - మాటాడక- భాషించుటకు - ఉంకించఁదలఁచి - తప్పించిదాఁటుటకు నెంచి మోముఁదీరకొనఁ జూచినపుడ - ముఖమును తయు లేస్సగాఁగనుసమయమునందే- కన్నీరువడిసెను- నేత్రములయందునీరు జారెను॥ ౧౨౬

క॥ పాటితకరికరతద్ద్యుతి - పాటచ్చరగండఫలక భాగంబులపైఁ ౹ గాటుకకన్నీరొలుకఁగ - మాట వెడలఁ గ్రేటికొనుచు మానిని వలికెన్॥ ౧౨౭

టీక॥ పాటి...లపైన్- పాటిత - చెక్కుబడి చేయఁబడిన। కరివంత- గజదంతములయొక్క - ద్యుతిపాటచ్చర- కాంతిని హరించున వియునయిన - అనఁగా విరహము వలనఁబుట్టిన తెలుపుచేతదంతపుపలకలవలెనున్న - గండఫలక - పలకలవంటిచెక్కిళ్లయొక్క- భాగంబులపైన్- ప్రదేశములమీఁద- కాటుకకన్నీరు - అంజనముతోఁగూడిన నేత్రోదకము- ఒలుకఁగన్ - చిందఁగా- మాట వెడలఁ గ్రేటికొనచున్-బలవంతముగామాటబయిటికిరప్పించుకొనుచును - మానిని వలికెన్ - వరూథినియొక వాక్యముచెప్పెను॥ ౧౨౭

ఉ॥ ఏలరయీచలంబుడిగి యేలర బాలరసాలమాలతీ। జాలములో శశాంకకరజాలములో వలవంతన గ్రాఁవుల్ ౹ జాలుగ నాల్గుజాలుఁ గఁజాలుభవంబను నంతఁగాఁకకుం। బాలయి రాత్రిపంచశరు బారికిఁజిక్కితినీ కుఁదక్కితిన్॥ ౧౨౮

టీక॥ ఏలర- ఎందుకురా - ఈచలంబుడిగి యేలర - ఈమచ్చరముమాని యేలుకొనరా - బాలరసాలమాలతీజాలములోన్- బాలరసాల- లేఁతతీయమామిళ్లయొక్కయు- మాలతీ- జాజి చెట్లయొక్కయు జాలములోన్- సమూహములో - శశాంకకరజాలములోన్ - శశాంక - చంద్రునియొక్క - కరజాలములోన్- కిరణసమూహములో- అనఁగా వెన్నెలలో - వలవంతన్- విచారముచేత - అశ్రువులు - కన్నీళ్లు- జాలుగన్ - కాలువలైపారఁగా - నాల్గుజాలున్- నాలుగుజాములును - అనఁగా యామచతుష్టయమునను టిఁకఁజాలుభవంబనునంతన్ - జన్మమిఁకమీఁదఁజాలునని పించునంత- కాఁకకుం బాలయి- తాపమునకులోఁబడి- రాత్రిన్- రేయియంతయు- పంచశరు బారికిఁజిక్కితిన్-మన్మథునియొక్క- మొన వాతనుబడితిని - నీకుఁదక్కితిన్- నీకువశమైనదాననైతిని॥ ౧౨౮

శా॥ రావైరాగ్యముఁబూని నీవుగడు నిర్దాక్షిణ్యచిత్తంబునన్। రావై తేచవిగానియిందులకు హాహారా హాహారిగాఁబోరియే। లావాలాయము సేయఁగా బ్రతుకనీ వాచారవంతుండవై। చావో యెక్కుడో నీయెడంగలుగు వాంఛన్ భూసురగ్రామణీ॥ ౧౨౯

టీక॥ రా- రమ్ము - వైరాగ్యముఁబూని - విరక్తినివహించి- నీవుగడునిర్దాక్షిణ్యచిత్తంబునన్- నీవుమిక్కిలి దాక్షిణ్యము లేనిమనస్సుచేత - అనఁగాఁగఠినహృదయముచేత- రావైతే- రానివాఁడవైతివేని - చవిగానియిందులకున్ - ఇంతయిష్టముగానిపనికి - హాహారా హాహారిగాఁబోరి - విడువకపోరాడి, ఏలావాలాయము సేయఁగాన్- ఎందుకొప్పించవలెను - నీవాచారవంతుండవై- నీవునిష్ఠగలవాఁడవయి బ్రతుకు - సుఖముగాజీవింపుము - భూసురగ్రామణీ- బ్రాహ్మణోత్తముఁడా - నీయెడంగలుగువాంఛన్ - నీయందుఁబుట్టినకోరికచేత - చావో- తనకుమరణమే- ఎక్కుడో-అంతకంటె నెక్కువయేమైననున్నదా - అనఁగానీవు కాకపోయినపక్షమందుఁదనకుమరణమేసిద్ధమని తాత్పర్యము॥

క॥ కట్టడితనమునకిట్లాడి। గట్టిమనసు రాయిఁజేసి కరగవు మఱినీ। పట్టినది విడువవిఁకనిన్నిట్టిట్టన నేలమాయ దృష్టంబుండన్॥ ౧౩౦

టీక॥ కట్టడితనమునకున్ - కఠినత్వమునకు - ఇట్లాడిగట్టి- ఈప్రకారమువడిగట్టుకొని - మనసు రాయిఁజేసి - చిత్తమును పాషాణముతోసరిగాఁజేసి - కరగవు - మెత్తఁబడకుండనున్నావు - మఱినీపట్టినది విడువవు - మఱియు నీవు పట్టినపట్టువదలవు - మాయదృష్టంబుండన్ - మాభాగ్యమీరీతినుండఁగా - ఇఁకనిన్నిట్టిట్టన నేల - ఇంకమీఁదనిన్నునిట్టుఅట్టుల నిటునవలసిన పనియేమియున్నది॥ ౧౩౦

వ॥ అనిననక్కుమానాభూసురకుమారుండు॥

త్తముకొలుపడు ఎందుకనఁగా - మనసి - చిత్తము - అనాశ్వాసితదుఃఖితే - అనాశ్వాసిత - ఓరటలేనిదై - దుఃఖితే - దుఃఖపడుచున్నదానవుండఁగా - సర్వమసహ్యము - సమస్త మును కష్టములోనిది కాదు - అనన్నెరుంగవే - అని చెప్పఁగా గుర్తెరుఁగవా - అనఁగా గుర్తెఱుఁగుదువే కదా యనుట॥ ౧౩౪

క॥ ఐనంగానిమ్ము భవద్దీనతకై వ్రతము విడిచితిం బరులకు మే । లైనం జాలు శరీరం । బైన నుపేక్షింపవల యునది యట్లుండెన్॥ ౧౩౫

టీక॥ ఐనంగానిమ్ము - అయినప్పటికి నిమంచిది - భవద్దీనతకై - నీయొక్క దైన్యముకొఱకై - వ్రతము విడిచితిన్ - నా నియమము వదిలిపెట్టితిని - ఎందుకనఁగా - పరులకున్ - ఇతరులకు - మేలైనం జాలున్ - క్షేమము గలిగిననంతే చాలు ను - శరీరంబైనన్ - అందునిమిత్తము దేహమైనప్పటికిని ఉపేక్షింపవలయున్ - విడువవలసినది - అది యట్లుండెన్ అది యాతీరున నుండెను కదా సరే॥ ౧౩౫

క॥ తివురక నింకొక్కటి విను । కవయు నెడన్ వలయుఁగన్నుఁగవయును మూయన్ । భువి నస్మద్దేశీయ । వ్యవహారము కన్నుఁదెఱవ నఘముసుఁదెఱవా॥ ౧౩౬

టీక॥ తెఱవా - ఓవరూథినీ - త్వరపడక - ఇంకొక్కటివిను - మఱియొకమాటవినుము - కవయునెడన్ - సంగమకాలమందు - వలయుఁగన్నుఁగవయును మూయన్ - రెండుకండ్లను మూసుకొనవలసినది - భువిన్ - భూమియందు - అస్మద్దేశీయవ్యవహారము - మా రాజ్యము యొక్క మర్యాద - కన్నుఁదెఱవన్ - నేత్రముఁదెఱచినట్లైనన్ - అఘముగన్ - పాపము సంభవించుచున్నది - ఇక్కడఁగన్నుమూయవలెనని చెప్పుటయేమనఁగా - కామరూపము ధరించినవారికి సంగమకాలమందున మరణకాలమందును నిద్రాకాలమందునగాని మరూపము నిలువకుండ నిజరూపమే యేర్పడుచున్నది గనుక తాను గంధర్వుఁడౌట తెలిసెనేని శపించిపోనని యీయుపాయము విచారించినాఁడని తెలియవలెను। ౧౩౬

శా॥ ఈమర్యాదకు నీవొడంబడిన మేలే భంగిగాదేని మా । భూమిం జేరఁగ నెట్లు నీ యొడలితోఁ బోవంగ లేనే కదా । యీమందాకిని పొంత నీమునులతో నీవృక్షవాటంబులో । భామా యేఁదపమాచరింతు విధికబ్రహ్మణ్యముం బెట్టుచున్॥ ౧౩౭

టీక ఈమర్యాదకున్ - ఈకట్టడకు - నీవొడంబడిన మేలు - నీవొప్పుకొన్నట్టయిన మంచిదే - ఈభంగిగాదేని - ఈప్రకారము గాకపోయినట్లాయె నేని - మాభూమిం జేరఁగన్ - మాదేశముఁజేరుటకు - ఎట్లు నీయొడలితోన్ - ఏవిధము చేత నీశరీరముతోడ - పోవంగలేనే కదా - పోఁజాలనే కదా - ఈమందాకినిపొంతన్ - ఈగంగాతీరమందు - ఈమునులతోన్ - ఈ ఋషులతోఁగూడ - ఈవృక్షవాటంబులోన్ - ఈవనవాటికలో - భామా - ఓవరూథిని - విధికిన్ - దైవమునకు - అబ్రహ్మణ్యముం బెట్టుచున్ - చాపవద్దని మొఱవెట్టుచును - ఏఁదపమాచరింతున్ - నేఁదపస్సు చేయుచున్నాను॥ అబ్రహ్మణ్యమవధ్యోక్తావిత్యమరః॥ ౧౩౭

తే॥ ఇంకనొక్కటి వినుము పూర్ణేందువదన । వ్రతము చెడ సౌఖ్యమైన నను వలయుఁగలుగ । వాంఛదీఱిన నను నీవు వదలఁ జెల్ల । నేను నిను సమ్మతిలఁ జేసియేఁగుదనక॥ ౧౩౮

టీక॥ ఇంకనొక్కటి వినుము - మఱియొక మాట యాకర్ణింపుము - పూర్ణేందువదన - నిండుచంద్రునివంటి ముఖము గల యోవరూథిని - వ్రతము చెడన్ - నియమము చెడిపోయినప్పటికిని - సౌఖ్యమైనన్ - సుఖతరమైనను - వలయుఁగలుగన్ - కలుగవలసినది - కాంబట్టి - వాంఛదీఱినన్ - కోరిక తుదముట్టనేని - నీవు - ననున్ - నన్ను - వదలఁ జెల్లదు - విడిచిపెట్టఁగూడదు - ఎంతవఱకనఁగా - ఏను నిను సమ్మతిలఁజేసి - నేను నిన్నుసమాధానపఱచి - ఏఁగుదనకన్ - పోవుపర్యంతము - అనఁగా నేను నిన్ను సమ్మతిపఱచిపోవునంతదాక నన్ను నీవు వదలఁగూడదని భావము॥ ౧౩౮

వ॥ ఇంకనేమి యిటికంటె నింజెప్పక నేను వైదేశికుఁడ బంధుమిత్రకళత్రంబులం బాసి వయోగంబున నింత దూరంబేఁగుదెంచినవాఁడ మీఁకు భవదర్థంబు ప్రార్థితుండనై వ్రతహోమాద్యనుష్ఠానంబులు విడువంగల వాఁడ ననుటం జేసి యంతరంగంబు నంగల తెఱంగు తేటపడం బలుకవలసె నాకర్ణింపుము॥ ౧౩౯

టీక ॥ ఇంతయేమిటికంటేని చెప్పెదన్ - ఇంత చెప్పవలసిన దేమనియంటివా పదింపుము న్నాను - నేను వైదేశికుండన్ నేనుబరదేశిని - బంధుమిత్రకళత్రంబులన్ - బంధుచుట్టములను - మిత్ర - స్నేహితులను - కళత్రంబులన్ - భార్యను పాసి - విడిచిపెట్టి - దైవయోగంబునన్ - దైవసంకల్పముచేత - ఇంతదూరంబేసు దెంచినవాడన్ - ఇంతదవ్వువచ్చినవాఁడను - మీఁదన్ - ఇంకమీఁద - భవదర్థంబు - నీనిమిత్తము - ప్రార్థితుండనై - వేఁడఁబడినవాఁడనై - వ్రతహోమాద్యనుష్ఠానంబులు - వ్రతహోమాది ॥ నియమములు వ్రేలుములు మొదలైన - అనుష్ఠానంబులు - కర్మములను విడువంగలవాఁడన్ - విడిచిపెట్టఁగలవాఁడను - అనుటం జేసి - అయినందున - అంతరంగంబునం గల - మనస్సులోనున్న - తెఱంగు - విధము - తేటపడంబలుకవలసెన్ - తెల్లంబగునట్లుగాఁ జెప్పవలసివచ్చినది - ఆకర్ణింపుము - కాఁబట్టి వినుము॥ ౧౩౯

ఉ॥ నీచనుదోయి సంకుమదనిర్భరవాసన మేననూనన । యో హా చిరసౌఖ్యముల్ గనుటయో యొండెఁ దపంబొనరిం
చి పాపముల్ । రాచుటయో యొండెఁ గాకిహపరంబులకూరక దూరమై వయశ్శ్రీఁ జన రెంటికిం జెడిన రేవణనామనె
నీరజేక్షణా॥ ౧౪౦

టీక ॥ నీరజేక్షణా - తామరరేకులవంటి కన్నులుగల యో వరూథినీ ! నీచనుదోయి - నీ స్తనద్వయ సంబంధమైన - సంకుమద - జవ్వాదియొక్క - నిర్భరవాసన - అతిశయపరిమళము - మేననూనన్ - శరీరమందు వ్యాపించునట్టుగా - అహోహా - ఆహా - చిరసౌఖ్యముల్ గనుటయో యొండెన్ - తడవుకాలము సుఖభావములను బొందుటయైననొకటి - తపంబొనరించి - లేదా తపస్సు చేసి - పాపముల్ రాచుటయో యొండెన్ - కలుషములను బోఁగొట్టుకొనుటయైననొకటి - కాక - ఇంతియ కాక - ఇహపరంబులకున్ - ఐహికాముష్మికములకు - అనఁగా నిహలోకమునకును బరలోకమునకును - ఊరక దూరమై - నిష్కారణముగా దవ్వై - వయశ్శ్రీఁ జనన్ - ప్రాయముయొక్క సమృద్ధి వృథయయిపోనట్టుగా - రెంటికిం జెడి రేవణన్ - రెంటికిఁ జెడ్డ రేవణయనునట్టు - ఓమనె - అయిపోదునా - అనఁగా నాలాగునఁ గానుట॥ - లోకమందెవరైననొక కార్యమును గురించి రెండవ కార్యమును గూడఁ జెడఁగొట్టుకొన్నపత్తమందు రెంటికి జెడ్డ రేవణయనులోకసామెత గలదు అట్టిసామెతకుఁ బాత్రుఁడ నాయనిపలికెనని భావము॥ ౧౪౦

క॥ అనియాసగలుగఁ బలికిన - విని వేలుపు వెలఁది మోము వికసిల్లంగాఁ । దన చేతిచెఱఁగు బిగియం - బెనచు
చుఁ దలవాంచి నగవు బెరయఁగఁ బలికెన్॥ ౧౪౧

టీక ॥ అని - ఈ ప్రకారము ప్రవరాఖ్యునిమాటలు గాగంధర్వుఁడు - ఆసగలుగఁ బలికినన్ - ఆశ పుట్టునట్టుగాఁ జెప్పఁగా - విని - ఆకర్ణించి - వేలుపు వెలఁది - దేవతాస్త్రీయగు వరూథినీ - మోము వికసిల్లంగాన్ - ముఖము వికస్వరంబుగా - తన చేతిచెఱఁగు - తన చేతిలోనున్న కపటప్రవరాఖ్యుని దుప్పటికొంగు - బిగియం బెనచుచున్ - దృఢముగాఁ జేతికిఁ జుట్టుకొనుచును - తలవాంచి - శిరస్సువంచి - నగవు బెరయఁగఁ బలికెన్ - నవ్వుదొరయునట్టుగా నొక వాక్యము చెప్పెను॥

శా॥ ఆనిష్ఠురవృత్తి మాని కరుణాయత్తచిత్తంబునన్ । మానంజాలనటంచు నేఁడు శ్రవణానందంబుగాఁ
బల్కుటన్ । సూనాస్త్రున్ వెలఁబెట్టకేలితి సుఖార్ణోరాశిలోఁ గ్రుంకితిన్ । నా నోముల్ ఫలియించె నాకు
లము ధన్యంబయ్యె విప్రోత్తమా॥ ౧౪౨

టీక ॥ ఆ - కష్టము - నిష్ఠురవృత్తిమాని - నీయొక్క కఠినవ్యాపారమును విడిచిపెట్టి - కరుణాయత్తచిత్తంబునన్ - కరుణాయత్త - దయకు ముఖ్యాధీనమైన - చిత్తంబునన్ - మనస్సుచేత - మానంజాలనటంచున్ - విడువలేనని - నేఁడు శ్రవణానందంబుగాన్ - ఈదినము చెవుల పండువగునట్టుగా - పల్కుటన్ - చెప్పినందువలన - విప్రోత్తమా - బ్రాహ్మణశ్రేష్ఠుఁడా - సూనాస్త్రున్ - మన్మథుని - వెలఁబెట్టకేలితిన్ - జీతమివ్వకుండ నేలుకొంటిని - సుఖార్ణోరాశిలోన్ - సుఖమను సముద్రమందు - క్రుంకితిన్ - మునిఁగితిని - నా నోముల్ ఫలియించెన్ - నా వ్రతములన్నియుఁ బండినది - నాకులము ధన్యంబయ్యెన్ - నా వంశము సార్థకమాయెను॥ ౧౪౨

వ॥ నీవెట్లు చెప్పితట్లు సేయంగలదాననని యతని నొడంబఱచు సమయంబునం దోడినెచ్చెలులచ్చకోరాక్షిం
గూడుకొని॥

టీక ॥ నీవెట్లు చెప్పితి - నీవే ప్రకారము పలికితివో - అట్లు సేయంగలదాననని - ఆ ప్రకారమే చేయఁగలదాననని - అతనికిన్ - ఆకపట ప్రవరాఖ్యుని - ఒడంబడు సమయంబునన్ - ఒప్పించు సమయమందు - తోడినెచ్చెలులు - పరూథిని చెలికత్తెలు - అచ్చకోరాతిఁ గూడికొని - వెన్నెలపులుఁగులవంటి కన్నులుగల యావరూథినితోఁ గలుసుకొన్నవారై ॥

సీ ॥ అకట నిర్దయబుద్ధివని దూఱెఁగడు రంభ । యాహా వివేకివౌదనియె హరిణి । చేఁదు మ్రింగెదవంచుఁ జిలికి నవ్వె ఘృతాచి । మాయ కాఁడనిత్రిట్టె మంజుఘోష । న్యాయనిష్ఠురమాడి ప్రార్థించె నూర్వశి । జంకించె రమ్మంచుఁ జంద్రరేఖ । చెలినొంచితనె దిసంతులు గొట్టె మేనక । విడువు మీలయటంచు నాడె హేమ ॥ తే ॥ గొంటువనియెఁ దిలోత్తమ కూర్మిఁ గొసరె । ధాన్యమాలిని పుంజికస్థలయదల్చె । దివిజకామినులీరీతిఁ దిరుగువారి । సువ్వకరి గొంద్రు తమలోన నవ్వుకొనుచు ॥ ౧౪౪

టీక ॥ అకట - అయ్యయో - నిర్దయబుద్ధివని - దయారహితమైన మతిగలవాఁడవని - రంభ - రంభయనునప్సరస - కడు దూఱెన్ - మిక్కిలి దూషించెను - హరిణి - హరిణియనునది - ఆహా - భళా - వివేకవౌదనియెన్ - తెలివిగలవాఁడవేయనియెను - ఘృతాచి - ఘృతాచియనునది - చేఁదు మ్రింగెదవంచున్ - తిక్తపదార్థమును గబళింపుచున్నావు సుమా - అనఁగా దేవతా (స్త్రీ) సంభోగముకొఱగాదా యేమి యనియనుచు - చిలికి నవ్వెన్ - వ్యాపించిన గెను - మంజుఘోష - మంజుఘోషయనునది - మాయకాఁడనిత్రిట్టెన్ - మాయకాఁడేయితఁడని దూషించెను - ఊర్వశి - ఊర్వశియనునది - న్యాయనిష్ఠురమాడి - కొంత నీతిగాను గొంత కఠినముగాను మాటలు చెప్పి - ప్రార్థించెన్ - వేడుకొనెను. చంద్రరేఖ - చంద్రరేఖయనునది - రమ్మంచున్ - రారమ్మని జంకించెన్ - గద్దించెను - మేనక - మేనకయనునది - చెలినొంచితని - మాచిన్నదానిని బాధపెట్టిపోతివని - దిసంతులు గొట్టెన్ - నిందించెను - హేమ - హేమయను స్త్రీ - విడువుము వదిలిపెట్టుము - ఈలయటంచున్ - ఈవంచనలన్నియని నొడివెన్ - పలికెను - తిలోత్తమ - తిలోత్తమయనునది - గొంటువనియెన్ - ఆడుగాయ - అనఁగా మహాగడుసువాఁడవనెను - ధాన్యమాలిని - ధాన్యమాలినియనునది - కూర్మిఁ గొసరెన్ - స్నేహమున దుగుకొనెను - పుంజికస్థల - పుంజికస్థలయనునది - అదల్చెన్ - భయముఁ జూపెను - దివిజకామినులు - దేవతాస్త్రీలందఱు - ఈరీతిఁ దిరుగువారి - ఈ ప్రకారముగాఁ జుట్టుకొని - సువ్వకరి గొంద్రు - గుంపుగూడుచును - తమలోన నవ్వుకొనుచున్ - తమలోఁదాము హాసించుకొనుచును ॥ పైనఁ జెప్పిన ప్రకారము జరిగించిరని సంబంధము ॥ యీపద్యము నాలుగోచరణమందు దిసంతులు గొట్టెనన్నచోట నిందించెననుటకు నాంధ్రభాషార్ణవము మొదటి కాండలో వాగ్వర్గమునందు - ఆఱడియపనిడియగడాఱు దూఱుదూఱు దిసంతు సడి కోయిరోఁతరొచ్చు - సేగింపు సెగ్గము సెగ్గవగింపు నాయపవాదసంజ్ఞనానలరుచుండు ॥ ౧౪౪

క ॥ ఆసుహనాభూసురుఁ డపు । డాకాంతల సరససమ్మదాలాపములం । గైకొనుచు ముదితహృదయుం । డై కేళీవనము వెడలి యరిగెను అఁగటన్ ॥ ౧౪౫

టీక ॥ ఆసుహనాభూసురుఁడు - ఆకృత్రిమపు బ్రాహ్మణుఁడు అపుడు - ఆసమయమందు - ఆకాంతల - ఆరంభ మొదలైన స్త్రీలయొక్క - సరస - శృంగారరసముతోఁ గూడిన - సమ్మదాలాపములన్ - సంతోషవాక్యములను - కైకొనుచున్ - అంగీకరించుచును - ముదిత - సంతోషించిన - హృదయుండై - మనస్సుగలవాఁడై - కేళీవనము వెడలి - ఉద్యానవనము బయలు వెడలి - అరిగి - పోయి - కుటఁగటన్ - సమీపమునందు ॥ ౧౪౬

సీ ॥ మృగనాభినికరంబు భుగభుగల్ గలచోటఁ । జదలేఱు తుంపురుల్ చల్లుచోట । వకుళవాటీగంధవహుఁడు పైకొనుచోటఁ । గర్పూరతరుధూళి గప్పుచోటఁ । బసమీఱు సెలయేఱులి సుకవేట్టెడుచోటఁ । జిగురుల విడి సంజనిగుడుచోట । నవమాలికల తేనె నట్టట్టు పడుచోట । మాణిక్యదీపముల్ మండుచోటఁ ॥ తే ॥ గ్రొవ్వఁద మునఁదేఁటులెలుఁగెత్తి పాడుచోట । శారికల నంగశాస్త్రముల్ చదువుచోటఁ । గీరకలకంఠములు క్రొవ్వి కెరలుచోటఁ । బావురములారజంబులు వలుకుచోట ॥ ౧౪౭

టీక ॥ మృగనాభి - కస్తూరియొక్క - నికరంబు సారముయొక్క - భుగభుగల్ గలచోటన్ - భుగభుగయను వాసనలు గలిగిన

టీక ॥ సహసానఖంపచస్తనదత్తపరిరంభము - సహసా - శీఘ్రమైనట్టుగా - నఖంపచ - గోరువెచ్చగానున్న - స్తన - కుచములచేత - దత్త - ఇవ్వఁబడిన - పరిరంభము - కౌఁగలింతగలిగినదియు - ఆమూలపరిచుంబితాధరోష్ఠము - ఆమూల - మొదలంటునట్టుగా - పరిచుంబిత - లెస్సగాఁ బీల్చఁబడిన - అధరోష్ఠము - మోవిగలిగినదియు - అతిశయప్రేమకల్పితదంతసంబాధము - అతిశయప్రేమ - అత్యంతస్నేహముచేత - కల్పిత - పుట్టింపఁబడిన - దంతసంబాధము - పలునొక్కులుగలిగినదియు - అగణితగ్లానిశయ్యానిపాతము - అగణితగ్లాని - ఎన్నశక్యముగానిగాసిచేత - శయ్యానిపాతము - పాన్పునం బడుటగలిగినదియు - అనువేలమణితయాచ్ఞార్థగల్లచపేట - అనువేలమణిత - అతిశయమైనగళరవముయొక్క - అనఁగా రతికాలమందుఁ గంఠములోఁ బలికెడుగుబగుబధ్వనియొక్క - యాచ్ఞార్థ - వేఁడుకొనుటకొఱకైన - గల్లచపేటము - చెక్కిలిగొట్టుటగలిగినదియు - అతిదీనవాక్సూచితాత్మవిరహము - అతిదీనవాక్ - మిక్కిలిదీనభావముతోఁగూడినమాటలచేత - సూచిత - కనుపఱచఁబడిన - ఆత్మవిరహము - తనయొక్కవియోగముగలిగినదియు - అంకురత్పులకజాలాక్లిష్టసర్వాంగము - అంకురత్ - మొలకలెత్తుచున్న - పులకజాల - గగుర్పాటుచేత - ఆక్లిష్ట - అంతటవ్యాపింపఁబడిన - సర్వాంగము - సకలావయవములుగలిగినదియు - ఆనందకృతహారవాననాబ్జము - ఆనందకృత - సంతోషముచేతఁ జేయఁబడిన - హారవ - హాయనుధ్వనితోఁగూడిన - ఆననాబ్జము - ముఖముగలిగినదియు - అక్రమక్షీణసతివర్ణము - అక్రమక్షీణ - అంతకంతకుఁ దగ్గిపోవుచున్న - సతివర్ణము - మెప్పుమాటలయొక్క యక్షరముగలిగినదియు - అనిమీలితాక్షము - గట్టిగా మూయఁబడినకన్నులుగలిగినదియు - అశ్విన్నగండము - అంతటఁ జెమర్చినచెక్కిళ్లుగలిగినదియు - ఆయత్తచేష్టము - స్వాధీనమైనక్రియలుగలిగినదియు - అస్తిమితభూషణారవము - అస్తిమిత - శాంతిఁ బొందిన - భూషణారవము - ఆభరణముల యొక్కధ్వని గలిగినదియు నైన - ఆవధూటి - ఆవరూథినియొక్క - ప్రథమసురతంబు - తొలుసారిసంభోగము - గాంధర్వపతికి - గంధర్వరాజును - కరంచెక్ - సంతోషపెట్టెను॥ ౧౫౨

క ॥ అన్ననఁగనుమూయుటరోద। సన్నగిలుటకౌఁగిలింతసడలుట నేర్పుల్। సన్నగుటవరూథినిరతి। క
న్నెఱికపురతియుంబోలెఁగడునింపెసఁగెన్॥ ౧౫౩

టీక ॥ అన్నన్ - రతిసమయమందు - కనుమూయుట - నేత్రనిమీలనముచేతను - రోదసన్నగిలుట - గళరవముమందమగుటచేతను - కౌఁగిలింతసడలుట - ఆలింగనమువదిలిపోవుచునుండుటచేతను - నేర్పుల్ సన్నగుట - రతి మెలకువలు లేకపోవుటచేతను - వరూథినిరతి - వరూథినియొక్క సంభోగము - కన్నెఱికపురతియుఁబోలెన్ - కన్నెపడుచుయొక్క సంభోగమువలెనే - కడునింపెసఁగెన్ - మిక్కిలియిష్టమునుబొందించెను - అనఁగా వరూథిని ప్రౌఢయయినప్పటికిని కన్నులుమూసుకొని పురుషునియొక్క విలాసమును జూడకుండుటచేతఁ బ్రౌఢయైనను బాలవలె కన్నెపడుచువలెనే యుండెనని భావము॥ ౧౫౫

క॥ ఈవిధమునయయ్యైసుపురుఁ। భావజతంత్రైకపరతబహుకాలముసౌ।ఖ్యావహలీలలనుండఁ।గా వేలుపుముద్ద
రాలుగర్భముఁదాల్చెన్॥ ౧౫౪

టీక ॥ ఈవిధమునన్ - ఈప్రకారముగా - అయ్యైసుపురు - ఆగంధర్వకుమారుఁడును వరూథినియును - భావజతంత్రైకపరతన్ - భావజతంత్ర - మన్మథక్రీడలయందలి - ఏకపరతన్ - ముఖ్యాసక్తిచేత - బహుకాలము - పెక్కుదినములు - సౌఖ్యావహలీలలనుండఁగాన్ - సౌఖ్యావహ - సుఖభావమునుగలుగఁ జేసెడు లీలలనుండఁగాన్ - విలాసములచేతనుండఁగా - వేలుపుముద్దరాలు - దేవతాస్త్రీయయినవరూథిని గర్భముదాల్చెన్ - వేకటియాయెను - అనఁగా గర్భిణియాయెననుట॥ ౧౫౪

క ॥ నడజడనుపడియెవారే। ర్పడియెంజనుమొనలునలవడియెన్నడియం। బడియెఁగడునొడలుపడఁతికి। బడలిక
యునుదరయరుచిబహుళంబయ్యెన్॥ ౧౫౫

టీక ॥ పడఁతికిన్ - వరూథినికి - నడజడనుపడియెన్ - గమనము మందమాయెను - ఆరేర్పడియెన్ - నూగారుస్ఫుటముగాఁ గనుపించెను - చనుమొనలు అన్నల్లవడియెన్ - కుచాగ్రములు నల్లగానుండెను - ఒడలు - దేహము కడున్ - మిక్కిలి - వడి

టీ॥ మనసుకకుఁజితిన్ - మానసముయొక్క కకూజితిచేత - మెల్లన - తిన్నగా లేచి - పయికి లేచి - చేతులన్ - హస్తములచేత - కాంతున్ - పతిని - జబ్బుగాన్, అశ్రద్ధగా - కౌఁగిలించున్ - ఆలింగనము చేసుకొనును - అలసతన్ శ్రమచేత - మృద్వంగియైన - మట్టివాసనగల - కమ్మని నోరన్ - కమ్మనైన వాయిచేత - అధరంబున్ - పెదవిని - పడనేడన్ - అంతటంతట - ఆని - పానము చేసి - కూర్కన్ - నిద్రపోవును - మణితాదిపవనధారణశక్తి - మణితాది - రతికూజితము మొదలగు - పవన - వాయువుయొక్క - ధారణ - ధరించుటయందు - శక్తిచాలమిన్ - బలము లేనందున - ఒయ్యనన్ - తిన్నగా - నర్మోక్తిన్ - నర్మగర్భితమైన మాటలచేత - ఉబ్బొనర్చున్ - సంతోషము నుగలుగఁజేయును - కాంక్షితక్రీడను - కాంక్షిత - కోరఁబడిన - క్రీడను - లీలను - అంగము - శరీరము - పంపుసేయమిన్ - పంపకుండుటచేత - ఒడ్డుగాన్ - లెస్సగా - నిట్టూర్పులు - నిశ్వాసవాయువులు - ఇలయన్ - వ్యాపించునట్టుగా - పొగులున్ - దుఃఖపడును - ఇచ్చరయెఱిఁగిన - మనస్సు తెలిసిన - రతికేళిన్ - సురతక్రీడను - మెచ్చి పొగడున్ - సంతోషించి శ్లాఘించును - అప్పుడున్ - ఆసమయమందు - అక్కాంత - ఆవరూథిని - రతిపరిహాసవేళన్ - రతి - సురతము యొక్క - పరిహాస - ఎక్కసక్కెయమాడు - వేళన్ - సమయమునందు - ప్రార్థనాపూర్వదీనసంభాషణములన్ - ప్రార్థనాపూర్వ - వేఁడుకొనుటమున్నుగాఁగల - దీన - దైన్యముతోఁగూడుకొనిన - సంభాషణములన్ - మాటలచేత జీవితేశునమేళంపు - జీవితేశు - ప్రాణనాయకునియొక్క - నమేళంపు - పరిహాసముతోఁగూడుకొనిన - సేఁతలు - పనులు - ఉడుపున్ మాన్పించును॥

క॥ అంతవియచ్చరుఁడభిమత । మంతయుసమకూరుటయునునచ్చరగర్భ । శ్రాంతయగుటయునుగనుఁగొ

ని । యింతటనిచ్చోటువాయ కేనిఁక నున్నన్॥ ౧౫౮

టీ॥ అంతన్ - అటుతర్వాత - వియచ్చరుఁడు - గంధర్వుఁడు - అభిమతమంతయున్ - తనయభిలాషయావత్తును - సమకూరుటయున్ - సఫలమగుటను - అచ్చర - వరూథిని - గర్వశ్రాంతయగుటయున్ - వేఁకటివలననైనయాయాసముగలదగుటయును - కనుఁగొని - చూచి - ఇంతటన్ - ఇంతమాత్రముతో - ఇచ్చోటు వాయక - ఈస్థలమువిడిచిపెట్టకుండ - పని కనున్నన్ - నేనిఁకమీఁదనున్నపక్షమందు । ఇదిముందరికన్వయము॥ ౧౫౯

క॥ వంచనయెఱిఁగినమఱిశపి । యించునొసురకాంత చెప్ప కేగినఁబ్రేమం । బంచశరశరపరంపరఁ । బాచక్రఁ

బ్రాపించితనకుఁబాపంబిడునో॥ ౧౬౦

టీ॥ వంచనయెఱిఁగినన్ - నేను జేసినకపటము తెలిసినటులైన - సురకాంత - వరూధిని - మఱిశపియించునో - గర్వాతశాపమే పెట్టునో - చెప్ప కేగినన్ - చెప్పకుండఁబోతి నేని - ప్రేమన్ - స్నేహమువలన - పంచశర - మన్మథునియొక్క - శరపరంపరన్ - బాణసమూహములచేత - సంతాపఁబ్రాపించి - మృతిపొంది - తనకుఁబాపంబిడునో - తనకుఁగిల్బిషమే పెట్టునో॥ ఇదియునుముందరికేయన్వయము॥ ౧౬౦

వ॥ అని వితర్కించియెఱింగించియకపటవిప్రుండనిపించుకొనిపోవువాఁడై యప్పుడప్పువ్వుబోఁడిడాయం

జని బుజ్జనంబొప్పఁ నిట్లనియె॥

టీ॥ అనివితర్కించి - ఈలాగనియూహించుకొని - ఎఱింగించి - తెలియఁజేసి - అకపటవిప్రుండు - ఆకృత్రిమపు బ్రాహ్మణుఁడు - అనఁగాఁ బవరాఖ్యరూపముధరించినగంధర్వుఁడు - అనిపించుకొనిపోవువాఁడై - మాపించుకొనిపోఁదలఁచినవాఁడై - అప్పుడు - ఆసమయమందు - అప్పువ్వుబోఁడిన్ - ఆవరూథినిని - డాయంజని - చేరఁబోయి - బుజ్జనంబొపన్ - బుజ్జగింపుకనుపడునట్టుగా - ఇట్లనియెన్ - ఈ తీరునఁబలికెను॥

తే॥ ఎవ్వఁడే పాదలేపమొకింతనాదు । పాదములఁ బూయనింతేసి ననుబుపుట్టె । నమ్మహాయోగిబహుయోజనాధ్వగామి । యాగిరికి నేగుదెంచె నేఁడేగికంటి॥ ౧౬౧

క॥ తడిగట నెవ్వరుఁ దడఁ బాఱకఁ। గడిఁదనగి నవడియఁ గవగి గాసింబుడమిం। బడిఁ గన రాకపంచపు। తొడుగవైఁ గట్టిరుజలతో నేమందున్॥ ౧౬

టీక॥ తడి - ద్రవము - కంటన్ - నేత్రములయందు - ఎప్పుడుఁ దఱుగక - సర్వదాతప్పక గాక - అనఁగాదుఃఖపడుచు - కడివగిటన్ - అన్నకబళముతక్కువయగుచునుండ వడియఁ గవగి - బలమంతక్కువయై - గాసిన్ - ఆయాసముచేత - పుడమింబడిన కనరాక - నేలబడినప్పటికినిగానరాక - అనఁగాఁగృశీభూతులై - అట్టిరుజలతోన్ - అటువంటి వ్యాధులతోడ - పంచముతోడుగరనైరి - పంచమునకంటుకొనిపోయిరి. ఏమందున్ - ఏమనిచెప్పుదును॥ ౧౬

క॥ కావున వారలఁ జూడం। గా వేగపడఁ గవలయుఁ గమలదళాక్షీ। నీవెఱుఁగని ధర్మాధ। ర్మావస్థితిగల దే నీనికిఁ గైయవలసమా॥ ౧౭

టీక॥ కావునన్ - కాబట్టి - వారలఁ జూడంగాన్ - వారిని జూచుటకు - వేగపడఁగవలయున్ - శీఘ్రముగాఁ బోవలయును - కమలదళాక్షీ - ఓవరూథిని - నీవెఱుఁగని - నీకు దెలియని - ధర్మాధర్మావస్థితి - న్యాయాన్యాయములయొక్కమర్యాద - కలదె - ఉన్నదా - అనఁగా లేదనుట - దీనికై - ఇందునిమిత్తమై - అడలకు నీ మనఃఖపడఁబోకుమా॥

శ॥ వడిఁగాఁచి కాఁచియుండం। గడవలనీరినుము ద్రావుకై వడిఁ బైపైఁ। బొడమెడుకోర్కులఁ జేఁబె। ల్లుడికిన చిత్తిభోగ ముక్తికూఱటఁ గను నే॥ ౧౮

టీక॥ వడిన్ - వేగముగా - కాఁచి కాఁచియుండన్ - కాఁకవేయుచు వేయుచునుండఁగా - కడవలనీరు - ఘటములకొలఁదియు నీరుమును - ఇనుము ద్రావుకై వడిన్ - అయస్సుగ్రహించినట్టుగా - పైపైఁబొడమెడు - మీఁదమీఁదనుత్పత్తియగుచునుండు - కోర్కులచేన్ - కాంక్షలచేత - పెల్లుడికినమతి - అతిశయముగాఁ బచనమైయుండుమనస్సు - భోగముక్తిన్ - సుఖానుభవముయొక్కవిడుదలకు - ఊఱటఁ గను నే - విశ్రాంతిగలదా - అనఁగాఁ బొందఁజాలదనుట॥

ఉ॥ కావున నెన్నఁడుం దెగదు కాంతుని పంబొకఁ డెన్నఁ రోసి నేఁ। బోవఁదలంతు నేని వలపుం జనవుం బ్రియంబులు। నీవలనన్ సమగ్రములునిల్చిన సంపఁగి పువ్వుఁ దేనెఁ గ్రొ। త్తావికిఁ దేఁటి దిక్కునవిధంబునఁ జిక్కునె లోలలోచనా॥ ౧౯

టీక॥ కావునన్ - గనుక - ఎన్నఁడుం దెగదు కాంతుఁడు - కోతిక యెన్నటికినీ వదలిపోదు - నెపంబొకఁ డెన్ని - ఏదైననొకనిమిత్తమెంచి - రోసి - అందుమీఁదనసహ్యపడి - నేఁబోవఁదలంతు నేని - నేనుబోవుదమని విచారించిన - వలపున్ * మోహమును - చనవున్ - స్నేహమును - తగవున్ - న్యాయమును - ప్రియంబులున్ - ఇష్టములును - నీవలనన్ సమగ్రములు - నీవలన సంపూర్ణములు - అనఁగా వీనిలో నొకటైనఁ దక్కువలేదనుట - నిల్చినన్ - ఇట్లు విచారించియుకూడనేయున్నపక్షమందు - సంపంగిపువ్వుఁ దేనె - చంపకపుష్పమధువుయొక్క - క్రొత్తావికిన్ - శ్రేష్ఠమైనవాసనకు * తేఁటి దిక్కునవిధంబునన్ - తుమ్మెద తగులుకొన్నట్టుగా - చిక్కునె - తగులుకొననా - లోలలోచనా - ఓవరూథిని - అనఁగా సంపంగిపువ్వుఁ దేనె వాసనకు భ్రమపడి తుమ్మెదవోయి దిక్కువడి చెడిపోయినట్టుగా నే చెడిపోదునని తాత్పర్యము - సంపంగికి నిదుమ్మెదరును సరిపడదని ప్రసిద్ధము॥ ౧౯

ఉ॥ ఎవ్వఁడు మీఁదెఱుంగక యథేచ్ఛ సుఖైకరతిం జరింపఁగా। నవ్వలవంశహాని వ్రతహానియశోధనహానులు పుట్టుఁ దా। నవ్వెడఁగమ్మనుష్యపశువయ్యవివేకి చెడున్ జగంబునన్। నవ్వఁగఁ బాలు రౌరవమునం బడఁ బాలు నొండపాలునై॥ ౨౦

టీక॥ ఎవ్వఁడు - ఏపురుషుడైననేమి - మీఁదెఱుంగక - ఉత్తరవిచారము లేక - యథేచ్ఛన్ - తనయిచ్ఛవచ్చినటుగా - సుఖైకరతిన్ - సుఖమందలిముఖ్యాసక్తిచేత - చరింపఁగాన్ - ప్రవర్తింపఁగా - అవ్వలన్ - అటుపిమ్మట - వంశహాని - కులము చెడిపోవుటయును - వ్రతహాని - నియమము చెడిపోవుటయును - యశోధనహాని - కీర్తియును ద్రవ్యము చెడిపోవుటయును - పుట్టున్ - సంభవించును - తానవ్వెడఁగు అట్టియున్మత్తుఁడైన - అమ్మనుష్యపశువు - మనుజరూపముగలపశువనఁదగు - ఆయవివేకి - అవివేకశాలియైనవాఁడు - జగంబునన్ - లోకములో - నవ్వఁగఁబాలు - నగుబాట్లపాలును - రౌరవమునం బడఁబాలును - నరకములోఁ బడఁబాలును - నిందపాలునై - అపకీర్తిపాలునునయి - చెడున్ - భ్రష్టుడైపోవును - అనఁగా వీనికాస్పదమగునని యనుట॥

థంబు దెగినఁ! బ్రాణపదమైనవలపును బాసిపోదె॥ ౧౭౫

టీక ॥ అని - ఇట్లు పలికి - వరూథినీనూర్ఛి - వరూథినీనూరడించి | అచటు వాసి - ఆ స్థలము విడిచి పెట్టి - గంధర్వపుంగవుండు - గంధర్వశ్రేష్ఠుఁడు - పోయెఁదనయిచ్ఛన్ - తన యిచ్ఛాప్రకారముగాఁ జనియెను - ఋణానుబంధము దెగినన్ - పూర్వజన్మ సంబంధమయిన యప్పుతీరిపోయినేని - ప్రాణపదమైన - జీవిత సమానమైన - వలపున్ - మోహమును పాసిచనదె - వదలి - పోదా యనఁగాఁ - భోవున నయ్యర్థమూ తప్పరాదు - అన్యథా కాదు - అనఁగా నిది తప్ప నేందనుట॥

వ ॥ అనుటయుం దరవాతివృత్తాంతంబు కృపాయత్తచిత్తంబున నానతీవలయు ననిన యడుగుటయును॥

టీక ॥ అనుటయున్ - అనిపలుకుటయు - అని పలుకఁగా - తరవాతి వృత్తాంతంబు - అవతలి సమాచారమును - కృపాయత్త - దయకధీనమైన - చిత్తంబునన్ - మనస్సుచేత - ఆనతీవలయునని - వినుపించవలెనని - అడుగుటయున్ - అడుగఁగా॥

శా ॥ హిందూరాజ్యరమాధురంధరభుజాహిగ్రామణీకంచుక ! కుందస్వచ్ఛయశోగుళుచ్ఛ యవనక్షోణీధవస్థాపనా ! మందీభూతకృపాకటాక్షయసకృన్మాద్యత్కళింగాంగనాబందిగ్రాహవిగాహితోత్తరకకుద్ఘాటీసమాటీకనా॥ ౧౭౬

టీక ॥ హిందూ...గుళుచ్ఛ - హిందూరాజ్యరమా - హిందూరాజ్యలక్ష్మికి - ధురంధర - భారవాహియైన - అనఁగా గట్టాటరాజ్యలక్ష్మి నిబూనిన - భుజ - బాహువనెడు - అహిగ్రామణీ - సర్పశ్రేష్ఠునికి - అనఁగా శేషాహికి - కంచుకత్ - కుబుసమువలెనాచరించుచున్న - కుందస్వచ్ఛ మొల్లపువ్వులవలెఁ దెల్లనైన - యశోగుళుచ్ఛ - కీర్తిసంజరిగలవాఁడా - యవ...టాక్ష - యవనక్షోణీధవ - యవనభూపతియొక్క - స్థాపన - ప్రతిష్ఠచేయుటయందు | అమందీభూత | అతిశమైన - కృపాకటాక్ష - దయాసహితమైనయపాంగదర్శనముగలవాఁడా - అసకృ...కనా - అసకృత్ - మాటిమాటికి - మాద్యత్ - మదించిన - కళింగ - కళింగరాజుయొక్క - అంగనా - స్త్రీయొక్క - బందిగ్రాహ - చెరపెట్టుటకొఱకు - విగాహిత - ప్రవేశించుచున్న - ఉత్తరకకుప్ - ఉత్తరదిక్కునందు - ఘాటీ - దాడిపెట్టుటయొక్క - సమాటీకనా - ఆటోపముగలవాఁడా॥ ఇవి కృతీశ్వరుఁడైన కృష్ణరాయలసంబోధనములు॥ ౧౭౬

క॥ తిరుమలదేవీచరణో దరలాక్షాకల్పకల్పితస్థలకమల ! స్ఫురదిందీవరబంధుర ! హరిహయమణివలయ కూటహర్మ్యవిహారీ॥ ౧౭౭

టీక ॥ తిరుమల...విహారీ - తిరుమలదేవీ | తిరుమలదేవియను భార్యయొక్క | చరణోదర | అడుగులయందలి | లాక్షాకల్ప | అలంకారభూతమైన లత్తుకచేత | కల్పిత | రచింపఁబడిన | స్థలకమల | మెట్టదామరపువ్వులనడుమను | స్ఫురత్ | ప్రకాశించెడు | ఇందీవర | నల్లగలువలవలెనే | బంధుర | సుందరమైన | హరిహయమణి | ఇంద్రనీలవికారములైన | వలయచుట్టుకలిగిన | కూటహర్మ్య | లక్ష్మీవిలాసమందలి | విహారి - విలాససంచారముగలవాఁడా ॥ అనఁగాఁ దిరుమలదేవి సంచరించునట్టి యింద్రనీలములు చెక్కిన వలయాకారకుట్టిమము గల లక్ష్మీవిలాసమే తీరున నున్నదనఁగా మెట్టదామరపువ్వులును నల్లగలువలును గలసియున్న స్థలమువలెనే యున్నదని భావము॥ ౧౭౭

ఉత్సాహ ॥ వర్ణనీయకీర్తివైభవప్రభూతభూతిదృక్కర్ణకుండలావితీర్ణకర్ణదీర్ణహృద్ధ్వయహ దుర్ణయారిమానహారిదుర్భరానకార్భటీ ఘూర్ణమానకొండపల్లికొండవీటిమండలా॥ ౧౭౮

టీ॥ వర్ణ...భవ - వర్ణనీయ | స్తోత్రము చేయఁదగిన | కీర్తివైభవ | యశస్సంపత్తిగలవాఁడా - ప్రభూ...డలా - ప్రభూత - ప్రచురమయిన | భూతి | ఐశ్వర్యమందు | దృక్కర్ణ | చక్షుఃశ్రవములైన సర్పము లే | కుండలా | కర్ణాభరణములుగాఁగల శివుఁడవైన వాఁడా - వితీర్ణకర్ణ - వితీర్ణ - దాతృత్వమందు | కర్ణ | కర్ణుఁడవైనవాఁడా - దీర్ణ...డలా - దీర్ణహృద్ధ్వయమత్ | పగిలిన గుండెలచేత దిరుగుచున్న | దుర్ణయారి | దుర్నీతిపరులైన శత్రువులయొక్క | మానహారి | అహంకారమును హరించుచున్న | దుర్భర | భరింపశక్యముగాని | ఆనకార్భటీ | భేరీ ఢాంకారముచేత | ఘూర్ణమాన | తిరుగుడుపడి క్రిందుమీఁదగుచున్న | కొండపల్లి | కొండపల్లియనునట్టి - కొండవీటి | కొండవీడను దుర్గముల క్రిందనుండు | మండలా | దేశముగలవాఁడా॥ ౧౭౮

గద్య ॥ ఇది శ్రీమదాంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిర నందవరవంశోత్తంస శఠగోపతాపస ప్రసాదాసాదిత కవితామతల్లికా ల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము - ప్రథమాశ్వాసాంతగద్యమునకుఁ జేసినప్రకారమే దీనికిని టీక విచారించఁదగ్గది - మూఁడవయాశ్వాసము టీకతోఁ గూడ ముగిసినది॥ ౯౨



# స్వారోచిషమనుచరిత్రము.



## నాలుగవయాశ్వాసము.

క ॥ శ్రీకృష్ణరాయ గుణర । త్నాకల్పాకల్పకద్రుమాధికదాన । శ్రీకుతుకాగతలోకా । లోకాంతరసకల సుకవిలోకస్తుత్యా॥ ౧

టీక ॥ శ్రీకృష్ణరాయ- శ్రీ- శోభాయుక్తుఁడవైన- కృష్ణరాయ। కృష్ణరాయనామముగలవాఁడా - గుణరత్నాకల్పా- గుణ- సుగుణములనునట్టి- రత్నాకల్ప।మణిభూషణాలంకారముగలవాఁడా- కల్పక...స్తుత్యా-కల్పకద్రుమ।కల్పవృక్షము కంటె । అధిక। ఎక్కుడైన। దానశ్రీ । త్యాగసమృద్ధియందలి। కుతుక। సంతోషముచేత। ఆగత। వచ్చిన । లోకాలోకాంతర। చక్రవాళపర్వతములోనుండెడు । సకల। సమస్తమైన। సుకవిలోక।మంచికవిజనులచేత।స్తుత్యా।స్తోత్రము చేయఁదగినవాఁడా - అని కృతిపతిని సంబోధించుట॥ చక్రవాళపర్వతమనఁగా భూమికిఁ జుట్టును గట్టవలెనుండు పర్వతమని తెలియవలెను॥

వ ॥ అవధరింపుము జైమినిమునీంద్రునకుం బతంగపుంగవంబు లిట్లనియె॥

టీక ॥ అవధరింపుము- చిత్తగింపుము - జైమినిమునీంద్రునకున్ - జైమినియను ఋషిశ్రేష్ఠునికి। పతంగపుంగవంబులు। కథ చెప్పుచున్న పక్షిశ్రేష్ఠములు । ఇట్లనియెన్ । ఈరీతిగనఁ జెప్పెను॥

సీ ॥ మున్ను విప్రాకారమునఁ గూడుచోఁ శంకఁ । గనుమూయఁబనిచె నాఖచరభర్త। యవ్వరారోహయు నాసక్తగావున- నిచ్చలోనటు సేయ నియ్యకొనియె । నాప్రతిజ్ఞాపూర్తి యయ్యెఁ దనంతన- వ్వనితకురతిపారవశ్యఘటన । నపుడు తత్ప్రవరదేహసమిద్ధశిఖిదీప్తి - శాంబరీమహిమ చేసంగ్రహించి ॥ తే ॥ నట్టిగంధర్వమూర్తి సౌఖ్యానుభూతిఁ । జలనమేదినమానసాబ్జమున నిలువ। వెలసెఁ దేజోమయంబైన వృద్ధినట్టి- మేటిగర్భంబు నెలలు తొమ్మిదియు నిండె॥ ౩

టీక ॥ మున్ను - మొదట-విప్రాకారంబునన్- బ్రాహ్మణరూపముచేత - కూడుచోన్ - ఆ స్త్రీని బొందునప్పుడు - శంకన్-నిజరూపప్రకటమగునను సందేహముచేత- ఖచరభర్త- ఆగంధర్వశ్రేష్ఠుఁడు - కనుమూయఁబనిచెన్ - కండ్లుమూసుకొనుటకు నియమించెను- అవ్వరారోహయున్-ఆవరూథినియును - ఆసక్తగావునన్- తన్నుఁ గురాగయైయున్నదిగనుక- ఇచ్చలోన్-ఆత్మయందు-అటు సేయన్-ఆప్రకారము చేయుటకు- ఇయ్యకొనియెన్- సమ్మతించెను- అవ్వనితకున్ ఆవరూథినికి - రతిపారవశ్యఘటనన్ - సంభోగమందలిపరవశత్వసామర్థ్యముచేత - ఆప్రతిజ్ఞాపూర్తి - ఆకనుమూయవలసిననిబంధనముయొక్క నెఱయిక-తనంతన - తనంతట దానే- అయ్యెన్- ఆయెను- అనఁగా సంభోగసుఖముచేత నే కన్నులుమూయఁబడెనని భావము- అప్పుడున్- ఆసమయమందు- తత్ప్రవరదేహసమిద్ధశిఖిదీప్తిన్- తత్ప్రవరదేహ।ఆప్రవరాఖ్యునిశరీరమందు।సమిద్ధ। మిక్కిలి ప్రకాశించుచున్న।శిఖిదీప్తిన్-అగ్నితేజస్సును -శాంబరీమహిమచేన్

న్నియు సెలవి - ముట్టెతోఁ దెగనడిచి వేఁపరలాడుచున్ - ఎరగొని తిరుగును సటలుబ్బన్ మెడలమీఁది వెండ్రుకలు నిక్కఁగా దంష్ట్రాగ్ని - కోరలవలనఁ బుట్టు నిప్పు - చౌంగపైఁ బడి మూతిచొల్లుపై నిబడి - చుంయి చుంయి మనఁగన్ - చుంయి చుంయి యనుచుండఁగా - వెన్న - చరమాంగము చప్పరించుచున్ - చదియఁబడునట్టుగనములును - చండ్రనిప్పులు వోలెన్ ఖాదిరాగ్నులవలె తీండ్రించు - ప్రజ్వరిల్లుచుండునట్టి - కనుమించులు - చూపుల యొక్క మెరుపులు - ఎసఁగన్ - ఒప్పునట్టుగా - ఒంటోఁటిపైన్ - ఒక దానిపై నొకటి - ఎక్కఁబాఱుచున్ - ఎక్కఁబోవుచు - వెట్టదినములన్ వేసవిదినములలో - మడుగులన్ - హ్రదములయందు - మట్టికలపన్ - తొక్కుచున్నకలిపిన బుడబుడ యనుధ్వానముచేత వెడలు - పైకితేలుచున్న - బుద్బుదములందున్ - నీటిబుగ్గలయందు - చిలుపచిలుపని నెతులు కొద్దిపాటి సామ్రాజ్యము యొక్క - జిడ్డు దేలున్ - మెఱుగుపైకిఁ దేలును - ఏమిచెప్పుదున్ - కాఁబట్టి యేమివచింపుదును - అనఁగాఁ జెప్ప శక్యము గాదనుట॥ ౧౬

చ॥ బలమిక నేమి చెప్పవినుపండు వెదుళ్ళవలీల మోరత్రో । పులఁబడఁ జొప్పవంచుకొను పోలికవంచిత దగ్ర
ధాన్యముల్ । సెలవుల ఫేనముట్టిపడ జిట్టలతోడ నెచప్పరించున । ప్పొలమున వరాహపోతములు భూవర తొం
డములేనియేనుఁగుల్॥ ౧౭

టీక॥ భూవర - ఓరాజా - విను - ఆకర్ణింపుము - అప్పొలమున వరాహపోతములు - ఆస్థలమందున్న యడవిపందిగున్నలు తొండము లేనియేనుఁగులు తుండాదండము మాత్రమే లేని గజములు - బలమిక నేమిచెప్పన్ - వానిసత్వమిక నేమివచింపవలసినది - పండువెదుళ్లు - పరిపక్వమైన వంశములు - అవలీలన్ - అనాయాసముగా - మోరత్రోపులబడన్ - ముట్టెత్రోపులచేఁ బతనముగునట్టుగా । చొప్పవంచుకొనుపోలికన్ చొప్పవంచుకొన్నట్టుగా వంచి - వగఁ దీసి - తదగ్రధాన్యములు - వానికొనలయందుండు వెదురుకొలుచులను - సెలవులన్ - ఓష్ఠప్రాంతములయందు ఫేనముట్టిపడన్ - నురుగుబయలు వెడలఁగా జిట్టలతోడనె వెన్నులతోఁగూడనే - చప్పరించున్ చదియునట్టు నములును - చొప్ప యనఁగా జొన్నమొదలైన వానిదండము, ౧౭

క॥ పొడిచినకైదువ కుంజము । రిడఁగావల దగ్గికాఁక నించుకయుడినం । జెడుఁగట్టులఁ గ్రుచ్చినవం । జుడుమంటల
దగిలి నెయ్యిజోటజోటవడియున్॥ ౧౮

టీక॥ పొడిచినకైదువన్ - పందినిఁ గ్రుచ్చినయాయుధమునకు - చమురిడఁగావలదు - తిరిగి మెరుగుపట్టించనక్కరలేదు - అనఁగా దానిశరీరమంతఁ జమురుగా నేయుండునని తాత్పర్యము ॥ ఇంతియకాక - అగ్గికాఁకనించుకయుడినన్ - నిప్పు సెగసుగొంచెము సేపుంచినటులయిన - చెడుగట్టుల గ్రుచ్చిననఁ జుడు శూలములవంటి యినుపకట్టులను గ్రుచ్చిన దానిమాఁసము మంటఁదగిలి - జ్వాలలంటుకొని నెయ్యి ఘృతము జోటజోటవడియున్ - జోటజోట గారును - అతిరుననేడ తెగకుండఁగారును॥ ౧౯

తే॥ వలదు కుక్కలవిడువంగ వలవ దేయ । నడిచి మొలపిడియంబునఁ బొడువవచ్చుఁ । బకము గోరిజదిగఁబడిప
అవలేవు । వన్నులివ్వేళ రేగటిమన్నులందు॥ ౨౦

టీక॥ కుక్కలవిడువంగన్ - శునకములను విడుచుటకు - వలదు పనిలేదు - వలవదేయన్ - బాణములతో వేయఁబనిలేదు - నడిచి స్వాభావికముగా నడిచిపోయి - మొలపిడియంబునన్ - కటిప్రదేశములోనుండు గుజ్జుకోలచేత - పొడువవచ్చున్ - గ్రుచ్చవచ్చును వేసిననఁగా - మన్నులు - బుశ్యములు - ఇవ్వేళన్ - ఈసమయమందు - రేగటిమన్నులందున్ - కృష్ణభూములందు పంకముగోరి జడిగఁబడన్ - బురదలోఁ గొరిజ దించుకొనిపోఁగా - పరవలేవు పరుగెత్తలేవు గనుక పొడవవచ్చునని సంబంధము - పిడియంబను పదమునకు బాఁకని కొందరు॥ ౨౦

క॥ పొడచెదరి బూడిచఁబడిన । యొడళ్ళతో నాల్గురెండు నొకటియుఁ బంగల్ । వెడలిన కొమ్ములబరువున । నడు
గిడఁగాలేవు బలసియాఁదులమప్పుల్॥ ౨౧

టీక॥ పొడచెదరి - శరీరముపై మచ్చలంతటవ్యాపించి - బూదిచల్లబడినన్ బూడిదెపూసిన - ఒడళ్లతోన్ - దేహములతోడన్ నాల్గురెండు నొకటియుఁ బంగలు - నాలుగేసి రెండేసియొకటొకటియుట్టిచిల్లలు - వెడలినన్ - బయలుదేఱిన

చిక్కి - చిక్కించుకొని - చీరుచుఁ - చీల్చుచును - కేరున
వియ్యుఁ - కేరింతలాడునవికొన్నియు - నాడునాటికింబా
టించి - నానాటికివిచారించి - వేఁటకాఁడని నెఱింగి మేపు-
మృగయుఁడాఁకలిగు తెఱఁగిమేపునట్టి - మేపులవను శ్యా
రంబులఁ - మేపుల ప్రోషితుల చేత - ? కారించి - నిడిలవి
వీకునఁ - గర్వము చేత - తిరిగితిరిగి - మాటిమాటికిభ్రమణ
ము చేసి - ఈఁకఁదీర్చుకొనునవియుఁ - పక్షములు సవరిం
చిచక్కఁ జేసుకొనునవి గొన్నియు - పదనగ్గలించికూయు
చుఁ - మేఁత వేళ నాఁకలిగొని కూయుచును - కడుపునకనే
కంబడఁ - ఉదరమునకనకలాడఁగా - కనుకట్టు తోడఁ-
కండ్లమూఁతలతోడ - మోములుమలంచుచుఁ - ముఖముల
నుమళ్లించుచును - పంజరస్థితకీరశారికాపారావతాదుల-
పంజరస్థిత । పక్షులపెంచుగూఁడులలోనున్న - కీర - చిలు
కలు - శారికాగోరవంకలు - పారావతాదుల పావురము
లు మొదలైనపక్షులయొక్క - పలుకు లాలించి - మాటలు
విని - ఎగసియెగసి - వానిమీఁదికెగిరియెగిరి - నిజావస్థితతా
దృగ్విధాధారవేణుయష్టులకుఁ - నిజావస్థిత - తమరునిలి
చియున్న - తాదృగ్విధ - అట్లఁగాఁబూర్వమందుఁజెప్పఁబ
డిన - ఆధారవేణుయష్టులకుఁ - అధికరణమైన వెదురుగ
డలకు - చట్టుపటుచెదరఁ - ఱెక్కలెగరి ప్రసరించునట్టుగా-
ప్రదక్షిణభ్రమణంబులఁ - వలగొని తిరుగుటలచేత - పరిభ్ర
మించి - మిక్కిలితిరిగి - మగుడఁ - మరలఎట్టకేలకుఁ - కొం
త సేపటికి - మెట్టుకొనునవియుఁ - ఎప్పటివలెనిలువఁద్రొ
క్కకొనునవికొన్నియు - మేరమీఱందిన్న - మితముదప్పి
నట్టుభక్షించిన - ఎరలఁ - మహీలతల చేత - అనఁగా నెఱ్ఱ
లచేత - అన్నుకొని - మత్తుకొని - అరగన్ను వెట్టి - మ్రాఁ
గన్ను వేసి - బోరకడంబాటుమరింపఁ - పొట్టవైపున నుబ్బు
నట్టుగా - కూయుచుఁ నిద్రపోవుచు - మతికిలం బడియుం
డునవియును నై - చతిగిలఁబడియుండు నవికొన్నియును నై
పరగు - ఒప్పునట్టి - పలు దెలుంగుల భైరిసాళువము మొ
దలైనభేదములుగల - డేగమొత్తంబులును - శ్యేనములగుంపు
లును - గుత్తంబులగు - బిగువు సరిపడినవై - మిగుల మెత్తని
మిక్కిలినున్ననైన - జలపోతతోలుపట్టెడలు - బంగారునీ
రుపూసినచర్మపుపట్టెడలు - మెడలనమరఁ గ్రీవములయందొ
ప్పుచుండఁగా - పసపార్చి - పసపునీళ్లతో స్నానము చేయిం
చి - కట్టుగంబంబుల కుందార్చి - కట్టివేయు స్తంభములవద్ది

కిఁదెచ్చి - బంధించిన - కట్టివేసిన - కుందనంపు గొలుసులు
పదాఱువన్నెబంగారపుశృంఖలములు - ఘుళిఘుళిమనఁ-
ఘులుఘుల్లుమనునట్టుగా - ఒడ్డలుఝాడించికొనుచుఁ - దే
హములు విదలించుకొనుచు - కొనసాగి - నిక్కి - పొగలై -
పొడవులై - ముంగిసమోరలుంబోలి - నకులములయొక్క
ముఖములవలె నేయున్న - మోరలు - ముఖములు - సారె
సారెకు నెత్తి - మాటిమాటికిని నెత్తుకొని - బయలు పసివట్టి
చుఁ - ఆకాశము పసివట్టి చూచుచు - కట్టెమటి - తమమొ
ట్టయె మటమున్న - వాజిశాలలఁ - మందురముల యందలి-
కట్టిన - బంధించిన - పొట్టేళ్లకై - గొఱ్ఱెపోఁతులవిక్రమకై -
యాడిగొని - తలంపుదెచ్చుకొని - నీళ్లి - కాళ్లుఁ ముందరికిసాఁ
చినిక్కి - కాళ్లు ద్వి - వానిమీఁదికిముందరి కాళ్లతో నేలకో
రాడి - ఘనమలంఘుఁ - ఘన - అనేకమైన - ఘనాఘ
న - వర్షాకాల మేఘముయొక్క - ఘర్ఘరధ్వానసమ - ఘ
ర్ఘరయనునురుముతో సమానమైన - ధ్వనులుచెలఁగఁ - ర
వమొప్పునట్టుగా - మ్రోఁగి - మొరిగి - నింగులుప్రాఁకు
చుఁ - ఆకాశముల పైకిలేచుచు - ఇంగలంబులుమిఱు-ని
ప్పులుగ్రక్కుచున్న - నయనగోళంబులఁ - కనుగ్రుడ్లచేత
ఆభీలంబులై - భయంకరములై - వివృతమకులఁ - వివృత
తెరవఁబడిన - వదనగహ్వార - బిలములవంటి నోళ్లయందు-
విలంబి - వ్రేలుచున్న - జిహ్వాపల్లవంబులకుఁ - నాలుకలను
చిగురు టాకులకు - క్రూరతరదంతకోణ కాంతికలాపంబు
లఁ - క్రూరతర దంతకోణ - అతికఠినములైనపంటికొనల
యొక్క - కాంతికలాపంబులఁ - శోభాసమూహముల
చేత - కోరక స్తబకతోరణంబు - పూమొగ్గగుత్తులతో సాం
గత్యమును - కల్పింపుచుఁ - కలుగఁజేయుచును - అశ్వేత
రగ్రస్త - అధికమానటుగా గ్రసింగఁబడిన - కీలాలపలలజా
లగ్రాసంబులు - రక్తమాంససమూహాహారములు - నడిమి
సన్నడనంబునఁ - మధ్యభాగముయొక్క సూక్ష్మత్వము
చేత - ఆటకమి సలడ్డిగిచనకునికిఁ - అవతలికిదిగిపోకయుం
డుటచేత - కటితటంబులకంటెఁ - పిరుదులయొక్క పా
ర్శ్వములకన్నను - తారెపుటపుటనయ్యెననఁ - తామేబ
లిసినవనునట్లు - తోరంబులగు - గొప్పలైన - బోరలగందం
బులఁ - రొమ్ముల చేతను మెడవంపులచేతను - అం
దంబులుగని - చక్కఁదనములఁబొంది - బిరుదులంకించి -
బిరుదులెత్తి - తమ్ముసుపలాలించు - తమనుబుజ్జగించుచు

న్న - పరిపాలకుల - సంరక్షకులయొక్క - సంస్తవంబుల కున్ - స్తోత్రములకు- చెవిదార్చెననన్ - కర్ణమొగ్గినవోయనునట్లుగా - కర్ణకీవలయంబులు - చిగురుటాకులవంటి చెవులు - వ్రాలంబడి - వ్రేలాడినవై - వెండిగుండ్లుంబోలెన్- రజితపుగుళికలవలె-కన్నులపండువులై - నేత్రానందకరములై - గండభైరవ- గండభైరవునియొక్క - భూజవారువంబులనన్ - భూజగజ్జములలో యనునట్లుగా - మెండుకొనియుండు- మొత్తమైయున్న - జాగిలంబులన్- వేటకుక్కలను- కాంచి- చూచి - అందునందున్ - ఆ డేగలయందునస వేటకుక్కలయందును - వేటకునేరవైనవానిన్ - కృపగయయుక్తమైనవానిన్ - పర్వరించి తెచ్చుటయున్ - పన్నరదికొనివచ్చుటకు- అనుచరులన్- కొలువుడుగాండ్రను- నీవునీవనినియమించి- నీవునీవనియాజ్ఞాపించి - తానున్ - స్వరోచియును- ఆఖేటకోచిత। వేటకుందగిన। పరిపాటికిన్। అనుక్రమముచేత- సన్నద్ధుండయ్యెన్- సజ్జితుండాయెను। అనంగాంగవచముందొడిగినవాండాయెను-అయ్యవసరంబునన్ - ఆసమయమందు॥

సీ॥ పచ్చనిహురుమంజిపనివాగె పక్కెర పారసిపల్లంబుపట్టునుయము। రాణనొప్పారుపై తాణంబుసింగిణి- తళుకులకోరీలతరకసంబు। మిహిపసిండిపరుంజు మొహరాదా కెలంకుల - తావుగుజ్జరివన్నె కేవడంబు। డాకెలంకునసిరాజీకరాచురకత్తి- కుఱంగటఁగ్రొవ్వాఁడిగొరకలపొది ॥ తే॥ పీలిసుంచెతలాటంబు పేరొజాబుపూసల మొగముట్టుఁబన్నిసాహిణియొకండు। కర్తయెదుటికిఁగొనివచ్చె గంధవాహ। బాంధవంబగునొకమహాసైంధవంబు॥ ౩౭

టీక॥ పచ్చనిహురుమంజిపనివాగె- పచ్చని- బంగారుచాయగలిగి। హురుమంజిపని- హురుమంజిముత్యాలుగూర్చిన- వాగె। కళ్లెమును- పక్కెర- కవచమును - పారసిపల్లంబు- పార్సీదేశపుజీనియును - పట్టునుయము - తంగువారును- రాణనొప్పారు- శృంగారముచేతనొప్పుచున్న-పై తాణంబుసింగిణి- పతాణీసింగిణీవిల్లును- తళుకు - మెరయుచున్నలకోరీలతరకసంబు- అంబులపొదియును-మిహిపసిండిపరుంజు - మేలిమిబంగారుతోఁ జేసినఖడ్గముష్టిగ్రాహ్యముగలిగిన- మొహరా- అడ్డకత్తియును - కెలంకులన్- పార్శ్వములయందు- గుజ్జరివన్నె కేవడంబు- గుజరాతిదేశపుడాలును- డాకెలంకులన్ - ఎడమపార్శ్వమందు- సిరాజీ- నాడెములోసంపూర్ణమైన - కరాచురకత్తి- ఛురికయును। కుఱంగటన్ - దానిసమీపమందు- క్రొవ్వాఁడిగొరకలపొది - మిక్కిలితీక్ష్ణములగలబాణపు పొదియును- పీలికుంచెతలాటంబు- పికిలిపిట్టయీఁకెలతురాయియును- పేరొజాబుపూసల వంటరాళ్లనుకూర్చిన- మొగముట్టున్- ముఖపట్టయును పన్ని - అమర్చి - గంధవాహబాంధవంబగు - వాయువుతో సమానమైన వేగముగల- ఒకమహాసైంధవంబున్- ఒక ఘనమైనగుఱ్ఱమును - సాహిణియొకండు - ఒక ఖాసదారు- కర్తయెదుటికిఁగొనివచ్చెన్- ప్రభువునెదుటికిఁదీసుకొనివచ్చెను॥ ౩౭

క॥ తెచ్చుటయునిచ్చమెచ్చుచు। రుచ్చటులకురంగయనిరోధిస్యదగ। ర్వోచ్చంబగునత్తేజము। హృచ్చక్రంబలర వేగనెక్కి వెడలినన్॥ ౩౮

టీక॥ తెచ్చుటయున్ - తీసుకొనిరాఁగా- ఇచ్చ మెచ్చుచు-మనస్సులోశ్లాఘించి - మరుచ్చటుల- మరుత్। వాయువుయొక్కయు। చటులకురంగ। సమగ్రములైన లేళ్లయొక్కయు। రయ। గమనవేగమును। నిరోధి। తిరస్కరించుచు। స్యద- త్వరితగతియొక్క। గర్వోచ్ఛ్రంబగు - అహంకారముచేత నతిశయమైన - అత్తేజిన్- ఆగుఱ్ఱమును - హృచ్చక్రంబలరన్ - ఆప్తవర్గముసంతోషించునట్టుగా- వేగనెక్కి - త్వరగానారోహించి। వెడలినన్। బయలుదేరఁగా। ౩౮

చ॥ జడలుమలంచిచొళ్లెముగ సన్నపుపాగ నడంగఁజుట్టి చల్లడములుపూని మీఁదఁబదిలంబుగఁగట్టి నమట్టికాసెలతో బిడియములంటఁద్రోఁపి పృథుభీషణబాహులసాళువంబులం దడిమికెరల్చుచుం జరినాథుని ప్రోల నృపాలనందనుల్॥ ౩౯

వ॥ ఆసమయంబునన్ ॥ ఆకాలమునందు॥

టీక॥ జడలుమలంచి - జడలువేసిన తలవెండ్రుకలుపై కిమల్లించి - చొళ్లెముగన్- మెలికలువేసినట్టుగా- సన్నపుపాగ నడంగఁజుట్టి- సూక్ష్మమైనయుష్ణీషములనుభుగ్నముగునట్లు వేష్టనముచేసి - చల్లడములుపూని - లాగులు దొడిగి-

ను - వింజ్లగా నైనలు - ధనుస్సులయొక్క యొశలును - చుట్టినొస్సల్ల పైనిడి నచట్టుకొని ఫాలముఁ మీఁదఁ బెట్టుకొన్న - జుంజుఱు వెఱ్లసిగలు - సంస్కారహీనములైనిరియఁ బోనుకొని యెఱ్ఱనైనశిఖలును - కటీతటింబెట్టిన - మొలలో వెనుకదోపిన - మోటకత్తులుగా- కట్టుకంపగొట్టునట్టిమడ్డికత్తులును మేనులగా - శరీరములయందు - కారొక్కనుకప్పులు - చీకట్లు క్రమ్ముచున్న నైల్యములును - పచ్చిచేఁబట్టిన - పన్నగది చేతఁబట్టిన - వేఁటయమ్ములుగా - మృగయతిఁ బనికివచ్చు బాణములును - బాగను - ఒప్పుచుండునట్టి - వాగురికులు వేఁటకాండ్రు - మహోత్సవులగా - గొప్పసందడిగా॥ ౪౩

సీ॥ సటలెత్తుకొనిమెత్తుగిటినైనమోటాన। పడియేయఁబోవుతుసీపాదమాన। కలగుండువడఁజెందుకరినైనఁజెవిపట్టి। బలిమిమైఁదెత్తుసీపాదమాన। సెలనెప్పుకొనిరొప్పుఁబులినైనఁబీడించి। పడవైతుఁ జొచ్చిసీపాదమాన। తెరదాఁటివేఁజఁబాఱుగురుపోతుపైనైనఁ - బడియెక్కి పొడుతుసీపాదమాన॥ తే॥ యితరదుర్బలమృగపఙ్క్తులేమిలెక్క - కండగరువంపుమాటలుగావుమమ్ము। మూఁడుమమ్మునిపంతంబులాడికొనుచు। నవ్వరూథినిసుతుఁగొల్చుచరిగిరపుడు॥ ౪౪

టీక॥ సటలెత్తుకొని - మెడమీఁదివెంట్రుకలునిక్కఁబొడుచుకొని - ఎత్తు - పైకివచ్చునట్టి - కిటినైనగా- అడవిపందినైనప్పటికిని - మోటానపడియేయగా - మాటుచేసుకునిబాణములచేతవేయ - పొడుతుగా - కలియఁబడిపొడుతును - సీపాదమాన - సీచరణములతోడు- కలగుండువడఁజెందు - అంతయుఁ ద్రొక్కిగ్లుపమునట్టుగాఁ దారసిలుచున్న - కరినైనఁజెవిపట్టి - ఏనుఁగునైనప్పటికిని శ్రోత్రమువట్టుకొని - బలిమిమైఁదెత్తుగా- బలాత్కారముచేతఁదీసుకొనివత్తును - సీపాద మాన సీచరణముల తోడు - సెలనెప్పుకొని - కొండయేఱుద్రావుఁజేసుకొని। రొప్పుఁబులినైనగా అరుచుచున్న వ్యాఘ్రమునైనప్పటికిని - చొచ్చి - చొరఁబాఱి - పీడించి - పట్టుకొని - పడవైతుగా- పడునట్టువేతును - సీపాదమాన - సీచరణములతోడు- తెరదాఁటి- వలలో నుండిదుస్సి - పెఱఁబాఱు - భయముచేతపరుగెత్తిపోవునట్టి - గురుపోతుపైనైనగా- గవయమృగముమీఁదనైనప్పటికిని - పడియెక్కి - పైఁబడియారోహించి - పొడుతుగా పోఁటుద్రేతును - సీపాదమాన సీచరణములతోడు - అనఁగాసీపలికినమాటలుసత్యమనుట॥ ఇతరదుర్బలమృగపఙ్క్తులు - బలముచాలనియల్పమృగసమూహములు- ఏమిలెక్క చెప్పవలసినదేమి - కండగరువంపు - ఇవికండకావరముచేతఁబలుకునట్టిమాటలుగావుసుమ్ము - పలుకులుకావుసుమా మూఁడుమమ్మని - మమ్ముఁగనుఁగొనుమని - పంతంబులాడుకొనచుగా - ప్రతిజ్ఞలుపలుకుచును - అవ్వరూథినిసుతుఁగొల్చుచుగా - ఆవరూథినిపుత్రునిసేవించుచు - అరిగిరి - పోయిరి - ఆసమయమునందు॥ ౪౫

ఆ॥ మువ్వగదలనత్తైములనుండియెగురుచుఁ। బదనుమీఱఁ నెరలవెదకుడేగ। పదువువట్టిదండపాణులైనడచిరి। విభునిమ్రోలడేగవేఁటకాండ్రు॥ ౪౬

టీక॥ మువ్వగదలగా - కాళ్లనుండుగజ్జెలుచలించునట్టుగా- అత్తైములనుండియెగురుచుగా- తోలుకుచర్మములమీఁదనుండియెగయుచును - పదనుమీఱగా - ఆహారపువేళకాఁగా- ఎరలవెదకు - మహీతలనరయు। అనఁగానెఱ్ఱలను రోయుచుండు- డేగపదువువట్టి- శ్యేనములగుంపునుబట్టుకొని- దండపాణులై - కఱ్ఱలుచేతుల లోఁగలవారై - డేగవేఁటకాండ్రు - శ్యేనమృగయులు - విభునిమ్రోలగా - ప్రభువుముందు- నడచిరినడచినవారైరి॥ ౪౬

ఆ॥ గూనివీఁపులదరగొణిగితిట్టుచునేపు। గఱచినట్టికుక్కగండ్లనంగ। మూఁతినరపమీసములబోయముదుసళ్లు। పందివలలుమోచిపఱచిరపుడు॥ ౪౭

టీక॥ గూనివీఁపులదరగా - భుగ్నపృష్ఠములు కంపించఁగాఁ- గొణిగితిట్టుచుగా - తమచేతవలలుమోయించువాండ్రనుదమలోఁదామెమెల్లగాశపించుచును - ఏపుఁగఱచినట్టి - తెల్లనిదూదికణికనోటఁగఱచుకొన్న - కుక్కగండనంగగా - కుక్కపోఁతులోయనునట్టుగా - మూఁతినరపమీసములగా- మూఁతిమీఁదఁదెల్లగానరిసినశ్మశ్రువులుగల- బోయముదుసళ్లు- ముసలిబైన్నవాండ్రు- పందివలలుమోచి - వరాహవాగురలనుమోసుకొని - అపుడుగా - ఆసమయమందు- పఱచిరి- పరుగెత్తిరి॥ ౪౭

జూపెట్టుకొనియెదురుమాటలు గాఁ గొండనుండి చెదరిపారు చెరువులం బలవకుండనీరములసందు సందులందమ తమకట్టిన మోటకత్తులనొండొండ ఖండితంబులగుమండగలకంపమండలు ద్రోచి యినుమములం గ్రహవాలొనరిం చుకొనంబలంబి తానునొక్కొక్కరొయెడందరగా ధీరూఢుండనునై యెల్లెడల మొలచుం గూతలెగయఁ జణవ మృదంగదుందుభిప్రముఖతూర్యంబులు గొట్టించియు కాహళులు వట్టించియు నగ్నియాస్త్రంబులు ముట్టించి యురొదమిన్నుముట్టం జోపు వెట్టించిన‖ ౬౩

టీక ‖ ఇట్లరిగి - ఈప్రకారముగాఁబోయి- అమ్మహారణ్యంబుసొచ్చి - అభూనమైనయడవియందుఁబ్రవేశించి - విచ్చలవిడిన్ - స్వేచ్ఛగా - అనఁగానిచ్చవచ్చినట్లు - అచ్చటన్ ఆయడవియందు - పచ్చికబయిళ్లన్ - పచ్చికపట్లుగలచోట్లను - మచ్చికలచ్చుపడన్ - స్నేహకృత్యములొప్పునట్లుగా తటిచ్చటులలంబగు - తటిత్ - మెరుపులవలె - చటులంబగు చంచలమైన - లోచన- నేత్రములయొక్క - ప్రభాపటలంబు - కాంతిసమూహము - దిక్తటంబులంబర్వన్ - దిగంతములయందు వ్యాపింపఁగా - తారుమారువడనిడికొనిన-వ్యత్యాసముగాఁబెట్టుకొన్న - మొగంబులతోన్ - ముఖములతోడ- ఫణిజిహ్వాపల్లవోల్లిహ్యమానాంగంబులగు-ఫణి-ఆఁడుతేళ్లయొక్క - జిహ్వాపల్లవ - చిగురుటాకులవంటినాలుకచేత - ఉల్లిహ్యమానాంగంబులగు - నాకఁబడుచున్న శరీరములుగలిగిన - సారంగంబుల - మగతేళ్లయొక్క - ఖురళీకారంగంబులన్ - గరిడీస్థలములోయనునట్లుగా - కనుపట్టు - అగుపడుచున్న - చెలికెపట్టులును - పైరుకోసినమొక్కలయొక్క ప్రదేశములును - బిట్టైసంగు మిక్కిలియతిశయించుచున్న - ఆఁకటందటువడి - ఆఁకలిచేతడీలుపడి - పొట్టకై - కడుపునిమిత్తముగా- అనఁగాఁదిండినిమిత్తమై పుట్టమాటికిన్ - వల్మీకములమీఁదమొలుచుకొక్కగొడుగులకును - చీమలకున్ - పిపీలికలకును - చెదలునకున్ - పుత్తికలకును - ఎలుంగులు - భల్లూకములు - గులగులన్- గులగులమని - పుట్టలు - వల్మీకములు - నిశితనిజనఖరకులిశకోటులన్ - నిశిత - వాఁడిగలిగిన - నిజనఖరకులిశ- వజ్రాయుధముతో సమానమైనతమగోళ్లయొక్క - కోటులన్ - కొనలచేత - కోరాడన్ - త్రవ్వివిన్న నీవలావలవెనఁజల్లఁగా - ఆకండఁగాచుకొనియుండి - ఆచెంతఁగనిపెట్టుకొనియుండి - వెడలిచను - ఎలుగుబంట్లుపుట్టలుత్రవ్వఁగాబయలుదేఱివెడలుచునుండు - విషవిస్ఫురజ్జిహ్వాభుజంగంబులన్ - విషవిస్ఫురత్ - గరళముచేతఁదేజరిల్లుచున్న భుజంగంబులన్ సర్పములను-నల్గడలంగబళించి - నాలుగుదిక్కులయందునాక్రమించి - గెంటకుండన్- తొలఁగకుండ - దంటుచప్పరించుగతిన్ - చొప్పకాడనమలినట్టుగా- చప్పరింపుచున్ నమలుచును - ఒండొంటికిం బేరెంబులు వాఱి - ఒకదానిమీఁదికొకటిపరుగులెత్తి - కుప్పించితప్పించుకొను - ఎగిరిగంతులు వేసితప్పించుకొనుచునుండు మృషల-పృషతమృగములయొక్క-ఖురజరజశ్ఛటలన్-ఖురజ! గిట్టలవలనఁబుట్టిన-రజశ్ఛటలన్- ధూళిపరంపరలచేత- ఎసకమెసంగు - అతిశయించుచున్న * మసమసకలన్ * స్వల్పమయినచీఁకటిలో - మరుంగువడి యుండు - కానరాకుండనున్న - గండోపలంబులు నుగొప్పగొప్పశిలలును - పరిహసితసితేతరపాషాణపాటవంబులగు - పరిహసిత తిరస్కరింపఁబడిన - సితేతర - నల్లగానుండు- పాషాణ- రాళ్లవంటి - పాటవంబులను - పటుత్వముగలిగిన - విషాణపరిఘంబులు - బడితెలవంటికొమ్ములు - ఒండొంటిపైకి ఒకదానికొకటితగిలి - కఠిల్లుపెఠిల్లుమనన్ - కఠిల్లుపెఠిల్లుమనునట్టుగా - పోరు-పోట్లాడుచునుండు - కాసరపోతుల* ఆడవిదున్నలయొక్క - కోలాహలంబులన్ * కలకలధ్వనులచేత . ప్రతిశబ్దంబులీను - మారుమ్రోయుచున్న - కోనలును- లోయలును - మదమొదవన్ - యౌవనగర్వముపొందుచునుండఁగా - ఎదపదనునం బొదలు - చూలగుటకు సమయమైనట్టి - పెట్టలమంజుట్టంబులై ఆఁడుపందులకుఁదగులాటములై - ఇచటఁబెట్టలనఁగామృగములలోఁబత్తులలోనాఁడుజంతువులు - ఇందుమశుకసప్తతిరెండవయాశ్వాసములో ౮౮ వపద్యములోనాలుగవచరణము గోలయుఁబలెనొక్కపెట్టకుకాంగోనుచున్-అనిచెప్పెను - చిల్లర- మిగిలిన - సలగులన్ - పందులను - పిల్లలన్- శిశువులను-జుల్లరంబులన్- ఎడయగునాఁడుపందులనువెంబడించుమొగపందిగున్నలను-సాగనిచ్చి-జరిగిపోనిచ్చిగమికివెనుకయై - మందకువెంటఁజిక్కి - మలయుచున్ తిరుగుచును - పిఱుందందిరుగు - వెనుకసంచరింపుచున్న*

చిఱుగున్నలకున్ - చిన్నపిల్లలకు - వేఁ్నాఁడు - వెంటనంటిపోయెడు - తోఁడేళ్లసివంగులన్ - వృకములనుసలతులుపులను తిరిగితిరిగి మొత్తి - భ్రమణముచేసిచేసికొట్టి పోనొత్తి - పోఁసరమి చరించు - సంచరించుచునుండు - ఏకవరంబులన్ - అడవిపందులయొక్క - ఘుర్ఘురధ్వానమ్ములన్ ఘుర్ఘురయనుధ్వనులచేత - ఘూర్ణమానంబులగు - తిరుగుడుపడుచున్న - పరిగె - పరిగెయనునది పక్కె - పక్కెయనునది పలుమేఁకు - పలుమేఁకువనునది - రేఁగు బదరియనునది వేము నింబమనునది - పులుగుడు - పాలయనునది - గురువింద గుంజయనునది - ఈఁదు ఈఁదుయనునది గేదంగి - కేతకియనునది - మోదుగు - పలాశమనునది - ఓరు వీరణమనునది కొరింద - ఆథారికయనునది - కసుము శరమనునది - కానుగు - కరంజమనునది - మొగలగు - మొదలుగాఁగలిగిన పొదలంబొడవగు - నికుంజములయందు - బొడుగై యుండు - నానావిపినపాదప కలాపంబులును - నానా సకలమైన - విపినపాదప - అడవిచెట్లయొక్క - కలాపంబులును - సమూహములును - మాటిమాటికిన్ - పలుమాఱు - మాసిసి కాటుమరగి మనుష్యులనుగఱచుటయలవాటుపడి - తెరువులుగాచి కాచి - మార్గములుగని పెట్టికనిపెట్టి - డగ్గుత్తికవడందిను గద్గదికవోడమునట్టుగాభక్షించు పెద్దపొలవలనన్ - గొప్పమాంసమువలన - వుటవుటనై - విస్తారమై - తుప్పుళ్లుమల్లి - నోటియురుచివదలి - తుళ్లి - పోతరించి - గంతులిడు - దుముకులువేసెడు - గబ్బిబెబ్బులులన్ - తమకకుండనుండు పెదపులులను - నలుగడ దొడ్డజనంబులు - నాలుగుదిక్కులగొప్పములలోనుండుమనుష్యులు | మంత్రించిపొరకదిగిచిన్ - అభిమంత్రించిగడ్డిపొచతియఁగా నీరుమేపుడిగి నీళ్లుమేతమాని - గిరులుగ్రక్కదలన్ - కొండలుచలించునట్టుగా వాపోవుచున్ - బొబ్బలుపెట్టుచును తిరిగితిరిగి పలుమారుభ్రమణముచేసి - వాకట్టువిడిచినప్పుడు - నోటికట్టువదలించినసమయమందు దప్పికై పాఱి దాహమునిమిత్తమైపరుగెత్తి - సెలయేటిచెంకులన్ - గిరినదులయొక్క మరుగుచోటులను బాణమ్ములు - మాటువెట్టి వేసినవరుసగల బాణములు - ఱొమ్ముకెలంకులంగాఁడన్ - హృదయపార్శ్వములయందునాటఁగా - గాండ్రుకాండ్రుమని కాండ్రుకాండ్రుమనిరొప్పి - ఆరచి - నొప్పికిన్ - బాధను - ఉప్పరంబుగాన్ -

పొడవుగా - వియత్తలంబునకున్ - ఆకాశప్రదేశమునకు - వీల్గెత్తుపొడవెగసి - వింటియుం బొట్టుకూ మొగిరి - నెత్తురులు గ్రక్కుచుఁగూలు - రకవమనముచేయుచును నేలఁబడు - క్రోల్పులుల - మహాశార్దూలము - ఘుర్ఘురధ్వనులన్ - ఘుర్ఘురయనుధ్వానములచేత * గుండియలవిసి - ఱొమ్ములుబ్రద్దలై - కలగుండువడు క్రోతుపెలాడెడు - కారండవంబుల - కన్నెరేఁడులను జలపక్షులయొక్క - పక్షపుట పుటములవంటి ఱెక్కలయొక్క - పటాత్కారములన్ - పటపటయనుధ్వనులచేత - భోరుకలంగు - మ్రోఁగుచున్న - సెలయేటి - గిరినదులయొక్క * నీటిచెంతలును నీళ్లచుడుగుపల్లును - మేతవెంబడిన్ మేయుచున్నవరుసవెంట - బాలమృగబులన్ - అడవిపల్లపుస్థలములయందు - తిరిగితిరిగి - మిక్కిలిసంచరించి - పెంట్రుకలువెట్టు - పేఁడఁబెట్టునట్టి - పెంటపట్టువసువచ్చి * నప్పుయుండుస్థలమునకేతెంచి - అచ్చటం గ్రుచ్చికనరాకుండన్ - అచ్చటనేలఁబొడిచికనుపడకుండ - మునుమున్న - ముందుముందు - మృగయుండు - వేఁటకాఁడు - బిగియొడ్డిసంఘటించిన - ఉత్పాతనకీలమమర్చిన - కాలిబోనులంబడ - చరణములకుఁదగులుకొనకూట యంత్రములలో బడ బెగడి - గద్దరిలి - అద్దారువీడ్చుకొని - ఆబోనుకొయ్యనులాగుకొని - ఈరములఁదటియాంబడి - పొదలసందునఁబడి - అవ్వలికై వెడలిచనలేక - గెడసి - చావఁబోవుచు తన్నుకొనుస్వపాదతాడనముచేసుకొనెడు మన్నెమెకంబుల - మనుబోతులయొక్క - ఆక్రందనంబులన్ - రోదనధ్వనులచేత - క్రందుకొను - సందడిపడుచున్న - విషమప్రదేశంబులును - మిట్టపల్లపుచోటులును - చిరుతగండ్లగమిచేతన్ - అల్పవ్యాఘ్రములగుంపుచేత | దైవికంబునన్ దైవాధీనమువలన - డాప్రక్కమీఁదువడన్ - ఎడమపార్శ్వముపైకినగునట్లుగా దాఁటుపడి - ఆక్రమింపంబడి అవిగొంతుక్రొన్నెత్తురులెక్రోలి - ఆచిరుతపులులుకంఠమందలిరక్తములుమాత్రమేత్రాగి విడిచిచనన్ - వదలిపోఁగా - మాత్మెడలువడి - కంఠములుముల్లించి వేసుకొని - మశకవనఖంశములుమూఁగన్ - దోమలునన డవియీఁగలును ముసరఁగా - మాగంబాఱిన - కుళ్లఁబాఱిన - కొండగొఱియమురుగుడుబొంతులకున్ - తౌహామములయొక్క మాఱిగిపోయినదేహములకు - సందడించు - పైఁబైఁబడుచున్న

టీక ॥ ఒడలుబ్బనిక్కి - శరీరముప్పొంగునట్లుగానిగిడి - ముందరియడుగులు - ముందరికాళ్లు - ధరమోఁది - భూమిమీఁద మోపి - చిఁదునలబమునకున్ - అదలించుచున్న సందడికి - జడియక - భయపడక - ఒకగబ్బిగండు - ఒక మోటుమగదుక్క - ఎక్కుడుగడిమిన్ - అధిక శౌర్యముచేత - క్రుంగి - ముందరికివంగి - కొమ్ములంటుదుముల్ - విషాణములుగలగోధికను - తివిచెన్ - బొక్కలోనుండి పైకిఁదీసెను॥ ౮౦

తే ॥ కంపతోడుగీడ్చిన ట్లేమగానఁజన్న । తెరువెరుంగుచునొకఁడేగి పరువుతోనఁ । బడియడఁగియుండఁగాఁ బటపటనముంగ్లు । గాలిఁగదలుటగనిపంత్రకోలఁబొడిచె॥ ౮౧

టీక ॥ కంపతోడుగీడిచ్చినట్లు - కంటకాదిభారములాగినట్లుగా - ఏమగానఁజన్న - అడవిపందియడవిలోఁబోయిన - తెరువెరుంగుచున్ - మార్గమునుదెలుసుకొనుచు - ఒకఁడేగి - ఒకవేఁటకాఁడుపోయి - పరువుతోన - పరిగెత్తుట కోడనే - పడి అణఁగియుండఁగాన్ - నేలఁబడియడఁగిజాడఁదెలియకుండనుండఁగా - పటపటనన్ - పటపటయనుధ్వనిచేత - ముంగ్లు - దానికంటకములు - గాలిఁగదలుటగని - గాడ్పుచేఁజలించుటనుజూచి - పంత్రకోలఁబొడిచెన్ - పంత్రకోలయనునాయుధముతోఁగ్రుచ్చెను॥ ౮౧

వ ॥ అత్తఱిందత్తఱంబునమొత్తంబయిచోపుడుగోలలు గొని కెలంకుల పొలంబులఁబులుఁగులం జోపుచు జేగవేఁటకాండ్రు వేరువడి వేఁటాడం దొడంగిరందు॥

టీక ॥ అత్తఱిన్ - ఆసమయమందు - తత్తఱంబునన్ - తొందరచేత - మొత్తంబయి - గుంపుగూడి - చోపుడుగోలలుగొని - పక్షులను లేవఁదోలుకఱ్ఱలు దీసుకొని - కెలంకులపొలంబులన్ - ఇవతలియవతలిప్రదేశములయందు పులుఁగులంజోపుచున్ - పక్షులను లేవఁదోలుచు - జేగవేఁటకాండ్రు - శ్యేనమృగయులు - వేరుపడి - ప్రత్యేకించి - వేఁటాడందొడంగిరి - ఆఖేట మొనరించుటకారంభముఁ జేసిరి - అందున్ - వారియందు॥

ఉ ॥ లీలఁబులిందుఁడొక్కఁడు కళిందసుతోర్మి సరోజినీదళాం । దోళితకోకరేఖ ఘనతాంగపునల్లనిదీర్ఘబాహుపై । హాలహాలంబపోలెవిడియ త్తైముసుదలరెత్తిచూచుబల్ । సాళువముల్ వడింజనశకుంబుపయిన్ విడిచెన్ బహూద్ధతిన్॥ ౮౨

టీక ॥ లీలన్ - విలాసముగా - పులిందుఁడొక్కఁడు - ఒకకిరాతుఁడు - కళిం... రేఖ - కళిందసుతోర్మి। యమునాతరంగమందలి - సరోజినీ - తామరతీఁగయొక్క - దళాందోళిత - ఆకుపైఁగదలుచున్న - కోకరేఖ - చక్రవాకమురీతిగా తనతోగపు - తనయొక్క - బలసిన - నల్లని - శ్యామలవర్ణముగల - దీర్ఘబాహుపైన్ - దీర్ఘ - పొడవైన - బాహుపైన్ - భుజముమీఁద - హాలహాలంబపోలెన్ - కాలకూటమువలె - ఆసఁగాఁజంపునదై - విడియత్తైమున్ - వేఁటకానిచేతిపై నుండుతోలుమీఁద - తలయెత్తిచూచు - శిరస్సునెత్తిచూచుచున్న - బల్ సాళువమున్ - గొప్పదైనసాళువడేగను - వడిన్ - జను - శీఘ్రముగా వెడలుచున్న - శశకంబుపయిన్ - కుందేటిమీఁద - మహోద్ధతిన్ - ఎక్కుడగు నేర్పుచేత - విడిచెన్ - విడిచిపెట్టెను - ఇచ్చటయమునాతరంగమునకును కిరాతునిబాహువునకును బద్ధదళమునకును దోలునకు త్తైమునకును జక్రవాకమునకును డేగకును నుపమానోపమేయభావము దెలియవలెను॥ ౮౨

క ॥ మొలదట్టిచెఱఁగుఁజెక్కుచు । బలుదిట్టకిరాతుఁడొకఁడు పటువగుముష్టిన్ । జెలకట్టెఁబట్టి వేటొక । సెలకట్టెం గొట్టివైచెఁజెముదుంగాకిన్॥ ౮౩

టీక ॥ మొలదట్టి - కటిస్థలియందుకాసెకోకయొక్క - చెఱఁగుఁజెక్కుచున్ - వేలాడుకొంగుపైకిదోపుకొనుచు - బలుదిట్ట - మిక్కిలిగడుసువాఁడైన - కిరాతుఁడొకఁడు - ఒకబోయ - పటువగుముష్టిన్ - దృఢమైనపిడికిలిచేత - జెలకట్టెఁబట్టి - జెలకట్టెయనుజాతిభేదముగలడేగనుబట్టుకొని - వేటొకసెలకట్టెన్ - మఱియొకచిన్నకఱ్ఱచేత - చెముదుంగాకిన్ - జెముడుకాకిని - కొట్టివైచెన్ - కొట్టివేసెను॥ ౮౩

యచ్చటం గ్రొచ్చి గరువునేలలగుంటఁ గూనరించి లోననుమ్మగిలి గబ్బువలవనికమ్మతావులుగలనావురాకులఁ బఱవి మెఱచిలోమే లేఁటికారిజముంగందకాయ క్రొవ్వు మొదలగు మిగులమెత్తనివలలభిత్తంబులందుఁ గ్రందుకొనఁ గ్రుక్కి వెక్కువడక్కువలుగాఁ బండగంటగల తింత్రిణీశలాటుసంఘాతంబులామీఁద నెఱయం బఱరించి యొసరుగాఁ దేటలగు లేఁడిన్నెల్లలు గ్రుమ్మరించి లవణకణసంచయంబు నించి లావుగాఁ గావుఁ గప్పియుపరిప్రదేశంబులఁ గారెనుపపెంటపట్లనీరాఱు నేరుఁ బిడకలదాల్లిడి నెల్లికొయ్యలు ద్రచ్చినుచ్చులంటించినం బెచ్చు వెరుఁగు దిచ్చులాత్రంపులందవిలించి బిముడనుడికిన వెలువతించియప్పు వెప్పునుంగలయప్పి శితఖండంబులు గనగనని నిప్పులంజమురు చిప్పిలంగాల్చి నకమ్మకఱకుట్లంజత్రాతిపయిఁ గాక్రేనికింగుడుపువెట్టిపిగపఁ బాళ్లవెంబడింబంచ్చుకొని తారనుపయోగించి దేవతాప్రీతికై తలలుదోఁకలుడొక్కలునచటివిటపివిటపంబుల వ్రేలంగట్టి శిశిరమధురసలిలమ్ములు ద్రావి వాగురికులు విశ్రమింపనిలింపాంగనానుతుండు నుసహాసమాగత చతురవలలకృతపలలఫలమూలాదిశుచిమధురమృగరోచితాహారంబులందృప్తివహించి పరిజనారచితపల్లవాసనాసీనుండై యందూషితపుండరీకమధురసాసారంబులగు నిర్ఝరానిలకిశోరంబులాలయనలయికలుదీఱియున్న సమయంబున॥

టీక ॥ ఇట్లు - ఈప్రకారము - ఆఖేటఖేలనంబునఁ - వేఁటాడువిలాసమునందు - వివిధమృగవిహాగవధంబాచరించి - వివిధ - నానావిధములయిన - మృగ - కురంగాదులయొక్కయు - విహాగ - పక్షులయొక్కయు - వధంబాచరించి - సంహారముఁజేసి - చాలించి - వేఁటనిలిపి - అంచెలంచెలఁ * అక్కడక్కడ - పంచ...బులు - పంచతాపతిత - చప్పటచేతఁబడియున్న - చమర - చమరీమృగములయొక్క - సృమర - పెద్దచమరీమృగములయొక్క - కిరి - అడవిపందులయొక్కయు - హరిణ - లేళ్లయొక్క - రురు - దుప్పులయొక్క - మహిష - కాఱెనుబోతులయొక్క - పృషదంశ - అడవిపిల్లులయొక్క - గోధికా - ఉడుములయొక్క - శశ - కుందేళ్లయొక్క - పిశితఖండంబులు - మాంసపుతునకలు - బండొండయువ్రేత్తుగాఁ - వేలువేలునశ్మెషముగా - ఆసపోత్తరలఁ గట్టియుఁ - విడాకులఁ బొట్లముగట్టి - గుములుగుట్టియుఁ - తోరణములుగా గ్రుచ్చియు - చిక్కంబులనించియుఁ - శిక్యములలోనిండించియు - కావడులనుంచియుఁ - కావడులలోఁ బెట్టియు - అనఁగా వివిధములయిందనుట - సవరించి - చక్కఁబఱచుకొని - దిగదిగనవిసరి - దిగదిగమనునట్లుగా విసరి - బగబగనమండు - బగబగనిజ్వలించుచుండు ॥ చిదుగుసొదమంటలఁ - చిదుగుపుల్లలచిచ్చుయొక్క జ్వాలలకు - అడ్డంబువట్టి - అడ్డముగాఁ బట్టుకొని మాంసంబులు సూఁడి సూఁడి - మాంసములు మాడియుండఁ గాల్చి - అనఁగా శ్రమువులదహించి - ఇక్కడఁ బులినిజంపిన వేఁటకాఁడు దానిమాంసములు గాల్చివేయవలసినదనియు లేనిపక్షమునందు నామాంసము తెవరైనసంగ్రహించి చివరమాన్నములో వేసి వండియా పరమాన్నము వారిశత్రువులకుఁ బెట్టినట్టయినఁ దిన్నవారు విషమెక్కిచచ్చురనియు సంప్రదాయము - వాఁడులగు కత్తులఁ - పదునుగల ఖడ్గముల చేత - తిత్తులొలిచి - చర్మములుతీసి - కత్తుకలుగోసి - కంఠములు ఛేదించి - నిశితముఖంబులగు - వాఁడిగలకొనలుగలిగిన - నఖంబులం జెకలించి - గోళ్లనూడఁదీసి విపులవపురపహాసితమహాశైలంబులగు - విపులవపుః - విస్తారమైనదేహముల చేత - అపహాసిత - పరిహసింపఁబడిన - మహాశైలంబులగు - గొప్ప పర్వతములుగల - అనఁగాఁ బర్వతములవలెనున్న - శార్దూలంబుల - పెద్దపులులయొక్క - బొందులఁ - కళేబరములను - అందందపడవైచి - అచ్చటచ్చటఁ బడవేసి - అంతంతఁ - అంతటంతట - కాంతారంబునఁ - అడవియందు - దంతురంబుగాఁ బడిన - ఎత్తుగావ్యాపించిపడియున్న - దంతావళంబులదంతంబులు గైకొనియుఁ - దంతావళంబుల - ఏనుఁగులయొక్క - దంతంబులు గైకొనియుఁ - కొమ్ములు దీసుకొనియు - తత్కుంభనిర్గతమౌక్తికంబులు - తత్కుంభనిర్గత ఆయేనుఁగుల శిరఃపిండములవలనబయలు వెడలిన - మౌక్తికంబులు ముత్యములు ఏఱికొనియుఁ పరికొనియు ఇచ్చట నేనుఁగుకుంభస్థలములవలన నుసిరికాయలంతేసిముత్యములు - పుట్టుచున్నవని తత్నశాస్త్రమందుఁ జెప్పెను - గోఱజంబుఁ గోరోజనము - అనఁగాఁ జేతికట్లను - చమరవాలంబులఁ - సవరములను - బర్హిబర్హంబులఁ - నెమలిపింఛములను పరిగ్రహించియుఁ - సంగ్రహించుకొనియు - మరలి - తిరు

గువాటి - అత్తఱిన్ - ఆసమయమందు - కడిందినెత్తురుం
బ్రొద్దుగుటన్ - మిక్కుటమైననెత్తురు గ్రమ్మించు ప్రొద్దుకాఁ
గా - అనఁగామధ్యాహ్నసమయముకాఁగా - వెఱచఱ
వన్ - భయముఁబొందునట్లుగా - చఱవన్ - కొట్టఁగా - పే
దుపెనుముడ్లన్ - పందుపందియొక్క - గొప్పకంటకముల
చేత - పంట్లసరియలు - దంతములసందులు - నెఱియలువా
ఱి - నెత్తురులువిచ్చి * భోరనంగారు - భోరుమనఁ స్రవించు *
ధారాళరుధిరాసారబూరంబున్ - ధారాళ - అడ్డములేకుం
డనుండు - రుధిరాసారబూరంబున్ - రక్తధారాప్రవాహ
మును - నాకినాకినాలుకలుదిగవైచి - మఱియు లేహనముఁ
జేసి - జిహ్వలు వేలవేసి - పదిన - అతిశయించుచున్న - మ
హాదాతపోష్ణంబునన్ - పెద్దయెండ వేఁడిమిచేత - తృష్ణవొ
డమి - దాహముపుట్టి - దగనిగుండన్ - దపించుచుండఁగా *
వగరడరి - రొజుపుట్టి - ఒడలన్ - శరీరమందును - తొడలన్ - ఊరు
వులయందును - మెడలన్ - కంఠములమీఁదను - బెడిదంపు - కఠి
నములైన - నిడుదకోఱలన్ - పొడుగుదంష్ట్రలచేత - సలుగుల
డఁచిన - పందులుకొట్టిన - ఎడలన్ - స్థలములయందు - బొడబొ
డను వెడలెడు - బొడబొడఁగారుచున్న - ఉడుకునెత్తుటన్ - వే
డినెత్తురుచేత - ఇచ్చటమిగులనెండచేత దేహమంతఁగాఁ
గియున్నదిగనుకలోపలినెత్తురునుగాఁగి వేఁడిగానున్నదని
భావము - బడలితూలు - శ్రమనుబొందినిలువలేకుండ - క్షీ
ణించుచున్న - కౌలేయమ్ముల - కుక్కలయొక్క - అంగ
మ్ములు - దేహములు - ఆర్ద్రకర్పటంబులంగప్పి - తడిగవి
సెనగుడ్డలచేతమూసి - దప్పినిగుడన్ - దాహమతిశయిం
చుచునుండఁగా - అప్పాలంబు - అస్థలముయొక్క - పచ్చి
చపుకెండనుండు - పడమటిదిక్కునున్న - వెండికొండబం
డలన్ - కైలాసపర్వతముయొక్క - పెద్దపెద్దఱాళ్లసందు
న - చండకరకరహిండనంబునన్ - చండకర - సూర్యునియొ
క్క - కరహిండనంబునన్ - కిరణవ్యాప్తిచేత - పాండు
ప్రభలునిండి - తెల్లనికాంతులుసంపూర్ణమై - పఱచు - ప్రవ
హించుచున్న - తఱచుసెలయేరుల - విస్తారమైనగిరినదు
లయొక్కనూతెలంగారుకొను - పార్శ్వములయందునల్లగా
దట్టమాచున్న * భూరుహానికాయంబులన్ - చెట్లగుంపులను -
ఛాయంజని - సమీపింపఁబోయి - తద్ఘనచ్ఛాయనిలిచి -
లేత - అవ్వతుములయొక్క - ఘనచ్ఛాయనిలిచి - గొప్ప

నీడయందునిలిచి - అచ్చటంగ్రొచ్చి - ఆక్కడదిగి - గరువు
నేలలన్ - గరపభూములయందు - గుంటలొనరించి - గుం
తలుచేసి - లోనమ్మగిలి - లోపలనావిరిపట్టినప్పుడు - గ
బ్బువలవని - చెడువాసనగొట్టకుండనుండు - కమ్మతావులు
గల - మంచివాసనలుగలిగిన - నావుదాకులువఱచి - నావ్రా
కులనునాకులు గుంటలలోఁబఱచి - ఎఱచిలోపౌలేటి -
మాంసములోమంచిమంచిదియేర్పఱచి - కారిజమున్ - వ
పను - కండనగాయన్ - గుండెకాయను - క్రొవ్వున్ - మ
దసారమును - మొనలగు - మొదలైన - మిగులమెత్తని - మి
క్కిలిమృదువైన - పలలభిత్తంబులు - మాంసఖండములు
అందుగ్రందుకొనంగ్రుక్కి - ఆగుంటలోబిగ్గగానుండునట్టుగ
సవరించిపెట్టి - ఎక్కువదక్కువలుగాకుండన్ - న్యూనాధిక్య
ములుగాకుండను - కండగల - కండగలిగిన - తింత్రిణీశలాటు
సంఘాతంబులు - తింత్రిణీశలాటు - చింతకాయలయొక్కసం
ఘాతంబులు - గుంపులు - ఆమీఁదనెఱయంబఱచి - ఆమాం
సఖండములమీఁదఁగలయఁబఱపి - ఎసరుగాన్ - ఎసరునీరగు
నట్లుగా - తేటలగుతేఱియుండు - తేఁడినల్లులు - తేఁడినెత్తురులు
క్రుమ్మరించి - కుమ్మరించి - లవణకణసంచయంబునించి - ఉ
ప్పుసరిపడఁబోసి - లావుగాఁగావుఁగప్పి - బలముగానా
గుంటలమీఁదికావుగప్పి। అనఁగాఁబైననాకులువేసియూ
పైనిమన్నుఁగప్పి - ఉపరిప్రదేశంబులన్ - ఆకావులమీఁద
కారెనుపపెంటపట్లన్ - అడవిదొనములుపేఁడవేయుచో
ట్లను - నీరారునేరుఁబిడకలన్ - ఎండియుండునెఱ్ఱలువినపి
డకలచేత - సనఁగాఁగరీషములచేతననుట - దాళ్లిడి - దాళ్ల
వేసి। పిడకయంత్రమువేసియనుట - నెల్లికొయ్యలుద్రచ్చి -
ఉశిరికకఱ్ఱలుమథించి - నుచ్చులంటించినన్ - చింపిగుడ్డలం
టించఁగా। ఎరువు - పిడకపొడిమొదలయినవనికొందరుచె
ప్పుదురు - పెచ్చువెరుఁగు - రగులుకొన్న - చిచ్చులు - నిప్పులు
ఆత్రంపులందపిలించి - ఆసాళ్లలోనంటించి - చిముడనుడికినన్।
మెత్తకాఁబచనమైనపిమ్మట - వెలువరించి - బయటికిఁదీసి - ఆ
ఘవెప్పనుంగల - పచ్చివెచ్చగానున్న * అప్పిశితఖండంబు
లు - ఆమాంసపుతునకలు - కనగనననిప్పులన్ - కనగనలాడు
నంగారములమీఁద - చమురువిప్పిలన్ - చమురుపైకివచ్చు
నట్టుగా - కాల్చివకమ్మకఱకుట్లన్। ఇచ్చటఁగఱకుట్లనఁగా
శూలమువంటియినుపకఱ్ఱు। మసాలావేసినమాంసపు

నిచేతన్ - ఏవ్యాసచేత - ఏమాయనో - ఏమిసంభవించెనో అనుచున్ - అనుకొనుచు - అచటనీక్షించుతఱిన్ - ఆశ్చర్యమునఁ జూచుచుండు నెడ॥ ౧౦౩

శా॥ మట్టెల్ మ్రోయఁగఁ గబ్బిచన్నుఁగవ కంపంబంద వేణీభరం। బట్టిట్టై కటిఁ జిక్కి వీఁకటులుగా నశ్రుప్రజం
బోడికల్ గట్టం జూపులు చిమ్మిరేఁగి దివి రోలంబాళి గల్పింపఁగా। మిట్టాడంగ నరుండు లేని యడవిన్ మీనాక్షి
దీనాకృతిన్॥
౧౦౪

టీక॥ మట్టెల్ మ్రోయఁగన్ - కాళ్లమెట్టెలుధ్వనించఁగా గబ్బిచన్నుఁగవ - కదలనిచనుదోయి - కంపంబందన్ - చలించఁగా - వేణీభరంబు - గొప్పదియయినజడ - అట్టిట్టై - వీడిపోయి - కటిఁజిక్కి వీఁకటులుగాన్ - పిరుదుమీఁదఁగా రుచిఁకటివలెఁ గ్రమ్మఁగా - అశ్రుప్రజంబు - బాష్పసమూహము - అనఁగాఁ గన్నీళ్లు - ఓడికల్గట్టన్ - ఎడతెగకుండఁ బ్రవహింపఁగా - చూపులు చిమ్మిరేఁగి - దృష్టులువిడివడి- దివిన్ - ఊర్ధ్వభాగమందు - రోలంబాళిన్ - తుమ్మెదగుంపును - కల్పింపఁగాన్ - పుట్టించఁగా - మిట్టాడంగన్ - పల్కరించుటకు - నరుండు లేని - మనుష్యుఁడు లేని - అడవిన్ అరణ్యమందు - మీనాక్షి - చేఁపవంటి నేత్రములుగల యొకానొక స్త్రీ* దీనాకృతిన్ - దీనత్వము చేత— ముందరిపద్యములోఁ గ్రియాపదము॥ ౧౦౪

క॥ ఒక్కతె భయశోకమ్ముల। వెక్కుచు మెయిగల విలాసవిభ్రమము లుక్కుల్। తక్కుటయును నొకరాజుపై
నెక్కొన ధరణీశు నెదుట నిలిచి వినీతిన్॥
౧౦౫

టీక॥ ఒక్కతె - ఒంటరిత - భయశోకంబుల - భీతిచేతను దుఃఖముచేతను - వెక్కుచున్ - వెక్కివెక్కియేడ్చుచును* మెయిగల - శరీరమందుగలిగిన - విలాసవిభ్రమము లుక్కుల్ - శృంగారక్రియలయొక్క శోభలు - తక్కుటయున్ - లేకపోవుటయును - ఒకరాజుపై - ఒకవిలాసమేయయి - నెక్కొనన్ - ప్రకాశించఁగా ధరణీశు నెదుటన్ - రాజైనస్వరోచిముందర - నిలిచి నిలిచినదై *వినీతిన్ - వినయముచేత॥ ౧౦౫

క॥ పలుచనివాతెఱ మెరుఁగునఁ। బలుమెరుఁగులు సందడింపఁ బాపటపైనం। జలిఁ జేర్చి జళుకుఁ జూపులఁ। బ
లుకులఁ బులకండ మొలుకఁ బలికెం గలఁకన్॥
౧౦౬

టీక॥ పలుచనివాతెఱ - సన్నపుపెదవియొక్క - మెరుఁగునన్ - ఎఱ్ఱనికాంతియందు - పలుమెరుఁగులు - దంతములయొక్క కాంతులు - సందడింపన్ - ఒత్తుచుండఁగా - పాపటపైన్ - సీమంతముమీఁద - అంజలిఁ జేర్చి - దోసిలి పట్టుకొని - జళుకుఁ జూపులన్ - భయముతోఁగూడిన చూపులచేత - పలుకులన్ - మాటలయందు - పులకండ మొలుకన్ - కండచక్కెర చిందునట్టుగా - కలఁకన్ - కలఁతతోడ - పలికెన్ - ఒకవాక్యము పలికెను — అనఁగా స్త్రీ స్వరోచితో మధురవాక్యములు పలికెనని తాత్పర్యము. ౧౦౬

శా॥ ఓ రాజన్యమహేంద్ర రత్నమణిగణప్రోతాసివాతాశన। ప్రాజ్యత్కటిచక్ర యోముఖరశార్ఙ్గక్రూ
రబాహార్గళా। మేరుక్ష్మాచలకల్ప ... కవచితవ్యూఢాంగ కావంగదే। యోరాహుత్తశిరోమణీ నిరవధి
ప్రోద్యత్ప్రతాపారణీ॥
౧౦౭

టీక॥ ఓరాజన్యమహేంద్ర - ఓపట్టాభిషిక్తశ్రేష్ఠుఁడా - ఓమణి...చక్ర - మణిగణప్రోత - రత్నసమూహముల చేతఁగూర్చఁబడిన - అసివాతాశన - సర్పమువంటిఖడ్గముచేత - ప్రారజ్యత్ - ప్రకాశించుచున్న - కటిచక్ర - ఓబండ్లవంటి పిరుదులుగలవాఁడా - ఓముఖరశార్ఙ్గ క్రూరబాహార్గళా* ముఖర - మ్రోయుచున్న - శార్ఙ్గ - సింగిణీవింటితోఁ గూడుకొనిన - క్రూర - కఠినమయిన - బాహార్గళా - గడియవంటిభుజములుగలవాఁడా - ఓమేరుక్ష్మాచలకల్ప - సువర్ణపర్వతముయినమేరువుతోడ సమానమయినవాఁడా - ఇద్ధపటద్ధైర్యము మొదలయిన వానియందు భావము - ఓ...కవచిత వ్యూఢాంగ - కవచిత - కవచముగలవై - వ్యూఢాంగ - బలసియుండునవయవములుగలవాఁడా - ఓరాహుత్తశిరోమణీ - పరాక్రమవంతులయినరవుతులలో శిఖామణివైనవాఁడా - నిరవధి ప్రోద్యత్ప్రతాపారణీ నిరవధి - అంతములేని* ప్రోద్యత్ - ప్రకాశించుచున్న - ప్రతాప - పరాక్రమమను నగ్నికి - అరణీ - నిప్పులుపుట్టించుకట్టెవంటివాఁడా - కావంగదే - రక్షించఁగదవే॥ ౧౦౭

క॥ అనినఁ దలంపున నింపిన । యనుకంప నిలింపచంపకామోదసుతుం । డనునయ మొప్పఁగ నోడకు । మని
నిజవృత్తాంత ముడుగ నది యిట్లనియెన్॥ ౧౦౮

టీక ॥ అనినన్ - అనిపలుకఁగా - తలంపునన్ - అంతఃకరణమందు - నింపిన - నిండించిన - అనుకంపన్ - దయచేత - నిలింపచంపకామోదసుతుండు - నిలింపచంపకామోద - సంపంగిపువ్వువంటి పరిమళముగల దేవతాస్త్రీ యొక్క - సుతుండు - కుమారుఁడు - అనఁగా స్వరోచి - అనునయ మొప్పఁగన్ - ఆదరణ మొప్పఁగా - ఓడకుమని - భయింపవద్దుమని - నిజవృత్తాంతము అడుగన్ - తనవర్తమానము ప్రశ్నచేయఁగా - అది యిట్లనియెన్ - ఆ స్త్రీ యీతీరున బలికెను॥

సీ॥ విసమానములు గాఁగ వసతోడఁ జెనవెట్టి । నెట్టెంబుగాఁ గ్రేవుఁ జుట్టినాఁడు । బండికందెనచాయ బైసి
మాలినమేన । మెదడుగంధపురొంపి మెత్తినాఁడు । కనఖంపు డాచేతిపుఱ్ఱెకప్పెర నిండఁ । బ్రాణికోటుల నె
ల్లఁబట్టినాఁడు । కొంకిబికివేసంపు గూనిమూపులమీఁద - మూఁడుపంగలయీఁటె మోపినాఁడు॥౧౦౯॥ తే॥ ని
ట్టతాడనఁ బొడవుచే నిక్కినాఁడు । నిడుదకోఱల మిడిగ్రుడ్ల నెగడినాఁడు । నరవరోత్తమ నేఁడు మూన్నాళ్ల
నుండి । యసురు గొన వెంటఁదిరిగెడు నసురయొకఁడు॥ ౧౧౦

టీక ॥ విసమానములు గాఁగన్ - హెచ్చుతక్కువలు గా - వసతోఁడ బెనవెట్టి - క్రొవ్వుపొరతోఁ గూడఁ జెనవేసి - నెట్టెంబుగాన్ - నైతిచుట్టగా - క్రేవుఁ జుట్టునాఁడు - ప్రేగును జుట్టుకొన్నాఁడు - బండికందెనచాయన్ - చక్రపునిరుసుకు వేయుకందెనచమురుచాయగా - బైసిమాలినమేనన్ - భవిష్యహానియైన దేహమందు - మెదడు - మస్తిష్కమును - గంధపురొంపి - గంధపుబురదం మెత్తినాఁడు - పూసుకొన్నాఁడు - కనఖంపు - పుప్పిగోళ్లుగల - డాచేతి - ఎడమచేతనున్న - పుఱ్ఱెకప్పెరనిండన్ - పుఱ్ఱెలోఁ బూర్ణమగునట్టుగా - ప్రాణికోటుల నెల్లన్ - జంతుసంతానమునంతయు - పట్టినాఁడు - నింపినాఁడు - కొంకిబికివేసంపు - వికారపువేషము గలిగిన - గూనిమూపులమీఁదన్ - వంగినభుజశిరములపైని మూఁడుపంగలయీఁటెన్ - త్రిశూలమును - మోపినాఁడు నిలిపినాఁడు - నిట్టతాడనన్ - నిలిచిన తాటిచెట్టునట్టుగా - పొడవుచేన్ - ఔన్నత్యముచేత - నిక్కినాఁడు - నిట్టఁబొడుచుకొనియున్నాఁడు - నిడుదకోఱలన్ - పొడుగైన దంష్ట్రలచేతను - మిడిగ్రుడ్లన్ - ఉన్నేత్రములచేతను - నెగడినాఁడు - ఒప్పినాఁడు - నరవరోత్తమ - ఓ రాజశ్రేష్ఠుఁడా - అసురయొకఁడు - ఇట్టి రాక్షసుఁడొకఁడు - నేఁడు మూన్నాళ్లనుండి - నేఁటికి మూఁడు దినములనుండి - ఉసురుగొనన్ - నాప్రాణమును బుచ్చుకొనుటకొఱకు - వెంటఁదిరిగెడున్ - వెంట వెంటఁదిరుగుచున్నాఁడు॥ ౧౧౨

క॥ ఏమొడ ననదల మొఱ వా । లాయము వినవలయు దుర్బలస్య బలం రా । జా యన వినవే ధరణీ । నాయకులకు
నార్తరక్షణంబులె క్రతువుల్॥ ౧౧౧

టీక ॥ ఏమొడన్ - ఎక్కడనుండు - అనదల మొఱ - దిక్కులేని వాండ్ర మొఱ - వాలాయము - అవశ్యము - వినవలయున్ - ఆలకించవలసినది - దుర్బలస్య - బలములేనివానికి - బలం - బలము - రాజా యనన్ - రాజని యనఁగా - వినవే - వినలేదా - ధరణీనాయకులకున్ - రాజులకు - ఆర్తరక్షణంబులె - ఆపన్నుల నురక్షించుటయే - క్రతువులు - యజ్ఞములు - అనఁగా నాపదను బొందినవారిని రక్షించినటులయిన సమస్తయజ్ఞములు చేసినఫలము సిద్ధించుచున్నదనుట॥ ౧౧౪

క॥ మరుదశ్వపుత్రికిఁ నిం । దీవరాక్షగంధర్వరాజువలనఁ బొడమితి । న్నరవర వెలసితిఁ గళలం । దు రమించుటఁ
జేసి - భువి మనోరమ యనఁగన్॥ ౧౧౩

టీక ॥ మరుదశ్వపుత్రికిన్ - మరుదశ్వుఁడనువానికొమార్తెకు - ఇందీవరాక్షగంధర్వరాజువలనన్ - ఇందీవరాక్షు ఇందీవరాక్షుఁడను - గంధర్వరాజువలనన్ - గంధర్వప్రభువువలన - పొడమితిన్ - జన్మించితిని - నరవర - ఓయి రాజా - కళలందున్ - సమస్తవిద్యలయందును - రమించుటఁ జేసి - క్రీడించుటచేత - భువిన్ - భూమియందు - మనోరమ యనఁగన్ - మనోరమయనునట్టుగా - వెలసితిన్ - ప్రకాశించితిని - అనఁగాఁ దనపేరు మనోరమ యనుట॥ ౧౧౫

శా॥ తారాపిల్లభుజాంగదంబుల మణుల్ తాలంగ విద్యాధరుల్ । గారా మొప్పఁగ నెత్తికొండ్రు ననునంక

టీ॥ ఊసరవెల్లిచందమునన్ - ముదిసినతొండవలె - ఒక్కటన్ - ఒకతీరుగా - బీటలుగాలు దేఱంగాన్ - తుప్పిఱ్ఱంచిసరములు త్రాళ్లవలెఁ బెకిలి నుపించఁగా - మీసలు - మీసములును - గడ్డమునన్ - చిబుకమును - జడలున్ - జడలును - మేనున్ - శరీరమును - ఉదరంబున్ - కడుపును - పీనులున్ - చెవులును - జరాధూసరమైన - ముదిమిచేతఁగొంచెము తెలుపు గలిగిన - రోమతతితోన్ - వెంట్రుకలగుంపుతోడ - అనఁగా నెఱిసిన వెంట్రుకలతోననుట - పెనఁగంబడి - పెనవేసికొని - దూది - తూలము - రాశిగాఁ జేసినరీతినున్న - కుప్పగాఁ జేసినట్లున్న - ఒక జీర్ణమునింగని - ఒకపురాతనుఁడైన ఋషిని జూచి - కౌతుకంబునన్ - వేడుకచేత — ముందరిపద్యములోఁ గ్రియాపదము॥ ౧౧౬

ఆ॥ ఇతనివదనకుహరమెద్ది నేత్రద్వయం। బెద్దికర్ణయుగళి యెద్దియనుచు। బూచి నోలెనున్న వాచంయముని మోము। బాల్యచాపలమునఁ బట్టుటయును॥ ౧౧౭

టీ॥ ఇతని - ఈఋషియొక్క - వదనకుహరమెద్ది - నోరేది - నేత్రద్వయంబెద్ది - కన్నులు రెండును నేవి - కర్ణయుగళి యెద్ది - చెవులు రెండేవి - అనుచున్ - అనియనుచు - బూచివోలె నున్న - భూతమువలెనున్న - వాచంయముని మోము - మునీశ్వరుని ముఖము బాల్యచాపలమునన్ - చిన్నతనపుచాపల్యముచేత - పట్టుటయున్ - పట్టుకొనఁగా॥ ౧౧౭

క॥ ధ్యానస్తిమితుఁడగుచ। న్మౌనిమదీయాంగుళీవిమర్శనములచే। మే నెఱిఁగి తొంటియనుసంధానము చెడి కన్నుఁదెఱచి దారుణఫణితిన్॥ ౧౧౮

టీ॥ ధ్యానస్తిమితుండగు - ధ్యానయోగమందు నిశ్చలుఁడైన - ఆమ్మౌని - ఆమునీశ్వరుఁడు - మదీయాంగుళీవిమర్శనములచేన్ - నావ్రేళ్ల తాఁకుడులచేత - మేనెఱిఁగి - స్మృతిదెలిసి - తొంటి - పూర్వము గలి - అనుసంధానము చెడి - ధ్యానసమాధి చెడి - కన్నుఁదెఱచి - నేత్రములువిప్పి। దారుణఫణితిన్। అత్యాగ్రహముగా॥ ౧౧౮

ఉ॥ ఓసిదురాత్మురాలగృహమొల్లక సర్వసుఖమ్ములన్నిరా। యాసమునందొలంగి మిహిరాంశుమరుచ్ఛదనీరనీరస। గ్రాసము దేహధారకముగా గుహలందపమాచరించు మ। మ్మీసరణిం జరించినగ నేమిఫలం బొనగూడెఁ జెప్పుమా॥ ౧౨౦

టీక - ఓసిదురాత్మురాల - ఓసిదుస్స్వభావముగలదానా - గృహమొల్లక - ఇల్లుసరకుగొనక - సర్వసుఖమ్ములన్ - సమస్తభోగములను - నిరాయాసమునన్ - అనాయాసముగా - తొలంగి - విడిచిపెట్టి - మిహిరాంశుమరుచ్ఛదనీరనీరసగ్రాసము - మిహిరాంశు - సూర్యకిరణములును - మరుత్ - వాయువును - ఛద - ఆకులును నీర - నీళ్లునునయిన నీరసగ్రాసము - నిస్సారపునాహారము - దేహధారకముగాన్ - శరీరమునునిలుపునదియవుచుండఁగా - గుహలన్ - కొండగవులలో - తపమాచరించుమమ్మున్ - తపస్సు చేసుకొనుమమ్మును - ఈసరణిం జరించి - ఈరీతిగాఁదిరిగి - నగన్ - ఆపహాస్యముఁ జేసినందున। ఏమిఫలంబొనగూడెన్। ఏమిలాభము సిద్ధించెను - చెప్పుమా - వచింపుమా॥ ౧౨౦

క॥ తిమిరంపువయసుగుబ్బల। కొమరాలవు నీకుఁదగినగోవాళ్లమహిన్। నెమకినగరాదె ముదిసిన। వమునఁ జెనకిన నేమిగలదు మద మేమిటికిన్॥ ౧౨౧

టీక॥ తిమిరంపు - పొగరుగలిగిన - వయసుగుబ్బల। ప్రాయపుచన్నులుగల - కొమరాలవు - పడుచుదానవు - నీకుఁదగిన - నీకుననురూపమయిన - గోవాళ్లన్ - విటకాండ్రను - మహిన్ - భూమియందు - నెమకి - వెదకి - నగరాదె। వారితోనవ్వరాదా। ముదిసినవమున్। ముసలివాండ్రమైనమమ్మును। చెనకినన్। తగులఁగా। ఏమిగలదు। ఏమిలాభమున్నది। మద మేమిటికిన్। ఇంతయహంకారము పనికిరాదు॥ ౧౨౧

క॥ ముసుగుకొను జరభరంబున। ససుససురై యున్నమమ్ము నడకించితివి। ట్లుసుసుమనఁ జుట్టువడమొక। యసురకునీవనుచుఁ బలికె నాగ్రహ మెసఁగన్॥ ౧౨౨

టీక॥ ముసుగుకొన। క్రమ్ముకొన్న। జరభరంబునన్। జర। ముదిమియొక్క। భరంబునన్। బరువుచేత। ససుససురై యున్న

పోవునట్లు - నడవఁగఁ బ్రవర్తించఁగా - దైవంబటమీఁదఁ - దానిమీఁద దైవము - మేలు తానఘటించుఁ - తనకుఁదానే శుభములుగలుగఁజేయును॥

సీ॥ బుద్ధీంద్రియక్షోభ ములకుఁ జెట్టనికోట। విపదంబురాశిదుర్వికృతికోడ। ఖలదురాలాపమార్గణవజ్ర కవచంబు। రణమహీస్థలికి శ్రీరామరక్ష। శాత్రవదుర్గర్వసంస్తంభనౌషధి। మొనయు చింతాశ్రేణి మూకవిప్పు। యోగాదిసంసిద్ధులొనగూర్చు పెన్నిధి। తూలునే కాకుంట తోడునీడ॥ తే॥ సకలసుగుణ ప్రధానంబు సకలకార్య॥ జాలసాఫల్యకరణైకసాధనంబు। ధైర్యగుణమట్టి ధైర్యంబుదక్కి పోరఁ। దత్తజింతురె యొకట మీతరము వారు॥ ౧౪౯

టీక॥ ధైర్యగుణము- తొందరపడనిగుణము। అనఁగా ధైర్యము - ఎట్టిదనఁగా- బుద్ధీంద్రియక్షోభములకుఁ- బుద్ధీంద్రియ। మతియొక్కయు నేత్రములు మొదలైన వానియొక్కయు - క్షోభములకుఁ - వైకల్యములకు - అనఁగాఁ గలఁతలకు - జెట్టనికోట - జెట్టనుండ నేర్పడిన ప్రాకారము వంటిదియు। అనఁగాఁ జొరనీయదనిభావము - విపదంబు రాశిదుర్వికృతికిఁ- విపత్ । ఆపదయను। అంబురాశి। సముద్రముయొక్క। దుర్వికృతికిఁ। దుష్టమైనవికారమునకు - అనఁగా నుపద్రవమునకు - కోడ - నావవంటిదియు - ఖలదురాలాపమార్గణవజ్రకవచంబు- ఖల। పాపాత్ములయొక్క - దురాలాప। దుర్మార్గపుమాటలను। మార్గణ। బాణములకు। వజ్రకవచంబు। ఉక్కుతీఁగలు కూర్చి చేసినకంకటము। వజ్రాయుధమువంటికవచమనికొందఱు। తాఁకనీయనిదనుట- రణమహీస్థలికిఁ। యుద్ధభూమికి - శ్రీరామరక్ష - శ్రీరాముల కాఁపువంటిదియు - శాత్రవదుర్గర్వసంస్తంభనౌషధి- శాత్రవ- శత్రువులయొక్క। దుర్గర్వ। దుష్టమైనదర్పమునకు। సంస్తంభనౌషధి - నిలువఁగట్టువనమూలికవంటిదియు - అనగా సాఁగనీయదనుట- మొనయు క్రమ్ముకొను - చింతాశ్రేణి- విచారములయొక్క పఙ్క్తికి మూకవిప్పు- గుంపుచెడఁగొట్టునదియు - యోగాది- యోగము మొదలైనవానియొక్క - సంసిద్ధులొనగూర్చు - సంప్రాప్తులనుగలుగఁజేసెడు- పెన్నిధి- పెద్దధనరాశివంటిదియు - తూలునే కాకుల దార్ఢ్యము లేకపోలిపోవుకొంటరిగాండ్రకు- తోడునీడ - సహాయమైనదియు - సకలసుగుణప్రధానంబు- సమస్తగుణములలో ముఖ్యమైనదియు - సకలకార్యజాలసాఫల్యకరణైకసాధనంబు- సకలకార్యజాల- సమస్తమైనప్రయోజనసమూహములయొక్క - సాఫల్యకరణ- సంసిద్ధిఁజేయుటయందు- ఏకసాధనంబు- ముఖ్యసాధనమైనదియు - అట్టిధైర్యంబుదక్కి- కాఁబట్టియట్టిధీరత్వమును విడిచిపెట్టి - పోరఁ - యుద్ధమందు- ఒకట-ఆయ్యయో - మీతరమువారు- మీవంటివారు। తత్తజింతురె- తొందరపడుదురా - అనఁగాఁగూడదనుట॥ ౧౪౯

క॥ అని తెలిపి తిరుగుఁడనుటయు। మనమున లజ్జించి యెటుకుమన్నీలిఁక నీ। జనపతితో డిదలోకం। బనితమతమ మొనలు ద్రిప్పి రవియు నుదిరిగెఁ॥ ౧౫౦

టీక॥ అని తెలిపి - ఈ ప్రకారముగాఁ దెలియఁజెప్పి - తిరుగుఁడనుటయుఁ - మరలుఁడనియనఁగా- మనమున లజ్జించి - మనస్సున సిగ్గుపడి - ఎఱుకుమన్నీలు చెంచుమన్నెగాండ్రు - ఇఁక నీజనపతితో డిదలోకంబని - ఇఁక మీఁద నీరాజుతోఁ బాటి వారమని - తమతమ మొనలు ద్రిప్పిరి - తమతమ గుంపులను మరలించిరి - అవియునుదిరిగెఁ - ఆ గుంపులును మరలెను॥ ౧౫౦

వ॥ ఇట్లు తిరిగి యుక్కెక్కిరక్కసుండెక్కెక్కడన యక్కూటబలంబులగుడంబులు గటార్లు నీఁటెలు పందీఁటెలు విండ్లు గండ్రగొడ్డండ్లుఁ జిల్లకోలలుఁ బంట్రకోలలు మెఱయ రయసముద్ధూతధూళిధూసరితధారాధర పథంబగుచు నొక్కపరియ చీమపరియనంగ విచ్చెసంతు॥ ౧౫౧

టీక॥ ఇట్లు తిరిగి - ఈ ప్రకారముగా మరలి - ఉక్కెక్కి - పరాక్రమమువహించి - రక్కసుండెక్కడెక్కడనని- రాక్షసుఁడెక్కడెక్కడనని యనుచు - అక్కూటబలంబు - ఆకిరాతసైన్యము - లగుడంబులు- దుడ్డుకఱ్ఱలును- కటార్లును కరాసులను - ఈఁటెలు - కుంతములును- పందీఁటెలు-పందిబల్లెములును - విండ్లు - ధనుస్సులును - గండ్రగొడ్డండ్లుఁ చంద్రవంకలవలెఁగత్తులుండు పరశువులును - జిల్లకోలలు - భిండివాలములును - పంట్రకోలలు - మొనగలయినుపకఱ్ఱలును - మెఱయుఁ - ప్రకాశింపఁగా - రయ - వేగముచేత సముద్ధూత - మిక్కిలి మొగరఁగొట్టఁబడిన - ధూళిధూసరిత - దుమ్ముచేతఁ గొంచెము తెల్లవర్ణముగాఁజే

యంబడిన । ధారాధరపథంబగుచున్ - ఆకాశముగలదగుచును - ఒక్కపరియ - ఒక్కసారిగానే - చీమపరియనన్ - చీమగుంపోయెనునట్టుగా - కపిసేనన్ - ఆక్రమించెను - అరాదుల - ఆసేనయందు॥ ౧౫౧

మ॥ శరసంధానముతోనె కొన్నియడుగుల్ జౌజవ్వనంబాఱియుం । ధ్ధరణిం గాల్గొనఁ ద్రోణముల్ దివియుదోర్దండంబులం జేఁదియే । సిరిబోయల్ దినుమంచునార్చి పరగం జిట్టాసలం డాయుచుం । గొరవంకల్ మొఱవెట్టినట్లు గుణముల్ ఘోషింప రోషింపుచున్॥ ౧౫౨

టీక ॥ బోయలు కిరాతులు - రోషింపుచున్ - కోపగించుచును - శరసంధానముతోనె బాణములుకూర్చుటతోడనే - కొన్నియడుగులు - కొన్నియంగలపెట్టు - జౌజవ్వనంబాఱి - జవజవలాడునట్టుపఱుగెత్తి - అధ్ధరణిం గాల్గొని - ఆభూమిలోఁ గాలునిలిపి - ద్రోణములుదివియు - గుబ్బవింట్లుత్రీసిన - అనఁగా విలువిద్యనేర్చిన - దోర్దండంబులన్ - భుజదండములచేత - గొరవంకలు - గోరంకులు - అనఁగా శారికలు - మొఱవెట్టినట్లు రొదచేసినట్టుగా - గుణములు - అల్లెత్రాళ్లు - ఘోషింపన్ - మ్రోయఁగా - పరగన్ - ఒప్పునట్టుగా - చిట్టాసలం డాయుచున్ పొదలమాటునఁ దారసిల్లుచును - తినుమంచు నార్చి - ఇదిగో బాణములను భక్షించుమని - ఆర్చి - సింహనాదముచేసి - చేఁదియే - పిఱిఁ - లాఁగి బాణములను వేసినవారైరి॥ ౧౫౨

తే ॥ ఆశరావళి నమ్మనుజాశనుండు । లీలమృగదంశకము మశకాలినొడిసి । చప్పరించువిధంబున శాతదీర్ఘ-దంష్ట్రికలఁ జప్పళించి రౌద్రమునఁ గెరలి॥ ౧౫౩

టీక । ఆశరావళిన్ - ఆబాణపఙ్క్తిని - అమ్మనుజాశనుండు - ఆరాక్షసుఁడు - లీలన్ - విలాసమాత్రముగా - మృగదంశకము - శునకము - మశకాలినొడిసి - దోమలగుంపును హత్తుగాఁబట్టి - చప్పరించువిధంబునన్ - చప్పరించునట్టుగా - శాత - వాడిగలిగిన - దీర్ఘ - పొడవైన - దంష్ట్రికలన్ - కోఱలచేత - చప్పళించి - నమలి - రౌద్రమునఁ గెరలి - శౌర్యముచేత రోషించి - పైపద్యముతో నన్వయించుకొనునది॥

సీ ॥ గళితశృంఖలమైన గంధనాగమువోలెఁ బ్రజలపైఁ జేరేపుల్ వాఱిపాఱి । కలశాబ్ధిమథియించు కైటభాంతకులీల - జవమొప్పఁ జేతులు సాఁచిసాఁచి । కనలూను కీనాశకాసరమ్మునుబోలెఁ గవిసితట్టువగుంపుఁ జపిరిచవిరి । యమృతాపహరణార్థ మురుగపక్షిస్వామి । గతిఁ బులిందశ్రేణిఁ గమిచికమిచి ॥ తే ॥ సెలవులుబిగించి నేత్రదంష్ట్రికలు మెఱయ । నిడుదమొగమెత్తి మీసల నెత్తురొలుకఁ । బటపటఁ గపాలపఙ్క్తులఁ బగులఁ గొఱికి । బలములెల్లను గడియలోపల నమ్రింగె ౧౫౪

టీక ॥ గళితశృంఖలమైన - జాఱిపోయిన సంకెలలుగలిగిన గంధనాగమువోలెన్ - మదపుటేనుఁగువలె - ప్రజలపైన్ - జనులమీఁదికి - పేరేపుల్ వాఱిపాఱి - మఱిమఱిపఱుగులెత్తియు - కలశాబ్ధిమథియించు - క్షీరసముద్రముతఱచునట్టి - కైటభాంతకులీలన్ - శ్రీవిష్ణుమూర్తివలె - జవమొప్పన్ - వేగముమరునట్టుగా - చేతులుసాఁచిసాఁచి - మఱిమఱిహస్తములుచాఁపియు - కనలూను - రోషమునువహించిన - కీనాశకాసరమ్మునుబోలెన్ - కీనాశ - యమధర్మరాజుసంబంధమైన - కాసరమ్మునుబోలెన్ - దున్నపోతువలె - కవిసి తారసించి - తట్టువగుంపున్ - గుఱ్ఱపుపౌఁజును - చవిరిచవిరి జపిరికొట్టియు - అమృతాపహరణార్థము - సుధనుగ్రహించుని మిత్తముగా - ఉరుగపక్షిస్వామిగతిన్ - పోవుచునుండు గరుత్మంతునివలె - పులిందశ్రేణిన్ - కిరాతులగుంపును - కమిచికమిచి - మఱిమఱికబళించియు - ఈకథయాదిపర్వమునఁ జూచుకొనవలసినది - సెలవులుబిగించి - చెవిచెలువుబిగించి బట్టి - నేత్రదంష్ట్రికలు మెఱయన్ - కన్నులును కోఱలును మెఱయునట్టుగా - నిడుదమొగమెత్తి - పొడుగుగానుండు ముఖముపైకెత్తి - మీసలనెత్తురొలుకన్ - మీసములలో రక్తముగుమ్మరిల్లఁగా - పటపటఁ గపాలపఙ్క్తులన్ - పటపటలాడునట్టుగాఁ దలకాయపుటెల్లను - పగులఁ గొఱికి - పగులునట్టుగాఁ గఱచి - బలములెల్లన్ - కిరాతసేనలనన్నిటిని - గడియలోపలన్ ద్రిమింగెన్ - ఘటికకాలములోఁ గబళించెను ॥ సెలవులనఁగా - సృక్కిణులు ॥ ప్రాంతావోష్ఠస్య సృక్కిణీత్యమరః॥ ౧౫౪

క ॥ ఆసమయంబున గీర్వాణసుతుఁ డయ్యెంతినొక్కనికటనికుంజా । వాసమ్మున నడిక్రమ్మఱి । వేసరి విభుఁ డాఁకెఁ దురగవేగము మెఱయన్॥ ౧౫౫

మూఁడుదిన్న యినుపయాఁకులచేత - ఏఁకులుగా వేసె - లోఁజబ్బలునాఁటునట్లుగా- గుబ్బకొలందికిందిగవైచి - అలుగుక్రిందిగుబ్బతుటుకుదిగునట్లువ్రేసి - ప్రాణమువిడిపించి - చెట్టువిడుచునట్లుచేసి - అలయించుకొని - ప్రయాసముపొంది- బయలువెడలించి - బయిటికిరప్పించి - దోషాచరుండు - రాక్షసుఁడు - పాషాణమ్ములకున్- రాళ్లకు ఎపుడెపుడువంగెన్ - ఎప్పుడెప్పుడువంగుచువచ్చునో - అప్పుడప్పుడెల్లన్ - అప్పుడప్పుడంతయు - తురంగంబునంటందోలి - గుఱ్ఱమునుగదియఁదోలి - గంటియిడి - గాయముఁదవిలించి - వెంటంబడుటయున్ - వాఁడువెంబడించఁగా- గెంటించి- తొలఁగించి - లేడుబంతియన్నయట్లు బంతిపూఛుక్కియనునట్లుగా - అలంతనుండి - కొంతదూరమునసుండి - వాగెసడలించి- కళ్లెమునువదల్చి - వేగతుపైనిగిడి- శత్రువునిమీఁదికిదాఁటించి - వాగెఁగుదియింపన్- కళ్లెముకుదియఁబట్టఁగా - ముంగాళ్లుగగనంబునకున్- ముందరికాళ్లుమీఁదనేవచ్చునట్లుగా- మగుడించి-మరలించి- అందెచప్పుడున్ - గండపెండేరపునాదమును - కింకిణీరవంబున్- మువ్వలరొయికనాదమును - ఉఱుమగిసినగతిన్-ఉఱుమయనువాద్యవిశేషమునుగిసినరీతిగా - తేఁటిమ్రోసిన క్రియన్- తుమ్మెదఝుంకారముచేసినట్లుగా- నాదాలుక-నాదమడఁగిపోక- ఏదిక్కుఁజూచినన్ - ఏవైపునఁగాంచినను- ఆదిక్కున నేవినంబడన్ - ఆవైపున నేవినఁబడునట్లుగా- ఏకడఁజూచి నందానయై- ఎచ్చటవీక్షించినమదా నేయయి- నీడయేర్పడక- ఛాయయెంతమాత్రమునునిలిచికనుపడక-పార్శ్వంబులంగట్టు- రెండువైపులంగట్టిన- కెంబట్టులాలసరి ఎఱ్ఱపట్టుజాలరు - సమకట్టు తెక్కలుగాన్ - సమూహముగాజోడించిన రెండుతెక్కలగునట్లుగా - యాతుధానుండను- రాక్షసుఁడను - కొండచిలువనోడియన్ - కొండ

పామునోడియునిమిత్తము నేలపఱవుగానాడు- నేలబాఱు తిరుగునట్టి-గరుడుడనన్- గరుత్మంతుఁడోయనునట్లుగాపొయుంచు డాయుచున్ - దూరముగాఁబోవుచును - దగ్గఱికివచ్చుచును- దవ్వులంబొలసి - దూరమునఁగనుపడి - కురంగటందోఁచి- అంతలోదగ్గిరఁగనుపడి- కురంగటయనిచూడన్ దగ్గరయనివిచారించువలెను- దవ్వులంబొలసి- అంతలోదూరమునఁగనుపడి- దవ్వుచేరువలు- దూరసమీపములు- అనిర్వాచ్యంబులుగాన్ - నిర్ధారణముచేయశక్యముగానివియవునట్లుగా-మెలంగన్- సంచరించునట్లు- తేజికాశ్వంబున్ తురకీగుఱ్ఱమును- మెలంపుచున్- నడిపించుచును - విండ్లన్- ధనుస్సుచేతను - పంట్రకోలలన్ - పంట్రకోలలనునాయుధములచేతను-అడిదంబునన్-కత్తిచేతను -అత్తలంబునన్ నేజాచేతను-ఏసియున్- బాణములుప్రయోగించియు- వ్రేసియున్- వేటులువేసియు-అడచియున్-నఱికియు - పొడిచియున్ - పొడిచియు-ఇక్కడఁగ్రమాలంకారమనివిచారించవలెను - కడపలంగానక- చివరనుగనలేక - మిడిసిపాటుండునుంగాని - మిట్టిపడిచావకుండనున్న - దానవునింజూచి రాక్షసునింగనుంగొని - వేసరి- విసికి- రోసంబునన్-రోషముచేత - వేసరియనఁగాశ్రాంతుఁడయియని॥కంచుమించు అనుశబ్దమునుగూర్చికొన్ని ప్రయోగములున్నవి - అనఁగా దశావతా ౧౦ - ౧౪౫ - మేదినీంద్రులుకంచుమించుగాఁగ - మణిమయుఁబ్రభులింగలీల - ౭ - ౫౯ - వంచనగననీకవలపించినేఁడు - కంచుమించుకఘోరకాననంబునకు- మణియువేంకటాచారిచెప్పినయవలాత్మజాపరిణయము - ౩ - ౪౯ - సీ॥ కంచుమించగనెంచునంచనెంచగసంచరించుఁబలుకులకల్కి తేనితవము - యివియన్నిచూడఁగాఁగంచుమించుఅనఁగాయథాయథలైయనితోఁచుచున్నది॥ యింకనక్కడక్కడవిచారించవలసినది॥ ౧౬౭

క॥ భూపతిపావకబాణం । బేపునసంధించితివిచి యేసిన మెయిఁగీ । లాపటలిపొదువనతఁడా । రూపంబెడ
బాసిఖేచరులువెఱఁగందన్॥ ౧౬౮

టీక॥ భూపతి- రాజైనస్వరోచి-పావకబాణంబు- ఆగ్నేయాస్త్రము - ఏపునసంధించి - ఉత్సాహముచేతవింటఁగూర్చి - తివిచి- నారినీడ్చి - ఏసినన్- వేయఁగా- మెయిన్ రాక్షసునిశరీరమును- కీలాపటలిపొదువన్-జ్వాలాసమూహము - అనఁగామంటలుకమ్ముకొనఁగా - అతఁడారూపంబెడబాసి - ఆరాక్షసుఁడాయాకారమునువిడిచిపెట్టి - ఖేచరులు - దేవతలు - వెఱఁగందన్ - ఆశ్చర్యపడున

తేస్పృగా వికసించిన తామరరేకులవంటి । ఈక్షణా । కన్నులుగలవాఁడా* ప్రాఘీయః ప్రతిభోపపత్తిణా- ప్రాఘీయః శ్రేష్ఠమైన- ప్రతిభా। అప్పటప్పటికిఁ గ్రొత్తగా వికసించుచుండు ప్రజ్ఞచేత । విచక్షణ। ప్రాజ్ఞుఁడవైనవాఁడా* త్రయీధర్మైకసంరక్షణా - త్రయీధర్మ। వేదవిహితధర్మము యొక్క। ఏకసంరక్షణా। ముఖ్యసంరక్షణముగలవాఁడా॥ శ్లో॥ స్మృత్యర్థాతీతవిషయా మతిరాగామిగోచరా । బుద్ధిస్తాత్కాలికీ జ్ఞేయా ప్రజ్ఞా త్రైకాలికీ మతా । ప్రజ్ఞాం నవనవోన్మేషశాలినీం ప్రతిభాం విదుః । శీఘ్రముగా దూరముపోయి సమాచారము చెప్పువాఁడు జాంఘికుఁడు॥ ౧౭౨

క॥ బహువీరహననమిళదఘ । వహనభ్రమకృత్కళంకవర్గోగ్రాసిగ్రహిళభుజయుగళగజప । త్యహిపహరణతార్క్ష్యసజ్జనావనదక్షా॥ ౧౭౩

టీక॥ బహు...గళ - బహువీరహనన । అనేకశూరులయొక్క- సంహారమువలన* మిళత్- కూడుకొన్న *అఘవహన - పాపమునువహించుటయొక్క- భ్రమకృత్ -భ్రమను జేయుచున్న *కళంకవర్గ - నల్లనిచాయలగుంపుగలిగిన ఉగ్ర- భయంకరమైన* అసి- కత్తిని* గ్రహిళ- గ్రహించిన*భుజయుగళ భుజద్వయముగలవాఁడా। అనఁగా ననేకవీరులనుజంపుటవలన నా పాపము దేహమందుఁ బ్రవేశించినదో యనునట్టుగా నేనల్లనిచాయలుగలిగియుండు ఖడ్గమును భుజమందుఁబూనియున్నవాఁడని తాత్పర్యము గజపత్యహిపహరణతార్క్ష్య గజపత్యహిప । కళింగరాజను సర్పశ్రేష్ఠముయొక్క*హరణ - సంహారమందు*తార్క్ష్య - గరుడప్రాయుఁడవైన వాఁడా*సజ్జనావనదక్షా - సజ్జనావన*సుజనులయొక్క సంరక్షణమందు- దక్షా। సమర్థుఁడవైనవాఁడా ౧౭౩

పృథ్వి॥ సుధీమధురవాక్సుధాసుముఖనాగమాంబాసుతా। మధుప్రసవసాయకస్మయవిరామరమ్యాకృతీ। దధీచివిధుకామధుగ్ధనదదుగ్ధసింధుప్రథా। వధీరణపరాయణోజ్జ్వలవదాన్యతాలంకృతా॥ ౧౭౪

టీక॥ సుధీమధురవాక్సుధాసుముఖ-సుధీ। విద్వాంసులయొక్క । మధురవాక్సుధా - మనోహరమైనవాక్యములను నమృతమునకు।సుముఖ*అభిముఖుఁడవైనవాఁడా-అనఁగాఁ బండితగోష్ఠియందాసక్తిగలవాఁడనుట*నాగమాంబాసుతా। నాగమయనునామెయొక్క కుమారుఁడైనవాఁడా* మధుప్రసవసాయకస్మయవిరామరమ్యాకృతీ-మధు।వసంతునియొక్కయు - ప్రసవసాయక। మన్మథునియొక్కయు। స్మయవిరామ। గర్వమును సాగనివ్వని। రమ్యాకృతీ*మనోహరమైనరూపముగలవాఁడా॰దధీ...తా-దధీచి-దధీచియొక్కయు। విధు। చంద్రునియొక్కయు*కామధుక్ -కామధేనుయొక్కయు- ధనద। కుబేరునియొక్కయు। దుగ్ధసింధు।క్షీరసముద్రునియొక్కయు- అనఁగావీరు ఘనమైనదాతలుగనుకవీరియొక్క* ప్రథా - ప్రసిద్ధియొక్క *అవధీరణ- తిరస్కారమందు*పరాయణ - ఆసక్తిగలిగిన*ఉజ్జ్వల - ప్రకాశమానమైన*వదాన్యతా- దాతృత్వముచేత। అలంకృతా - అలంకరింపఁబడినవాఁడా- అనఁగా దధీచి మొదలైన వారికంటెనతిశయదాతృత్వముగలవాఁడని భావము। దధీచి దేవేంద్రునకు వజ్రాయుధము మొదలైననిమిత్తమయి తన దేహమువదిలినకథ భారతమందుఁ జూచుకొనునది॥

గద్య॥ ఇది శ్రీమదంధ్రకవితాపితామహసర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిర నందవరవంశోత్తంస శఠగోపతాపసప్రసాదాసాదితచతుర్విధకవితామతల్లికాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్యప్రణీతంబైన స్వారోచిషమనుసంభవంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము- ప్రథమాశ్వాసాంతగద్యమునకుఁ జేసిన ప్రకారమేదీనికిం డీకవిచారించఁదగ్గది - నాలుగవయాశ్వాసము టీకతోఁగూడ ముగిసినది॥





## స్వారోచిషమనుచరిత్రము.

### ఆఱవయాశ్వాసము.



॥ శ్రీనందనసౌందర్యా సు । ధీనందనవితరణావధీరితబలిరా । డ్భానుజపరరాజస్వ । ర్భానుభుజాహీంద్రకృ ౧
ష్ణరాయనరేంద్రా॥

టీక ॥ శ్రీనందనసౌందర్య - శ్రీనందన లక్ష్మీకుమారుఁడైన మన్మథునియొక్క - సౌందర్య - చక్కఁదనమువంటిచక్కఁదనముగలవాఁడా - సుధీనందన విద్వాంసులను సంతోషింపఁజేయువాఁడా - వితరణావధీరితబలిరాడ్భానుజ - వితరణదాతృత్వముచేత - అవధీరిత - తిరస్కరింపఁబడిన బలి - వైరోచని - అనఁగా బలిచక్రవర్తియు - రాట్ - చంద్రుఁడును - భానుజ - సూర్యపుత్రుఁడైన కర్ణుఁడునుగలవాఁడా పరరాజస్వర్భానుభుజాహీంద్ర - పరరాజ - శత్రువులను చంద్రులకు - స్వర్భాను - రాహుప్రాయమైన - భుజాహీంద్ర - సర్పశ్రేష్ఠములవంటిబాహువులుగలవాఁడా - అనఁగా రాహువు చంద్రునిబట్టినట్టుగా నేశత్రురాజులను గ్రహించుభుజములుగలవాఁడని భావము - కృష్ణరాయనరేంద్రా - కృష్ణరాయఁడను పేరుగలరాజా యని సంబోధనము॥

వ ॥ అవధరింపుము జైమినిమునీంద్రచూడారత్నంబునకు నీడోద్భవంబు లిట్లనియె॥

టీక ॥ అవధరింపుము - చిత్తగింపుము - జైమినిమునీంద్రచూడారత్నంబునకున్ జైమినియను పేరుగలమునిశిఖామణికి నీడోద్భవంబులు - పక్షులు - ఇట్లనియెన్ - ఈతీరునఁబలికెను॥ నీడోద్భవా గరుత్మంతః పిత్సంతో నభసంగమా ఇత్యమరః॥

తే ॥ అప్పుడుగంధర్వపతిమహికవతరించి । రాజువిస్మయమునహాయిరాజుడగ్గ । నక్కఁజేర్చిముదంబుతో నని యె దంత । కిరణములుహారకాంతులుసరసమాడ॥ ౨

టీక ॥ అపుడు - ఆసమయమందు * గంధర్వపతి - గంధర్వరాజు * మహికవతరించి - భూమికిదిగి * రాజు - ప్రభువైన స్వారోచి * విస్మయమునన్ - ఆశ్చర్యచేత * హాయిరాజు డగ్గఱగ [illegible]ముదిగఁగా * అక్కఁజేర్చి - కౌఁగిలించుకొని * ముదంబుతోన్ - సంతోషముతో * దంతకిరణములు - పలువరసయొక్కద్యుతులును - హారకాంతులు - ముత్యాలహారముయొక్కద్యుతులును * సరసమాడన్ - తచ్చనలాడఁగా - అనఁగా నొకదానితో నొకటికలుసుకొనునట్లుగా - అనియెన్ - ఒకవాక్యముపలికెను॥ ౨

సీ ॥ భద్రమానీకునీబాహాభృతక్షితి * ప్రజలకులెస్సలా రాచవారు । ధన్యుండనైతినీదర్శనంబునఁజేసి * నాదు
ష్కృతములెల్లనాశమొందె । నీజగత్త్రయినన్ను నిందీవరాక్షాఖ్యఁ * గీర్తించునప్సరోగీతసరణి । గారాపు
మీతల్లికడవాఁడఁగానియే * గణుతింపఁగడవాఁడఁగాఁజుమయ్య॥ తే ॥ పెండ్లికొడుకవుమాకునీబిసరుహాక్షి
మూర్తినందనియొకమౌని ఘోరశాప । వికృతిమానిసిదిండినైయకటదీని । ప్రాణములకగ్గఁదలఁచితిఁబాపబుద్ధి॥

టీక॥ నీకున్ - నీకును - నీబాహాభృతక్షితిప్రజలకున్ - నీబాహాభృత నీభుజబలముచేత భరింపఁబడిన - క్షితిప్రజలకున్ - భూజనులకును - భద్రమా - శుభమేకదా - రాచవారు - నీరాజబంధువులు - లెస్సలా - బాగున్నారుగదా - నీదర్శనంబునఁజేసి - నీయాలోకమువలన - ధన్యుండనైతిన్ - కృతార్థుఁడనైతిని - నాదుష్కృతములెల్లన్ - నాపాపములన్నియు - నాశమొందెన్ - నశించెను - ఈజగత్త్రయినన్నున్ - ఈమూఁడులోకములలోనను - ఇందీవరాక్షాఖ్యన్ - ఇందీవరాక్షుఁడను పేరుచేత - అప్సరోగీతసరణి - అప్సరసలయొక్కగానరీతి - కీర్తించున్ - కొనియాడును - ఏగణుతింపన్ - నేనువిచారించఁగా - గారాపుమీతల్లి - ప్రేమాస్పదురాలైన మీయమ్మకన్నను - కడవాఁడఁగాని - కడపారపువానిని - అనఁగా దమ్ముఁడనుగాని - కడవాఁడఁగాఁ

జూమయ్యా- ప(రాయిదానిని గానునుమాయయ్యా- పెండ్లి తోడుకవ్వమూపన్ - మాకునీవు పెండ్లికొడుకవు| అనఁగాన ల్లుఁడవు.- ఈవిపరుహోష్టి - ఈ ఉన్నది కూర్మినందన- ముద్దు లకూతురా- ఒకమాట- ఒకానొకముగీశ్వరునియొక్క - ఘోరశాపవికృతిన్- ఘోర|భయంకరమైన|శాపవికృతిన్ శాపవికారముచేత- మానిసిదిండినై- మనుష్యులనువినురా తుకురఁడనై- అకట- అయ్యో- దీని ప్రాణములకున్ - ఈవి న్నదాని యొక్క- యసువులకు- అల్లఁదలఁచితిన్ - అపకార ము సేయఁబూనితిని- పాపబుద్ధిన్- కలుషమతిచేత|అనఁగాఁ జంపఁబూనితిననుట || అలోకోదర్శనో ద్యోతౌ పుంసిభూమ్న్యసవః ప్రణా ఇత్యమరః|| ౪

అనునెడవచ్చిన నూరము। జనకుని పాదముల కెరగస స్నేహమతిం।గనుగవనీరొలుకఁగనందనిమూర్ధఘ్రా

-ణము తఁడు దయఁగావించెన్ ||

టీక| అను నెడన్- ఈతీరునఁజలుకుచున్న సమయమందు-ను నూరము- ఆగంధర్వపతిగూరాఁ రై నమ నూరము- వచ్చి-ఏ తెంచినదై -జనకుని- తనతండ్రియొక్క--పాదముల కెరగన్ చరణములకు ప్రమొక్క-ఁగా-అతఁడు- ఆయిందీవరాక్షుఁడు- స స్నేహమతిన్- ప్రేమముతోఁగూడినయంతఃకరణము చే త- కనుగవనీరొలుకఁగన్ - రెండుకండ్లవెంట బాష్పజలము లు చిందఁగా- నందని-కొమారైయొక్క-మూర్ధఘ్రాణమున్ శిరస్సుమూరొ క్కనుటను- దయఁగావించెన్ - కృపచేతఁజే సినవాఁడాయెను । అనఁగా శిరస్సు నాఘ్రాణించెననియ ర్థము || ౫

ఉ|| అపుడువిస్మితాత్ముఁడై వరూధినిసుతుఁ। డేమి కారణమున నేతపస్వి।యిట్టి శాపమిచ్చె నెఱిఁగింపువినవేడు

కయ్యెననఘయనిన నాతఁడనియె||

టీక|| అపుడు-ఆసమయమందు -వరూధినిసుతుఁడు- స్వరోచి-విస్మితాత్ముడై -ఆశ్చర్యముతోఁగూడినహృదయముగల వాఁడై - అనఘ - నిష్కల్మషుఁడవైనయిందీవరాక్షుఁడా- ఏమికారణమునన్- ఏమినిమిత్తముచేత- ఏతపస్వి- ఏము నీశ్వరుఁడు-ఇట్టి శాపమిచ్చెన్-ఇటువంటి శాపమొసఁగెను- వినవేడుకయ్యెన్ - వినుటకుఁగుతూహలముపుట్టెను - ఎ ఱిఁగింపుము - తెలియఁజెప్పుము- అనినన్ - అనియనఁగా- అతఁడు యొక్క- అయిందీవరాక్షుఁడుపలికెను|| వేడుకశబ్దము నకుసంతోషమనియు నర్థము కలదు|| ౬

మ||కలఁడుల్లోకయశఃపురంధ్రిజగతిన్గంధర్వవంశంబునన్। నలనాభాహ్వయుఁడేఁదదీయతనయుండన్ బ్ర

హ్మమిత్రుండుశిష్యులకుంగంటనువత్తిఁ బెట్టుకొనియాయుర్వేదమెంతప్రౌ। ఢులఁజెప్పన్విను చుండిమాన

సమునందుందజ్జిఘృక్షౌరతిన్|| ౭

టీక|| జగతిన్- భూమియందు- గంధర్వవంశంబునన్- గం ధర్వకులమందు- ఉల్లోకయశఃపురంధ్రి-ఉల్లోక|లోకాతీత మైన| యశః||కీర్తియను| పురంధ్రి|| స్త్రీ)గలిగిన- నలనాభా హ్వయుఁడు- నలనాభుఁడను పేరుగలవాఁడు- కలఁడు-క లిగియుండును - ఏఁదదీయతనయుండన్- నేనతనికుమారుఁ డను- బ్రహ్మమిత్రుండు- బ్రహ్మమిత్రుఁడనుమునీశ్వరుఁడు- శిష్యులకున్ - విద్యార్థిజనములకు- కంటనువత్తిఁబెట్టుకొని కంటియందువత్తివేసుకొని| అనఁగారాత్రింగూడదీపము పె ట్టుకొని- ఆయుర్వేదము- అనఁగావైద్యశాస్త్రము- ఓకం తప్రౌఢులఁజెప్పన్- ప్రొద్దుపోయినదనుక చెప్పుచునుండఁగా వినుచుండి- ఆకర్ణించుచుండి- మానసమునందున్ - మనస్సు నందు - తజ్జిఘృక్షౌరతిన్-ఆవిద్యాగ్రహణమందలియాస క్తిచేత|| ఈపద్యమున నూరంత ప్రొద్దనుదానికి భాగవతదశ మస్కంధపూర్వభాగమున ౨౨వయధ్యాయమునకునరియైన తెనుఁగు ౧౫ వపద్యమందుగోపికలు శ్రీకృష్ణునివస్త్ర ము లిమ్మనియడుగుస్థలమందుఁగూడఁ బ్రయోగించియున్నాడు

తె||మునివరుఁజేరిభక్తినమస్కరించి। చెప్పవేనాకునీవిద్యశిష్యకోటి। తోడఁగూడంగనేఁగృతార్థుండనగుదు

ననుచుఁ బ్రార్థింపననుఁజూచియపహసించి|| ౮

టీక॥ నీవు చదివింతువనుచున్ - నీవు విద్య చెప్పుదువని- అన్ని యును విడిచి- ధన రాజ్యములు మొదలైనవి సర్వమును బరిత్యజించి - బిచ్చమెత్తుంగరాదుగా - భిక్షమెత్తుకోరాదుగదా అనఁగా మాకు చందుననవి యున్నియుండక మాను నాయనుట - వేలతపసి - ఓ వెఱ్ఱితాపసుఁడయిన బ్రాహ్మణుఁడా - గడవనాడకు - మించఁబలుకఁబోకు చాలున్ - చాలును - నీగొడవయేల - నీజోలి యొవనికిఁ గావలెను - వెజ్జుఁదన మేల - వైద్యధర్మ మెవనికిఁ గావలెను - అని - అనిపలికి - మదిలజ్జవొడమి - మనస్సున సిగ్గంతోచి ॥ ముందరి పద్యమునఁ గ్రియ ॥ గొడవయనఁగా - ఆపనయని వ్యాఖ్యాంతరము ॥ ౧౩

శా ॥ కంటే బ్రాహ్మణుఁడెన్ని కారుల అచేన్ గర్వించుపీ రెల్లనా । కంటెం బాత్రులె పెద్ద కెట్లునది నేఁగైకొందు
నంచున్ మదిన్ । గెంటె పుంజలనుప్పతిల్లఁగ పటాంతే వాసినై శాంబరిన్ । గొంటుం జందమునీ అశిష్యుల గ
డంగూర్చుండి చర్చారతిన్ ॥ ౧౪

టీక॥ కంటే బ్రాహ్మణుఁడు - చూచితివా బాపఁడు - గర్వించి - అహంకరించి - ఎన్ని కారుల అచేన్ - ఎన్ని కఠినపు మాటలు మాటాడెను - అనఁగా క్రూరపుమాటలాడెను - వీరెల్లన్ - ఈ చదువుకొను వారందఱు - విద్యకున్ - వైద్యపు చదువునకు - నాకంటెన్ - నాకన్నను - పాత్రులే - తగినవారా - అనగా నేను వీరిమాత్రము తగకపోతినా యనియర్థము - ఎట్లునది నేఁగైకొందునంచున్ - ఏవిధముగనైన నీవిద్య నేను గ్రహింతుఁగాకయని - మదిన్ - మనస్సునందు గెంటెంపుంజలముప్పతిల్లన్ మాత్సర్యమిబ్బడిగా నతిశయింపఁగా - శాంబరిన్ - శంబరమాయ చేత - కపటాంతే వాసినై - కైతవపుశిష్యుఁడనై - గొంటుం జందమునీ అన్ - గడుసుతనమతిశయించఁగా శిష్యుల గడంగూర్చుండి - అంతేవాసులతోఁగూడఁ గూర్చుండి - చర్చారతిన్ - స్పర్థయందాసక్తిచేత - అనఁగా స్పర్థచేయుచును ॥ స్యాన్మాయా శాంబరీమాయాచ ర్చాసంఖ్యా విచారణే త్యభయత్రాపురః ॥ ౪౧

తే ॥ కాయబాలగ్రహోర్ధ్వాంగకములు నాల్గు । శల్యదృష్టిజరావృషసంఖ్య నాల్గు । నైనయష్టాంగకము తా
పులాడుగల్గు । వైద్య మెనిమిది నెలలసర్వమును నేర్చె ॥ ౧౫

టీక ॥ ఈపద్యమున మూఁడు చరణములవరకునుండు వైద్య సాంకేతికములాయుర్వేదమందుఁజూచి తెలుసుకొనఁదగిన వి॥ వైద్యము - ఇట్టిచికిత్స - ఎనిమిది నెలలన్ - అష్టమాసములలో - సర్వమును నేర్చె - అంతయునభ్యసించిన వాఁడనై ॥

క ॥ ఇరుమూఁడురుచులదోషవు । విరసతమానం జ్వరాదివ్యాధ్యంతంబై । పరగు చికిత్సయుఁగనిశాం । బరిఁబాసి
తపస్వితోడమదను ననంటిన్ ॥ ౧౬

టీక॥ ఈ పద్యమునను రెండు చరణములపర్యంతము చెప్పియుండు సాంకేతికములు వైద్యశాస్త్రము చూచి తెలుసుకొనఁదగినవి - పరగుచికిత్సయుఁగని - ఈ ప్రకారము ప్రవర్తించుచునుండు వైద్యమును గ్రహించి - శాంబరిఁబాసి - మాయనువిసర్జించి - తపస్వితోడన్ - ఆబ్రహ్మ మిత్రునితో - మదమునననంటిన్ - కోవ్వుచేత నీతీరునఁబలికితిని ॥ ౧౬

శా ॥ తండ్రీ నాకునను గ్రహింపఁగదె వైద్యంబంచుఁ బ్రార్థించినన్ । గండ్రల్ గానటులాడిధిక్కృతులఁబోకా
ల్మంటివో హాయామదిం । దీండ్రల్ గల్గినవారికేకరణి నేనిన్ విద్యరాకుండునే । గుండ్రాఁడాఁచినఁ బెండ్లియేమిటి
కిఁజికుక్కంగష్టముప్పింపచా ॥ ౧౭

టీక ॥ తండ్రీ - ఓయయ్యా వైద్యంబు - చికిత్స నాకునను గ్రహింపఁగదె - నాకుదయచేయవే - అంచుఁ బ్రార్థించినన్ - అని వేడుకొనఁగా - గండ్రల్ గానటులాడి - కఠినములుగానాప్రకారము మాటలాడి - ధిక్కృతుల - ధిక్కారముల చేతపోకాల్మంటివి - పోకాడి - పొమ్మని పలికితివి - ఓ హా - ఖేదా - మదిందీండ్రల్ గల్గినవారికిన్ - బుద్ధియందుఁజొఱుకుఁదనముగలిగినవారలకు - ఏకరణి నేనిన్ - ఏప్రకారముగానైనను - విద్యరాకుండునే - చదువు రాకుండనుండునా - అనఁగా రానేవచ్చుచున్నదనుట - గుండ్రాఁడాఁచినన్ గుండ్రాయిదాఁచిపెట్టిన - పెండ్లియేమిటికిఁజికుక్కన్ - వివాహమెందుకు నా॥

టీక ॥ ఇవ్విధంబునన్ – ఈప్రకారముగా – విధివిధానంబునన్ – దైవకృతమువలన – యాతుధానుండనై – రాక్షసుండనై – ధారాధరోత్సేధంబును – మేఘపర్యంతముపొడవుగలదియును – అతిశీతరోమసంబాధంబును – మిక్కిలి వాఁడిగల వెండ్రుకలచేత సంకటమైనదియు – ధూమసమధామంబును – పొగవంటి తేజముగలదియు – ధృతాంత్రదామంబును – ధరించఁబడిన ప్రేగుల పేరులు గలదియు – చలితకపాలకుండలంబును – కదలుచున్న పుఱ్ఱెలు కర్ణాభరణముగాఁ గలదియు – జ్వలితశితదంష్ట్రామండలంబును – మండుచునుండు తెల్లనికోఱలగుంపుగలదియు – నాగాయుతత్రాణంబును – పదివేల యేనుఁగుల బలముగలదియు – మస్తకోత్తుంగఘోణంబును – శిరస్సుకంటె నున్నతమైనముక్కుగలదియు ఐ అయి – అనవరతహింసానురూపంబగు – నిరంతరము బంధనతాడనవధానుకూలమగుచున్న – రూపంబుఁ దాల్చి – ఆకారమువహించి – శకటాంగభంగిఁ గ్రమ్ములై – బండికండ్లవలెనున్నవై – ఇంగలమ్ములొలుకు – నిప్పులుగాల్చుచునుండు – అపాంగమ్ములన్ – కొలుకులచేత – పిశంగమ్ములగుచున్ – పచ్చనగుచును – పశ్యజ్జనాసుమోచనంబులగు – చూచుజనులయొక్క ప్రాణములను విడిపించుచున్నవైన – లోచనంబులు వెలుంగన్ – కన్నులు ప్రకాశించుచునుండఁగా – బభ్రు – పచ్చనైనకేశంబులు దూలన్ – జుంజురు వెండ్రుకలు తూలియాడఁగా – సకలభూతభయంకరంబగు చుపటిమన్ – సమస్తజంతువులకు భీతికరమగుచుండు సామర్థ్యముచేత – ఇచటియ్యటజమ్ములకు నాకి – ఈయరణ్యమందలియాశ్రమస్థలములకు బరుగెత్తి – జటియనక – జటాధారియైనమునీశ్వరుఁడని విచారించక – వటువనక – బ్రహ్మచారియని విచారించక – యతియనక – సన్న్యాసియని విచారించక – వ్రతియనక – వానప్రస్థుఁడని విచారించక – గృహియనక – గృహస్థుఁడని విచారించక – సతియనక – స్త్రీయని విచారించక – శిశువనక – బిడ్డయని విచారించక – భక్షించ భక్షించి – తినితిని – కుక్షింభరిత్వంబునం బవర్తిల్లితిన్ – కడుపునింపుకొనుటచేత నే ప్రవర్తించితిని – అట్లుండ వినుము – అది యెట్లుండెననరిగదా యాకర్ణింపుము – తారలకున్ – నక్షత్రములకును – వర్షధారలకున్ – వానయొక్క జలధారలకును – ఇసుమునకున్ – ఇసుకకును – కసవునకున్ – గడ్డికిని – లెక్క గలిగినం గలుగుఁగాని – ఎన్నిక కలిగినను గలుగుంగాక – మదీయజఠరానలజీర్ణజంతుసంతానంబునకున్ – మదీయజఠరానలజీర్ణ – నాయొక్క జఠరాగ్నియందు హరించిన – జంతుసంతానంబునకున్ – శరీరిసమూహమునకు – లెక్క యిడ నక్కమలగర్భుండును సమర్థుఁడుగాఁడు – లెక్క యేర్పఱచుటకు బ్రహ్మయైనను శక్తికిని జాలఁడు – ఇట్టిక్రూరదనుజభావావిష్టుండనగు – ఇటువంటి కపటరాక్షసత్వమును బొందిన – నాదౌష్ట్యంబు – నాయొక్క దౌర్జన్యము – సవసవగాఁ దెలిసి – చూచాయగా గ్రహించి – అనఁగాఁ గొద్దిగొద్దిగాఁ దెలిసి యనుట – ముదరకయమున్న – అతిశయించకమునుపే – మత్కళత్రంబులన్ ! నాభార్యలను – పుట్టినింటివారు – తల్లియింటివారు – ఉత్సవాలోకనవ్యాజంబున నంపించుకొనిచని – పెండ్లి పేరంటము మొదలైన వేడుక చూచుటకని చెప్పి యంపకము చేయించుకొనిపోయి – నిజగృహంబులను నిచిరక్షించుకొనియుండిరి – వారి వారి యిండ్లలో నుంచుకొని సంరక్షణము సేయుచుండిరి – ఇప్పుడే నశనంబుగానకన్ – ఇప్పుడు నేనాహారముగానక – కానకఁగన్న యొక్కన్నన్ – లేక లేక కనుఁగొన్న యీచిన్నదానిని – కైలాసకాననంబునం గుసుమంబులు గోయుదానిం గని – కైలాసపర్వతవనమందుఁ బువ్వులు గోయుచున్నదానిని జూచి – కనికరంబుడిగి – దయదలఁచక – కడుపుచిచ్చునకున్ – జఠరాగ్నికి – మ్రింగం దలఁచి కొనివచ్చి – మ్రింగనిమిత్తమై తెచ్చుకొనివచ్చి – ఇచ్చో టభవదీయదర్శనంబునన్ – ఈస్థలమందు నీయాలోకనమువలన – వృజినరుజవలన విముక్తుండనై – పాపమనురోగమువలననుండి విడువఁబడినవాఁడనై – నిజప్రకృతిఁ బొంది – స్వకీయమైనదివ్యదేహముఁ జెంది – కృతార్థుండనైతిన్ – ధన్యుఁడనైతిని – అనఁగా ఆముని వాక్యప్రకారము శాపవిముక్తియును స్వరూపమును జెందితిననుట ॥ ౩౪

క ॥ ఈయుపకారమునకుఁ బ్రతి । సేయఁగ శక్యంబె జంభజిన్నిభ శశధరా । స్యాయతలోచన యయినను । దీ
యాత్మజనికి నిత్తు దేవీమణిగాన్ ॥ ౩౫

టీక ॥ ఈయుపకారమునకున్ – ఇప్పుడు నీవు నాకుఁ జేసినయు । పకృతికి – ప్రతి సేయఁగ శక్యంబె – ప్రత్యుపకారము చేయఁగ

హృదయమందంతటఁబ్లోగమగుచుండఁగా- అస్వరోచి- స్వరోచి - హార్షి చెన్ - ...షించెను - అగతన్ - అంతట - ... ంతమునపున్ - ...టిదిక్కున - రవియే గెన్-సూర్యుఁడుపోయెను. అనఁగాసూర్యాస్తమయమాయెననుట ॥ వా ర్తాప్రవృత్తిగ్స్వ్రుత్తాంతఉదంతఇత్యమరః॥

మ ॥ వికసిల్లంబ్రజచక్రపాలనముగావించెంగరవ్యాప్తిం। గకుబంతంబులనాక్రమించెఁబొసఁగంగానేత్ర్పైవర్ణాళిఁగాం। తికిఁబాపెంబెలరాజకోటిఁదుదిశాంతింబొందెదైవంబునేఁ। తకుఁదాపంబిఁకనేలనం గకుఁడస్తప్రాప్తుఁడయ్యెంగడున్॥ ౩౮

టీక ॥ ఇనుఁడు - సూర్యుఁడనియర్థము - రాజనియర్థాంతరము - ప్రజ- జనసమూహము- వికసిల్లన్- తెలివిపొందునట్టనియర్థము - సంతోషించునట్టుగాననియర్థాంతరము - చక్రపాలనముగావించెన్ - కోకపక్షిసంరక్షణము చేసెననియర్థము - రాజ్యపరిపాలనముచే సెననియర్థాంతరము - కరవ్యాపృతిన్- కిరణవ్యాప్తిచేతననియర్థము- హస్తవ్యాప్తిచేతననియర్థాంతరము - కకుబంతంబులనాక్రమించెన్ - దిగంతములనునాక్రమించెను - అనఁగాస్వవశముగాఁజేసుకొనెననియర్థవ్యయమందును జెప్పవచ్చును - పొసఁగంగానేత్ర్పైవర్ణాళి- శ్వేతపీతాదివర్ణములనొప్పునట్టుగానేర్పాటుచే సెనని యర్థము- బ్రాహ్మణాది వర్ణములనుయుక్తమునట్టుగానేర్పాటుచేసెనని యర్థాంతరము - కాంతికిఁబాపెంబెలరాజకోటిన్ - అన్యుఁడైనచంద్రునియొక్కయాత్కర్షమునుబ్రకాశించకుండఁజేసెననియర్థము - ఇతరరాజసమూహమును బ్రకాశించకుండఁజేసెననియర్థాంతరము- తుదిశాంతింబొందెన్- చివరకుమందరశ్మియాయెననియర్థము - చిత్తశాంతినిబొందెననియర్థాంతరము - దైవంబు నేఁతకున్ - దైవముచేసిననిర్ణయమునకనియుభయత్రచెప్పవచ్చును- తాపంబిఁకనేలనంగన్-దాహకగుణమిఁకనెందుకన్నట్టుగాననియర్థము - మనస్తాపమిఁకనెందుకన్నట్టుగాననియర్థాంతరము- అస్తప్రాప్తుఁడయ్యెంగడున్ అస్తమానమునుబొందెననియర్థము - అంతమును బొందెననియర్థాంతరము ॥ ఇనస్సూర్యే ప్రభౌ రాజామృగాంకే క్షత్రియేనృపేఇత్యమరః॥ ౩౯

తే ॥ అసురవరుఁడైనయిందీవరాక్షుమేన। నంటికొన్నస్వరోచిబాణాగ్నివోలె। నంతఁగనుపట్టెశుకతుండకాంతిఁదెగడి। సాంధ్యరాగంబుపశ్చిమాచలమునందు॥ ౪౦

టీక ॥ అసురవరుఁడైన- రాక్షసశ్రేష్ఠుఁడైన- ఇందీవరాక్షుమేనన్ - ఇందీవరాక్షునిశరీరమందు- అంటికొన్న-తగులుకొన్న - స్వరోచిబాణాగ్నివోలెన్ - స్వరోచియొక్క అస్త్రసంబంధమైన వహ్నివలె-అంతన్ - ఆసమయమందు - శుకతుండ కాంతిఁదెగడి - చిలుకముక్కుచాయనుదిరస్కరించిన - అనఁగానెఱ్ఱని కాంతిచేత - సాంధ్యరాగంబు - సంధ్యారాగము - పశ్చిమాచలమునందున్- పడమటికొండయందు - కనుపట్టెన్ - కనుపడెను ॥ అనఁగానంజకెంపుపగుపడెననుట॥ ౪౧

క ॥ తలచూపెనప్పుడఖిలా। శలగట్టపుటిరుల దిలువరాలునభః। స్థలమంటపకోపరిసీ। మలనిడినసితాండపటలిమాడ్కింజుక్కల్॥ ౪౨

టీక ॥ అప్పుడు - ఆసమయమందు-అఖిలాశల - సమస్తదిక్కులయందును - దట్టపుటిరుల - కారుచీఁకటియను-చిలువజవరాలు - నాగకాంత- నభస్స్థల- ఆకాశప్రదేశమనునట్టి - మంటపకోపరిసీమలనిడిన- మంటపక - మిద్దెయొక్క- ఉపరిసీమలనిడిన - ఊర్ధ్వభాగములయందుఁబెట్టిన-సితాండపటలిమాడ్కిన్ - తెల్లనిగుడ్లగుంపువలె - చుక్కలు - నక్షత్రములు - తలచూపెన్ - కనుపడెను ॥ మండపకమనఁగాజనాశ్రయమైన చావడియని యమరము - స్వార్థేకప్రత్యయము॥ ౪౩

ఆ ॥ సాంధ్యనటనచండచండీశజటాలిఁ। దరణిచక్రమొఱఁగిశరధిఁగ్రుంగ। దోరగల్లువడియెభూరథేతరభాగ। చక్రమనఁగనప్పుడుశశియుఁదోఁచె॥ ౪౪

టీక ॥ సాంధ్యనటనచండచండీశపదహతిన్ - సాంధ్య నటన - సాయంకాలతాండవమందు - చండ-సమర్థుఁడైన-చండీశ - సాంబమూర్తియొక్క - పదహతిన్ - పాదఘట్టనచేత - తరణిచక్రమొఱఁగి-సూర్యరూపమైనబండికల్లొకభాగమునకువంగి- శరధిఁగ్రుంగన్ - సముద్రములో దిగఁబడఁగా - భూరథేతరభాగచక్రము- భూరథ - భూరూపమైన స్యందనముయొక్క - ఇతరభాగచక్రము - రెండవదైన(పు బండికల్లుధోరగల్లువడియెన్ - ఒడ్డగిలఁబడెను - అనఁగన్- అనునట్లుగా - అపుడున్ - ఆసమయమందు- శశియుదోఁచె- చంద్రుఁడునునుదయించెను ॥ అనఁగా సూర్యాస్తమానము కాఁగానే చంద్రోదయమునునాయెననియర్థము ॥ సాంబమూర్తికిఁద్రిపురసంహారకాలమందు భూమిరథమును సూర్యచంద్రులు బండికండ్లునునగుటపురాణ ప్రసిద్ధముగనుకకవిప్రయోగించి నాఁడని తెలియవలెను - యీకథసాంగం దమున - భారతమునఁగర్ణపర్వము మొదలైనవాని యందుఁ జూడవలసినది॥ ౪౨

క ॥ తమమను కాలాహిప్రపం । చము నెరగొనియెవోషధీశసద్యఃకృతదం । డమునసమగుడంగఁ గ్రక్కెను । క్రమమునవొయ్యొయ్యవిచ్చికడలకుఁదొలఁగెన్॥ ౪౩

టీక ॥ తమమను చీఁకటియనునట్టి - కాలాహి - నల్లత్రాఁచుబాము - ప్రపంచము నెరగొని- లోకమంతయుఁబ్రమింగి- ఓషధీశ - చంద్రునిచేత - సద్యఃకృ తదండమునన్ సద్యఃకృత - అప్పుడుచేయఁబడిన - దండమునన్-శిక్షవలన సగుడంగఁ గ్రక్కెడుక్రమమునన్ - మరలవమనముచేసినరీతిగా ఒయ్యొయ్యవిచ్చి - చిన్న చిన్న గావిడిచి - కడలకుఁదొలఁగెన్ - పార్శ్వములకునొత్తిపోయెను ॥ అనఁ గాఁ జంద్రోదయము కాఁగా నేచీఁకటి యంతకంతకుఁ దొలఁగిపోయెననుట॥ ౪౩

వ ॥ అనంతరంబ క్రమక్రమంబునన్ ॥ తర్వాతతో డ్తోడనే॥

సీ ॥ కలయవెల్లువగట్టి జలజలఁబ్రవహించు - శశికాంతవాంతనిర్ఝరము జలము । మలయానిలము చేసమారంబు రేఁగుసౌ । గంధికంబురజంబుకఱకుమన్ము । నిండారవిరిసినబొండుమల్లెలనుండి । యొడయుమకరందపుగుడరసంబు । తోఁకిమింటికిఁబొంగుదుగ్ధపాథోరాశి కరడులమీఁదిమీగడలమెఱుఁగు ॥ తే ॥ తనరసవర్గములుగాసుధాకరుండు । సారెసారెకుఁగరములుసాఁచిచాఁచి । యచ్చదెలుపుగనపుడుబ్రహ్మాండమంటపంబువెన్నెలసన్నసున్నంబుఁజేసె॥ ౪౫

టీక ॥ కలయవెల్లువగట్టి - అంతటఁగలియునట్టుగావరదగట్టి- జలజలఁబ్రవహించు - జలజలయనిపారునట్టి - శశి...రము - శశికాంతవాంత- చంద్రకాంతమణులవలనవెడలఁగ్రక్కఁబడుచున్న - నిర్ఝరము - ప్రవాహము- మలయానిలముచేన్- చందనాద్రిమారుతముచేత- దుమారంబు రేఁగు - దుమ్ము రేఁగుచున్న - సౌగంధికంబురజంబు- ఎఱ్ఱగలువలపుప్పొడియను- కఱకుమన్ము - ఇసుకయును - ఘన్మవిశేషమనియాంధ్రభాషార్ణవమందు - నిండారవిరిసిన - లెస్సపూచిన- బొండుమల్లెలనుండి - మహామల్లీపుష్పములవలననుండి - ఒడియు - కారుచుండు - మకరందపు- మకరందమను- గుడరసంబు- బెల్లపునీళ్లును - తోఁకి- తోణికి- మింటికిఁబొంగు - ఆకాశమునకుబుకుచున్న - దుగ్ధపాథోరాశి- క్షీరసముద్రముయొక్క- కరడులమీఁది - తరంగములపైనుండు- మీగడల- మండము లేయను - మెఱుఁగు- చమురు॥ మండందధిభవంమస్త్విత్యమరః తనరన్- తనరు- రసవర్గములుగాన్ - గచ్చుచేయుటకుఁగావలసిన సాధనములౌచు నుండఁగా- సుధాకరుండు - చంద్రుఁడను సున్నపుగచ్చుపనిచేయువాఁడు- సారెసారెకున్ - మాటిమాటికిని- కరములుసాఁచిచాఁచి - కిరణములను చేతులుసాఁచిసాచి - అచ్చతెలుపుగన్ - శుద్ధశ్వేతవర్ణముగానుండు - అపుడు - ఆసమయమందు- బ్రహ్మాండమంటపంబు- బ్రహ్మాండమనుమంటపము - వెన్నెల- చంద్రికయను-సన్నసున్నంబుఁజేసెన్- పాలగారచేసెను॥ మండపోస్త్రీజనాశ్రయఇత్యమరః॥

వ ॥ ఆసమయంబునం బరిశ్రాంతుండగు నమ్మహీకాంతుం డొక్కశశికాంత శిలామంటపంబునదట్టంబు గాఁబఱచినచిగురుపఱుపులఁగంధర్వరాజునుందానునుసుఖాసీనులై యిష్టకథాగోష్ఠినారాత్రిగడపిరంత॥ ౪౬

టీక ॥ ఆసమయంబునన్-అట్టిరాత్రికాలమందు- పరిశ్రాం । తుండగు-అలసియున్న- అమ్మహీకాంతుండు-ఆస్వరోచి-

సీసపు - కసీసమను ధాతువిశేషముగలసిన మాంజిష్ఠము వోలి - ఎఱుపు పసపుగలసిన లాలు పొం చాయపోలి - అమరెన్ - ఒప్పుచుండెను కసీసము నఁగా నలుపు అనేక స్థలములయందుదాహరించియున్నారు - అనఁగా సైన్యమున నడుచుచుండఁగా మండరాద్రిమార్గ సంబద్ధమైన ధాతువిశేషపరాగము తెరతెరలుగా నాకాశమందు వ్యాపించెనని భావము ॥ పరంపరయనఁగాఁ బరిపాటి॥ ౫౪

తే ॥ సారధి నీరీతిదివిఁ దోడుఁ జూపినట్టి । దొరలు గొలువంగ ఖచరేంద్రుఁడరిగి యరిగి । మింట గ్రహరాజు తనసగ మింట వెలుఁగు । మంథగిరిఁ గాంచి పలికె నమ్మనుజపతికి॥ ౫౫

టీక ॥ సారధిన్ - వరూధినీసుతుని - ఈరీతి - ఈప్రకారము దివిన్ - అంతరిక్షమందు - తోడుఁ జూపినట్టి - సహాయము నను గ్రహించిన - దొరలు - సరదారులు కొలువంగన్ - కొలిచి వచ్చుచునుండఁగా - ఖచరేంద్రుఁడు - గంధర్వరాజు - అరిగియరిగి - పోయిపోయి - మింటన్ - ఆకాశమండలి - గ్రహరాజు - సూర్యుఁడు - తనసగ మింట వెలుఁగు - తన మధ్యభాగమందుఁ బ్రకాశించుచునుండు - మంథగిరిఁ గాంచి మందరపర్వతమునఁ జూచి - అమ్మనుజపతికిన్ - వరూధినీపుత్రుఁడయిన స్వరోచితో - పలికెన్ - ఒకవాక్యము చెప్పెను॥ ౫౬

సీ ॥ జరఠకచ్ఛపరాజు చరమాంగ గృహమేధి । భోగివేష్టనరేఖ బొలుచుజాణ । కులములోఁ దరితీపు గలిగి మించిన మేటి । మైనాకునోరసిన మాసటీఁడు । తొలువేలుపుల వేలుపులఁ బనుల్గొను ఱేఁడు - గడలిరాయల లోఁతుఁ గన్నగబ్బి । సురరాజునకుఁ బాండుకరిఁ జేర్చు మరకాఁడు । కల్పకంబులపంట కమ్మటీఁడు ॥ తే ॥ కంపమథితసుధాధౌతకటకజాత । చంపకవనప్రకంపనాకంపవిసర । దక్షరముఖరవమధుకరముఖరశిఖర । నందరసమందిరంబగు మందరంబు॥ ౫౭

టీక ॥ జరఠకచ్ఛపరాజు - ఆదికూర్మముయొక్క - చరమాంగగృహమేధి - చరమాంగ - వీఁపు చిప్పయందలి - గృహమేధి గృహస్థుఁడు - అనఁగాఁ గాఁపురస్థుఁడును భోగివేష్టన రేఖన్ - వాసుకియొక్క - చుట్లవల్లనైన చారికలచేత - పొలుచు జాణ - ఒప్పుచున్న సమర్థుఁడును - కులములోన్ - పర్వతవంశములో - తరితీపుగలిగి - ప్రీతిగలిగి మించిన మేటి - అతిశయించినవాఁడును - మైనాకునోరసిన - మైనాకగిరితో స్పర్ధ చేసిన - మాసటీఁడు - వస్తాదును - తొలివేలుపుల వేల్పులన్ - రాక్షసులను దేవతలను - పనుల్గొను ఱేఁడు - కొలువుగాండ్రనుగా నంగీకరించిన ప్రభువును కడలిరాయల - సముద్రరాజైన క్షీరాబ్ధియొక్క - లోఁతుఁగన్నగబ్బి - అగాధముగనుపట్టుచుకొన్న గంభీరుఁడును - సురరాజునకున్ దేవేంద్రునికి - పాండుకరిఁ జేర్చు - వెల్లటేనుఁగును దెచ్చియిచ్చిన - అనఁగా నైరావతమునొసఁగిన మరకాఁడు - ఓడవర్తకుఁడును - కల్పకంబులపంట - కల్పవృక్షములపంట పండించిన - కమ్మటీఁడు - కమ్మ సంసారియును॥ మథిత రంబు - మథిత - తరచఁబడిన సుధా - అమృతముచేత - ధౌత - కడగఁబడిన - కటక - పర్వతమధ్యభాగమందు - జాత - పుట్టిన - చంపకవన - సంపంగితోఁటలయందలి - ప్రకంపన - వాయువువలన - ఆకంప లెస్సగాఁ జలించిన వికసనకనే - విసరత్ - తొలఁగిపోవుచున్న - అక్షర - మృదువైన - ముఖరవ - ఝుంకారములుగలిగిన మధుకర - తుమ్మెదలచేత ముఖర - మ్రోయుచున్న - శిఖర - శృంగములు గలది గనుకనే - నందరస - సంతోషరసమునకు - మందిరంబు ఆలయమును - అగు - అయిన - మందరంబున్ - మంథానపర్వతమును - కంటె చూచితివా॥ ౫౭

శా ॥ వైకుంఠాంగదహేమమూతతవలద్వాతాశనాకృష్టరే । ఖాకారంబుల చుట్టునంటి మొలనూలై మేటి యొడ్డాణమై । శ్రీకారప్రభ గంరిద్మై శిఖరిరాట్సింహోల్లసత్పట్టమై । యీకొండం గనుఁగొంటె మాయదిపుడున్ హేరాళపుం గాంతులన్॥ ౫౮

టీక ॥ వైకుంఠాంగదహేమము - వైకుంఠ - విష్ణుమూర్తియొక్క - అంగద - భుజకీర్తుల సంబంధమైన - హేమము - బంగారము - ఆతత - బులన్ - ఆతత విస్తారమౌనట్టుగా వలత్ - చుట్టుకొని తిరుగుచున్న - వాతాశన - వాసుకిచేత - ఆకృష్ట - ఈడువఁబడిన - రేఖాకారంబులన్ - గీరలయొక్క - యాకృతిచేత - చుట్టునంటి చుట్టును అంటుకొని మొలనూలై - మేఖలయై - మేటియొడ్డాణమై - మిన్నాయయినకమ్మరపట్టెయయి - శ్రీకారప్రభ గంరిద్మై శోభాకారమైన కాంతిచేత మెడకంటెయై - శిఖరిరాట్సింహోల్లసత్పట్టమై - పర్వతరాజార్హమై యుల్లసించుచునుండుల

లాటపటికవైన - ఈకొండన్ - ఈమందరాద్రియందు - హేరాళవుంగాంతులన్ - అమలేనద్యుతులచేత - మాయదిపుడున్ - ఇప్ప టికినిమాసిపోకుండనున్నది - కనుఁగొంటె - మూ చితివా ॥ అనఁగా వాసుకినిగవ్వపు త్రాడుచేసిచుట్టిన ప్పుడుక్రిందినుండి పైకినాలుగుచుట్లయినందునమథించునప్పు డొరసుకొనియేర్పడిననాలుగు రేఖలయందును - విష్ణుమూర్తియొక్క భుజకీర్తులబంగారమంటుకొనియానాలుగు రేఖలును - ఆయాస్థానములయందు - ఆయాభూషణములుగాఁ బ్రకాశించెనని తాత్పర్యము ॥ విష్ణుర్నారాయణః కృష్ణో వైకుంఠో విష్టరశ్రవాఇత్యమరః॥ ౫౭

తే॥ వేదవేదాంతముల వేధ వెదకికనని । పద్మలోచను శ్రీపాదపంకరుహము । లబ్జరేఖాంకితములవే యచల

వంశ । వల్లభుని మేఖలా సీమనెల్ల మెఱయు॥ ౫౮

టీక ॥ వేదవేదాంతములన్ - శ్రుతులయందునునిగమాంతములైనయుపనిషత్తులయందును - వేధ - బ్రహ్మదేవుఁడు వెదకి - శోధించి - కనని - చూడని - పద్మలోచను - తామరపూలవంటికండ్లుగలవిష్ణుమూర్తియొక్క - శ్రీపాదపంకరుహములు - శోభాయుక్తములైనచరణపద్మములు - అబ్జరేఖాంకితములు - పద్మరేఖలచేతచిహ్నితములైనవి - అవే - అదిగోయగుపడుచున్నవిచూచితివా - అచలవంశవల్లభుని - పర్వతకులరాజైనమందరముయొక్క - మేఖలాసీమన్ - మధ్యప్రదేశమందు - ఎల్లమెఱయున్ - అంతటఁ బ్రకాశించుచున్నవి॥ ౫౮

ఉ॥ నాలుకబంతి వ్రేలఁబడినంజునదోఁగితమాలపల్లవ । శ్రీలహసింపనుబ్బి కనుఁగ్రేవల జేవురుపుక్కిలింపఁ

గా । వాలికెమేనిఫీఁచెగయవాడినమాల్యము వోలెనాదివు । వ్యాళముదీనిపగ్గమయినట్టియవస్థదలంతు నెప్పుడున్॥ ౬౦

టీక ॥ నాలుకబంతి - జిహ్వలయొక్కచాలు - వ్రేలఁబడి అధోలంబితమై - అనఁగాఁగ్రిందికి వ్రేలియనుట - నంజునదోఁగి - విషముచేతఁదడిసి - తమాలపల్లవశ్రీలహసింపన్ - తమాలపల్లవ - చీఁకటిమ్రానిచిగుళ్లయొక్క - శ్రీలహసింపన్ - సమృద్ధులనుదిరస్కరించఁగా - ఉబ్బి - పైకినుబికి - కనుఁగ్రేవలన్ - నేత్రపార్శ్వములయందు - రక్తిమజేవురు - పుక్కిలింపఁగాన్ - గండూషింపఁగా - అనఁగా వెడలిరాఁగా - వాలికెమేని - దీర్ఘమైనశరీరముయొక్క పీఁచెగయన్ - బలములేదిపోఁగా - వాడినమాల్యమువోలెన్ - వాడిపోయినపూలదండవలెనే - ఆదివ్యాళము ప్రథమసర్పము - అనఁగా వాసుకి - దీని - ఈకొండయొక్క - పగ్గమయినట్టియవస్థన్ - ఆఁకత్రాడైనప్పటిదశను తలంతునెప్పుడున్ - సర్వదాస్మరించుచుందును॥ ౬౦

చ॥ బిలముఖపఙ్క్తినీధరణిభృత్పతివారిధినిర్ఝరభ్రమిం । దలముగమున్నుద్రావినసుధారసధారగుణంబు

నం జుమీ । పలితవికారదూరనిరపాయసుఖస్థితిఁగాంచెనాఁగఁగో । మలవిచలచ్ఛిరోరుహతమాలవినీలిమ

రేఖ నొప్పెడిన్॥ ౬౧

టీక ॥ ఈధరణిభృత్పతి - ఈపర్వతరాజు బిలముఖపఙ్క్తిన్ - బిల - గుహలను - ముఖపఙ్క్తిన్ - వదనసమూహముచేత వారిధినిర్ఝరభ్రమిన్ - వారిధి - క్షీరసముద్రమందు - నిర్ఝరభ్రమిన్ - అతిశయమైనతిరుగుడులవల్ల - దలముగన్ - సంపూర్ణముగా - మున్ను ద్రావిన - పూర్వమందుఁబానముఁజేసిన - సుధారసధారగుణంబునంజుమీ - సుధారసధారే - అమృతరసధారయొక్క - గుణంబునంజుమీ - వీశేషమహిమచేతనుసుమీ - పలితవికారదూరనిరపాయసుఖస్థితిఁగాంచెనాఁగన్ - పలితవికారదూర - తెల్లగానెఱియుటయనువికారములేని - నిరపాయ - ఉపద్రవములేని - సుఖస్థితిఁగాంచెనాఁగన్ - సుఖకరమైనయునికినిబొందినాఁడోయనునట్టుగా - కోమల...ఖన్ - కోమల - మృదువులైన - విచలత్ - కదలియాడుచున్న - శిరోరుహ - శిరోజములైన - అనఁగాఁదలవెండ్రుకలయిన - తమాల - చీఁకటిమ్రానియొక్క - వినీలిమరేఖన్ - మిక్కిలినల్లనికాంతులరీతిచేత - ఒప్పెడిన్ - ఒప్పుచున్నాఁడు - అనఁగా మందరాద్రిశిరోభాగమందున్న తమాలవృక్షములు - పూర్వమందుక్షీరసముద్రములోగుహాముఖములచేతనమృతపానముచేసినందునముదిమిలేకపోవుటచేతను నెఱియకుండనల్లగానున్నతలవెండ్రుకలోయనునట్టుగానేయుండెననియర్థము॥ని॥ కచః కేశశ్శిరోరుహఇత్యమరః॥ ౬౧

చ ॥ జడధిమథింపఁజిక్కి సుధ సౌరభమానుటఁజావుఁ దక్కి రా । బిడములనుండి మద్ధ్భవ పాండిమ బొందములం దమొందనిం । దడవి మెకాలతోఁగదుపులై చరియించును మేతకై బయల్ । వెడలి ధులీ కుళీర శకులీ మకరీ ముఖ వారిజంతువుల్ ॥ ౬౧

టీక ॥ జడధిమథింపఁజిక్కి - క్షీరసముద్రమును జిలుకుచుండఁగాఁదగుబుకొని - సుధ సౌరభమానుటన్ సుధ - అమృతముయొక్క - సౌరభమానుటన్ - పరిమళమును నాస్వాదించుటచేత - చావుఁదక్కి - మరణములేకపోయి - రాబిడములనుండి - రాతిపణుకుల వలననుండి - దుగ్ధభవపాండిమ - క్షీరసముద్రమందలి పాలవలనఁబుట్టిన తెల్లఁదనము - బొందములనందమొందక - శరీరములయందుఁ జిక్కునొంచుండఁగా - ఇందడవి మెకాలతోన్ - ఈపర్వతమందరణ్యమృగములతోఁగూడ - మేతకై బయల్ వెడలి - మేపునిమిత్తమై బయటికివచ్చి - ధులీ...వులు - ధులీ - ఆఁడు తాఁబేళ్లును - కుళీర - ఎండ్రకాయలును - శకులీ - ఆఁడు చేఁపలును - మకరీ - ఆఁడు మొసళ్లును - ముఖ - మొదలైన - వారిజంతువులు - జలజంతువులు - కదుపులై చరియించున్ - గుంపులై సంచరించును ॥ ౬౧

మ ॥ అనుచుం జందనపంక పంకిలతలంబై కేతురుద్ధాతపా । ధ్వనిరుద్ధంబయి మంచకోపరి కుటీ వాటీనటన్నర్తకీ । జనమై యావతసర్వతః కలితవీటీతోరణ స్రగ్జిబం । ధనమై యొప్పు పురంబు సొచ్చి భవనద్వారప్రఘాణంబునన్ ॥ ౬౨

టీక ॥ అనుచున్ - ఆస్వరోచితోఁబలుకుచును - చందనపంకపంకిలతలంబై - చందనపంక - శ్రీగంధపుబురదచేత - పంకిలతలంబై - బురదపడనైననేలగలదై - కేతురుద్ధాతపాధ్వనిరుద్ధంబయి - కేతు - ధ్వజపటములచేత - రుద్ధ - అడ్డగించఁబడిన - ఆతపాధ్వ - ఎండగలమార్గముగలదిగనుక నేనిరుద్ధంబయి - చల్లఁదనముగలదై - మంచకోపరికుటీవాటీనటన్నర్తకీజనమై - మంచక - మంచెలయొక్క - ఉపరికుటీవాటీ - పైనున్నగృహపఙ్క్తులయందు - నటన్నర్తకీజనమై - నాట్యముచేయు వేశ్యాస్త్రీసమూహముగలదై - యావతసర్వతః కలితవీటీతోరణస్రగ్జిబంధనమై - యావత - యావనస్త్రీసమూహముయొక్క - సర్వతఃకలిత - అంతటవ్యాపింపఁబడిన - వీటీ - చూపులను - తోరణస్రగ్జిబంధనమై - తోరణపుష్పమాలికలచేతఁగట్టఁబడినదై ఒప్పు - అమరుచున్న - పురంబుసొచ్చి - పట్టణములోఁ బ్రవేశించి - భవనద్వారప్రఘాణంబునన్ - భవనద్వార - గృహద్వారముయొక్క - ప్రఘాణంబునన్ - ముందరిపంచపాళియందు ॥ ౬౨

క ॥ మంత్రులబాంధవభటసా । మంతులనాశ్రితులనిలిపి మహీకాంతుని శా । కాంతమణి కాంతికందళ । కాంతంబగు నొక్క దొరనగర విడియించెన్ ॥ ౬౩

టీక ॥ మంత్రులన్ - అమాత్యులను - బాంధవ...తులన్ - బాంధవ - బంధువులను - భట - భృత్యులను - సామంతులన్ - తనకుసమానమై పరువుగలయిరుగలారుగలదేశపు రాజులను - ఆశ్రితులన్ - ఆశ్రయించియుండువారిని - నిలిపి - నిలువనాజ్ఞాపించి - మహీకాంతుడు - భూమిపతియైన స్వరోచిని - నిశాకాంతమణి కాంతికందళకాంతంబగు - నిశాకాంతమణి - నెలరాలయొక్క - కాంతికందళ - మొలకవంటి ద్యుతులచేత - కాంతంబగు - మనోహరమైయున్న - ఒకదొరనగరన్ - రాజార్హమైనయొకనగరులోన్ - విడియించెన్ - దింపినవాఁడాయెను ॥ ని ॥ మం త్రీధీసచివో మాత్య ఇత్యమరః ॥ ౬౩

వ ॥ విడియించియనంతరంబ యంతఃపుర కాంతాకరాంత సంతన్యమానమణిభాజన నీరాజనమంగళంబులంగీకరించి ప్రియాంగనల సంభావించి మగుడనాస్థానమంటపంబునకేతెంచి మతంగమంకిమంకణమందపాలమరీచిమాండవ్యమార్కండేయాదిమహామునుల రావించి లగ్నంబు నిశ్చయించి గగనచరజంఘాలకర ప్రేషితలేఖతరులేఖాముఖంబులఁ జిత్రరథచిత్రాయుధచిత్రసేనాదులగు గంధర్వులను వరాహకర్ణగజకర్ణను కేతుమాణిభద్రప్రముఖయక్షులను రేవంతప్రముఖగుహ్యకులను మందారముఖ్యవిద్యాధరులను బిలిపించి వినయపూర్వకంబుగా విత్తాధిపతికి విజ్ఞాపనపత్రిక లిఖియించి నిజప్రధానులంబంచి నలకూబరు రావించెనంత ॥ ౬౪

టీక ॥ విడియించి - స్వరోచిని విడిదిలో డింపి - అనంతరంబ - తదనంతరమందు - అంతః...ంచి - అంతఃపుర కాంతా - అంతిపుర స

లంతుకలయొక్క - కరాంత - హస్తములకొనలచేత - సంతన్యమాన - మిక్కిలివిస్తరింపంబడుచున్న - మణిభ్రాజనీరాజన - రత్నమయములైన పళ్లెరములయందలి హారతులయొక్క - మంగళంబులంగీకరించి - శుభక్రియలనాదరించి - ప్రియాంగనలసంభావించి - ఇష్టభావముగలభార్యలసుమన్నన చేసి - మగుడ నాస్థానమంటపంబునకేతెంచి - తిరిగి రాజసభకువచ్చినవాఁడై - మతం...యాది - మతంగ - మతంగుఁడు - మంకి - మంకి - మంకణ - మంకణుఁడు - మందపాల - మందపాలుఁడు - హారీది - హరీది - మాండవ్య - మాండవ్యుఁడు - మార్కండేయాది - మార్కండేయుఁడు మొదలుగాఁ గలిగిన - మహామునులరావించి - పూజ్యులయినబుధులంబిల్వనంపించి - లగ్నంబునిశ్చయించి - పెండ్లిముహూర్తము నిర్ణయించి - గగ...బులన్ - గగనచరజంఘాలకరప్రేషిత - ఆకాశమార్గసంచారులలో నతివేగముగాఁ బోయెడువాని చేతఁ బెట్టిపంపఁబడిన - లేఖతరు - కల్పవృక్షసంబంధమైన - లేఖాముఖంబులన్ - శుభరేఖలమూలముగా, అనఁగాఁ బెండ్లిజాబుల మూలముగా ననుట - చిత్రరథచిత్రాయుధచిత్రసేనాదులగు గంధర్వులన్ - చిత్రరథుఁడు చిత్రాయుధుఁడు చిత్రసేనుఁడు మొదలైన గంధర్వులను - వరాహకర్ణగజకర్ణమణికేతుమాణిభద్రప్రముఖయక్షులన్ - వరాహకర్ణుఁడు గజకర్ణుఁడు మణికేతుఁడు మాణిభద్రుఁడు మొదలయిన యక్షులను - రేవంతప్రముఖగుహ్యకులన్ - రేవంతుఁడు మొదలయిన గుహ్యకులను - మందారముఖ్యవిద్యాధరులన్ - మందారుఁడు మొదలయిన విద్యాధరులను. అనఁగాఁ గ్రిందఁ జెప్పిన దేవయోనివిశేషులనందఱిని ॥ ని॥ విద్యాధరాప్సరోయక్షరక్షోగంధర్వకిన్నరాః - పిశాచో గుహ్యకస్సిద్ధో భూతో మీ దేవయోనయ ఇత్యమరః - పిలిపించి - పిల్వనంపించి - విత్తాధిపతికిన్ - కుబేరునికి - వినయపూర్వకంబుగాన్ - వినీతితోఁ గూడుకొన్నట్టుగా - విజ్ఞాపనపత్రికలిఖియించి - విన్నపపూర్వమైనజాబువ్రాయించి - నిజప్రధానులం బంచి - తన మంత్రులనుబంపించి - నలకూబరు రావించెన్ - కుబేరునికొమారుఁడైన నలకూబరుని రప్పించెను - అంతన్ - అంతట॥ జంఘాలోతిజవస్తుల్య ఇత్యమరః॥ ౯౬

క॥ పసపులనలుగిడి రైదువ। బిసరుహలోచనలు పెండ్లిపెద్దలయాజ్ఞన్। వసుధాధ్యక్షుబుభుక్షున్। కసితాలకభరకఁబేరఁటాండ్రొగిఁబాడన్॥ ౯౭

టీక॥ బిసరుహలోచనలు - పద్మములవంటికన్నులుగలసువాసినులు - పెండ్లిపెద్దలయాజ్ఞన్ - వివాహకార్యమునడిపించుతీర్పరులయొక్క యనుమతిచేత - పేరఁటాండ్రొగిఁబాడన్ - సువాసినులు లెస్సగాఁ బాటలుపాడుచుండఁగా - వసుధాధ్యక్షుబుభుక్షునకున్ - రాజేంద్రుఁడైన స్వారోచికిని - అసితాలకభరకున్ - నల్లనిముంగురులు గలిగినమనోరమకును - పసపులన్ - హరిద్రలచేత - నలుగిడిరి - ఉద్వర్తనముపెట్టిరి - పేరఁటమనఁగా శుభకాలములయందుఁ బసుపుకుంకుమ తాంబూలాదులనిమిత్తమై వారొకరినొకరు పిలుచుట - ఆ పేరంటముగలవారు పేరంటాండ్రు పేరంటమనఁగాను వాసినీత్వం - పేరఁటలు - ముత్తైదువ॥ ఉద్వర్తనోత్సారనే ద్వే ఇత్యమరః॥ ౯౮

ఉ॥ మజ్జనమాడె రాజు కృశమధ్యములింపునవంపగుంపులై - గొజ్జఁగనీటివెల్లువలు గోవజవాజులనిగ్గుఁజూపఁ జం। చజ్జరతాహికంచుకముచాయమణుంగులనొత్తెఁ జెమ్మనీ। రుజ్జగిలన్ వహించె మెయినూఁదినఁ బాఱుమహాలచేలమల్॥ ౯౯

టీక॥ రాజు - ప్రభువైన స్వారోచి - కృశమధ్యములు - మిక్కిలిసన్నమైననడుములుగల స్త్రీలు - ఇంపునవంపన్ - ఇష్టముచేతవంచిపోయఁగా - గుంపులై - దట్టములై - గొజ్జఁగనీటివెల్లువలు - పన్నీటివరదలు - గోవజవాజులనిగ్గుఁజూపన్ - గోవదేశపుసంకుమదముయొక్క జిడ్డుగనుపడునట్లుచేయుచుండఁగా - మజ్జనమాడెన్ - స్నానముచేసెను - చంచజ్జరతాహి - ఒప్పుచుండు ముసలిపాముయొక్క - కంచుకముచాయ - కుబుసముతో సమానకాంతిగల - మణుంగులన్ - చలువమడతలచేత - చెమ్మనీరుజగిలన్ - తడినీళ్లుహరించునట్టుగా - ఒత్తెన్ - తడియొత్తెను - మెయిన్ - శరీరమందు ఊఁదినఁ బాఱు - తగిలిన నెగిరిపోయెడు - మహాలచేలములు - మిక్కిలిసన్నమైనవస్త్రములను - తెల్లపట్టువస్త్రమనియును జెప్పవచ్చును - వహించెన్ - ధరించెను॥ ని॥ క్షౌమందుకూలంస్యాదిత్యమరః॥ ౯౯

చ॥ గరువపునక్కొత్తచెంగలువకచ్చు ఘటించినమౌళిఁజుట్టెఁజెం| దిరికతెఱంగునంబసిఁడితీఁగలునించినజిల్గు
పాగబం| భరసభవాసనాపవనపారణఁదేలనలందెఁగస్తురిన్| మరకతమౌక్తికాదిమణిమండనమండితుఁ
డయ్యెనయ్యెడన్॥ ౧౯

టీక॥ గరువునకొత్త - చెంపకొరుగుటకై - చెంగలువగచ్చు ఘటించిన - ఎఱ్ఱగలువపువ్వురీతిగాఁబింజెగూర్చిన - మౌళిన్ - శిఖపైని - చెందిరికతెఱంగునన్ - చంద్రకావిరీతిగా పసిఁడితీఁగలునించిన - బంగారుతీఁగపనిచేసిన - జిల్గుపాగ సన్నతలపాగ - చుట్టెన్ - వేష్టనముచేసుకొనెను - బంభరసభావాసనాపవనపారణఁదేలన్ బంభరసభ - తుమ్మెదగుంపు - వాసనాపవన పారణఁదేలన్ - పరిమళవాయువుయొక్క-యాస్వాదముచేతఁదృప్తినిబొందఁగా - అలందెఁగస్తురిన్ - మృగమదమునుబూసెను - మరకతమౌక్తికాది పచ్చలుముత్యాలుమొదలైన - మణిమండనమండితుఁడయ్యెన్ - మణిమండన - రత్నఖచితములైనయాభరణములచేత- మండితుఁడయ్యెన్ - అలంకరింపఁబడినవాఁడాయెను - అయ్యెడన్ - ఆసమయమందు॥ ౧౯

మ॥ కదిసెన్లగ్నమటంచుమంత్రులుదొరల్ గంధర్వరాజాజ్ఞను| న్మదవేదండఘటాభటాశ్వరథసేనాజైత్రవాదిత్రసం| పదమీఱంజనుదెంచికాంచిముదమొప్పంజేసిరారూఢుఁగాఁ| గదళీకాంచనకేతుమాలలైయిలేఖస్వామిచౌదంతిపై॥ ౨౦

టీక॥ కదిసెన్లగ్నమటంచున్ - ముహూర్తమునమీపించెనని - మంత్రులు - ప్రధానులును - దొరలు- సరదారులును - గంధర్వరాజాజ్ఞన్- గంధర్వరాజైనయిందీవరాక్షునియానతిచేత- మదవేదండఘటాభటాశ్వరథసేనాజైత్రవాదిత్రసంపద - మదవేదండఘటా - మదించినయేనుఁగులగుంపులును - భట - బంటులును - అశ్వ - గుఱ్ఱములును రథ - తేరులునను- సేనా - చతురంగబలములయందు-జైత్రవాదిత్రసంపద- జయశీలములైనభేరీకాహళాదివాద్యములయొక్క-సంపత్తి - మీఱంజనుదెంచి - అతిశయించఁగావచ్చి - కాంచి - చూచి - ముదమొప్పన్ - సంతోషమమరునట్టుగా - కదళీకాంచనకేతుమాలన్ - కదళి - ధ్వజములచేతను - కాంచనకేతుమాలన్ - సువర్ణవికారమైననడుముకట్టుపట్టలచేతను - మెఱయు - ప్రకాశించెడు- లేఖస్వామి ఇంద్రునియొక్క - చౌదంతిపైన్ - నాలుగుకొమ్ములుగల తెల్లయేనుఁగుమీఁద - చేసిరారూఢుఁగాన్ - స్వరోచినినెక్కించినవారైరి॥ ని॥ దూష్యాకత్వ్యావరత్రాస్యాత్ - లేఖా అదితినందనాఃకరిణాంఘటనాఘటేతిసర్వత్రామరః॥

ఉ॥ అత్తఱిపట్టణంబువికచాంబురుహాక్షులు కౌతుకంబునం| జిత్తములుల్లసిల్లఁగయిసేసిగృహాంగణసౌధమాలికల| హత్తినరేంద్రవీథిఁజతురంగబలంబులుగొల్వఁగామరు| న్మత్తగజంబుపైఁజనుకుమారశిరోమణిఁగాంచిరుబ్బునన్॥ ౨౧

టీక॥ అత్తఱి - ఆసమయమందు-పట్టణంబు- పురములోనున్నట్టి - వికచాంబురుహాక్షులు - వికసించినతామరరేకులవంటికన్నులుగలస్త్రీలు - కౌతుకంబునన్ - సంతోషముచేత - చిత్తములుల్లసిల్లన్ - మానసములుల్లాసమునుబొందఁగా - కయిసేసి - శృంగారించుకొని - గృహాంగణసౌధమాలికల్ హత్తి - గృహాంగణ - ఇండ్లముందరి - సౌధమాలికల్ హత్తి - మేడచాలుపులయందుఁజేరుకొని - నరేంద్రవీథిన్ - రాజమార్గమందు- చతురంగబలంబులుగొల్వఁగాన్ రథగజతురంగపదాతులుగొలిచిరాఁగా - మరున్మత్తగజంబుపైన్ - దేవతాసంబంధమైనమదపుటేనుఁగుమీఁద- అనఁగా నైరావతగజముమీఁదను-పోవుచుండెడు-కుమారశిరోమణిన్ - కోమరువయసుగలవారిలోమేటియైనస్వరోచిని-చూచిరుబ్బునన్-సంతోషముచేతఁగనుఁగొనిరి॥ ౨౧

ఉ॥ అంచెలుగట్టికాలితొడుసై చనసీవుగదమ్మ ప్రోదిరా| యంచలివేటిసంగడములయ్యెనుదయ్యమవేటి
వేడ్క-నా| కంచుఁబడంబునన్మొరయనందియ యూడఁగఁదన్నిపోయెవీ| ఢించెలతాంగిమోహార్తమురజిన్నిభు
పాగరమేఖలావిభున్॥ ౨౨

టీక॥అంచెలు గట్టి- అనుపులనుపులుగట్టి - కాలితొడుసై- కాళ్లచిక్కు-యి - ప్రోదిరాయంచలు - పెంపుడురాజహంసలు - అనఁగాముక్క-నుగాళ్లును నెఱుపునుగడమంతయుఁ దెలుపుగలవిరాజహంసలు- చనసీవుగదమ్మ - పోనియ్యవుకదమ్మ - ఇవేటిసంగడములయ్యెన్ - ఇవియెట్టిసంకటములాయెను-ఇవియెట్టిజతలాయెనని వ్యాఖ్యాంతరము - దయ

మ-దైవమా - వీటివేడ్క-నాకంచుక - నాకిఁక నెక్కడి వేడుకయని - పదంబునన్మోరయు - కాలియందుమ్రోయుచున్న - అందియ - అందె - ఊడఁగఁదన్నిపోయి - వదిలిపోవునట్టువిదిలించి- కాలుజాడించిచని-లతాంగియో గ్గు-తీఁగవంటిదేహముగలయొక స్త్రీ - మురజిన్ని భ - కృష్ణమూర్తితోసమానుఁడైన- సాగరమేఖలావిభు - భూమిభుని - అసఁగాస్వరోచిని - వీక్షించె - చూచెను ‖ అనఁగానం దెలమ్రోతహంసలయొక్క-పటపటక్రేంకారములవలెనుండునదిగనుక సజాతీయభ్రాంతిచేతఁగాళ్లకడ్డమువచ్చి పెనఁగుచునడవనియ్యకుండఁగానం దెయూడఁగన్ని వానిభ్రాంతినిబోఁగొట్టి-గవన ప్రతిబంధనివారణము చేసుకొనిపోయెనని భావము‖ ౭౨

చ ‖ వలపులపల్లవుండొకఁడువట్టివలంబున నేఁగదీనయై । యలుకలుదీర్చితీర్చియొకయచ్చరవచ్చినృపాలునన్న గ । ర్వ్యలువడిచూచెఁగాముకుఁడు వెంట నేరానపుడాత్తఘర్మయై । వెలవెలఁబాఱెఁదన్ముఖము వెల్వెలఁబాఱవిటాననాబ్జముల్ ‖ ౭౩

టీక ‖ వలపులపల్లవుండొకఁడు - ఒకప్రేమాస్పదుఁడైనవిటుఁడు - వట్టివలంబున నేఁగ - అక్కర లేనిపంతముచేత వ్యథపెట్టఁగా - దీనయై - దీనురాలై - అలుకలుదీర్చితీర్చి వానికోపములుమాన్చిమాన్చి - ఒకయచ్చరవచ్చి - ఒకానొకయప్సరస్త్రీయేతెంచి - నృపాలు - రాజైనస్వరోచిని - అన్నగర్వ్యలువడిచూచె-ఆదివాణములోనుండిబయలుదేఱికనుఁగొనినదాయెను - కాముకుఁడు వెంటనేరా - ఆవిటకాఁడునుడోడరాఁగా - అపుడు - ఆసమయమందు ఆత్తఘర్మయై- పొందఁబడినచెమటగలదై - అసఁగాదేహముచెమర్చి - వెలవెలఁబాఱెఁదన్ముఖము- దాని మోము తెల్లఁబోయెను - వెల్వెలఁబాఱెవిటాననాబ్జము - అంతటవిటునియొక్క-ముఖమును దెల్లఁబోయెను ‖ ఇక్కడనిద్దరిముఖములును దెల్లఁబోయిన భావమేమనఁగా- విటునినిరసించి రాజునుజూడవచ్చినట్టుగావిటునకిఁదోఁచెనుగదాయని స్త్రీముఖము తెల్లఁబోయెననియు - తనపంతముచెల్లకపో యెనుగదాయనివిటునిముఖము తెల్లఁబోయెనని భావము‖ ౭౩

చ ‖ చిలుకలకొల్కికల్కి-యొకచేడియనాటకసాలమేడపై । నిలువుననాడుచుండిధరణీశుఁజూడఁదలంచియంచున । న్నిలిచివిరహింగనుంగొనుచు నెయ్యమునందనువల్లియుబ్బికం । చెలదెగిబడ్డకే తనముచీరచెఱంగు నమూనెజన్నులన్ ‖ ౭౪

టీక ‖ చిలుకలకొల్కి - శ్రేష్ఠమైనచిలుకలవలెనున్న - కల్కి - సౌందర్యముగలిగిన - ఒక చేడియ - ఒకయప్సరస నాటకసాలమేడపై - నృత్తశాలయైనమిద్దెమీఁద- నిలువునాడుచుండి - నిలువఁబడినాట్యముచేయుచుండి - ధరణీశుఁజూడఁదలంచి - స్వరోచినివీక్షింపవలెనని యెంచుకొని - అంచునన్నిలిచి - ఆమేడకొనలోనిలుచుండి - రహింగనుంగొనుచు - వేడుకచేతఁజూచుచును - నెయ్యమున స్వరోచియందలిప్రేమచేత - తనువల్లియుబ్బి - తీఁగవంటిశరీరముపొంగి - కంచెలదెగిపడ్డ-నాట్యమాడుస్త్రీలు మొగ్గవాలుటమొదలైనయాటయందు బిగువానముకొఱకుఁ జన్నులమీఁదఁగట్టుగుడ్డకట్టుకుఁబేసుకంచెల - అదితెగిపడిపోఁగా - కేతనము చీర చెఱంగునన్ - ధ్వజపటపుకొంగుచేత - మూసెఁజన్నులన్ - స్తనములనుగప్పుకొనెను‖ ౭౪

ఉ ‖ కీరమనోజ్ఞవాణియొకకిన్నరికిన్నెరమీఁటిమీఁటియొ । య్యారపులీల నేగివసుధాధిపుఁగన్గొనెఁజిల్గుపయ్యెద । హారముచక్కఁబెట్టెడుకుచాహితహస్తముపైఁడిగోళ్లహిం । సారతిసేయుదర్పకుని సంపఁగిములుకులవోలెమించఁగన్ ‖ ౭౫

టీక । కీరమనోజ్ఞవాణి - చిలుకవలెనేమనోహరమైన పలుకులుగల - ఒకకిన్నరి ఒకకిన్నరిస్త్రీ - కిన్నరులనఁగా మనుష్యముఖమును గఱ్ఱపుశరీరముగల దేవయోనిభేదములు - కిన్నెరమీఁటిమీఁటి - కిన్నెరయనఁగా వీణెలోభేదము - ఆది వాయించుచునుండి - ఒయ్యారపులీల నేగి-విలాసవైఖరితోఁబోయి - జిల్గుపయ్యెద - సన్నపుపైఁటయందు - హారము - ముత్యాలసరమును - చక్కఁబెట్టెడు-సవరించుచునుండు-కుచాహితహస్తము - చన్నులమీఁదనుంచినచేతియొక్క - పైఁడిగోళ్లు - కిన్నెరతీఁగలుమీఁటునిమిత్తము - పెట్టుకొన్న బంగారపునఖములు - హింసారతిసేయు - విరహిజనములయొక్కయుపద్రవమందలియాసక్తి చేయుచునుండు - దర్పకుని - మన్మథునియొక్క - సంపఁగిములుకులవోలె - చంపకపుష్పబాణములవలెనే - మించఁగన్ - అతిశయించుచుండఁగా- వసుధాధిపుఁగన్గొనెఁ - రాజైనస్వరోచినిజూచెను ‖ అనఁగానాయయ్యారముగాఁజన్నులమీఁదిపైఁటచెఱఁగును - ముత్యాల హారమునుసవరించుకొనుచునే భిప్రాయమునుగాఁజూచెననుట‖ ౭౫

టీక ॥ ఒకచాన - ఒకస్త్రీ - జలకములాడియాడి - స్నానములు చేసిచేసి - జిలుగులఁ బెట్టుచున్ - సన్నపుమడుఁగుల చేతఁ దడియొత్తుకొనుచును - తొడఁ జెంద్రికపావడయంటన్ - ఊరువులయందుఁ జంద్రకావి పావడ యంటుకొనఁగా - మైతడిన్ - శరీరముయొక్క ద్రవముచేత - పెళపెళలేనిచీరన్ - పెళపెళలాడుటలేక మృదువైనకోకను - కటిన్ - మొలయందు - బింకపుచన్నులన్ - బిగువుగల పాలిండ్లయందును - చేర్చికొంచున్ - పొందించుకొనుచు - వే - శీఘ్రముగా - కరస్థితకేశయై - హస్తమందున్నతలవెండ్రుకలు కలదై. అనఁగా దలవెండ్రుకలు చేతఁ బూనుకొన్నదై లోఁబడితి నీకని - నీకు స్వాధీనురాలనైతిని సుమీ యని బాసను నిల్చెనోయనన్ - ప్రమాణము చేయుకొనుచు నిల్చినదోయనునట్టుగా - నృపున్ - రాజును - వెలువడిచూచెన్ - బయిటికివచ్చి వీక్షించెను॥ లోకమందు ఘోరప్రమాణము చేయువారు తలవెండ్రుకల ముడివిడిచి తడిబట్టలతోఁ బ్రమాణము సేయుట ప్రసిద్ధము॥ పావడ యనఁగా యోగాంతరీయమని యాంధ్రభాషార్ణవము॥ ౭౯

మ ॥ ఒకనేత్రాంబుజమొక్కగల్లమొకచన్నొయ్యారపున్ లీలవీ। థికిఁ దోఁపం దలుపోరగా నొకపురంధ్రీర
త్నమీక్షించె రా। జకిశోరంబుఁ దదీయలై వెలయుభాషాలక్ష్ములం జూచి త్ర్యం। బకభాగంబు మొరంగి మైత్రి
కి శివాభాగంబు నేతెంచెనా॥ ౮౦

టీక ॥ ఒకనేత్రాంబుజము - ఒకకన్నుదామరయును - ఒకగల్లము - ఒకచెక్కును - ఒకచన్ను - ఒకస్తనమును - ఒయ్యారపున్ లీలన్ - విలాసగతిచేత - వీథికిఁ దోఁపన్ - వీథికిఁ గనుపడునట్టుగా - తలుపోరగాన్ - కవాటము కొంచెము తెరుచుకొని యోరవైపుగా. ఒకపురంధ్రీరత్నము - శ్రేష్ఠురాలైనయొకస్త్రీ - రాజకిశోరంబున్ - రాజకుమారుఁడైనస్వరోచిని - ఈక్షించెన్ - చూచెను - ఎట్టులనఁగా - తదీయలై వెలయు - అతనికి స్వాధీనలై యొప్పుచును - భాషాలక్ష్ములం జూచి - సరస్వతిని లక్ష్మిని జూచి - త్ర్యంబకభాగంబు మొరంగి మూఁడుకన్నులు గలశివునియొక్క యంశమును బాసి - మైత్రికిన్ - ఆలక్ష్మీసరస్వతులతోడి స్నేహము చేయుకొఱకై - శివాభాగంబున్ - పార్వతియొక్కయంశమును - ఏతెంచెనాన్ - వచ్చెనోయనునట్టుగా నే - చూచెనని సంబంధము॥ ఇక్కడఁ బార్వతి శివుని లో సగము శరీరమనుట ప్రసిద్ధము॥ ని॥ త్ర్యంబకస్త్రీపురాంతక ఇత్యమరః॥ ౮౦

మ ॥ కలయం గూర్మిఁ జెమర్చునంగముల లగ్నంబైన సన్నంపుమం। జులకౌశేయమునందు మించుగమలస్తో
మంబుచేఁ జూచె నొక్కలతాతన్వి చెలంగి పొంగు మది గాంతుద్ధీర మేనెల్లఁ గ। న్నులుగావించి కుమారుజవ్వ
నము చెన్నుం జూచుచందంబునన్॥ ౮౧

టీక ॥ ఒక్కలతాతన్వి - తీఁగవంటి దేహముగలయొకస్త్రీ - చెలంగి - ఉత్సహించి - ఉప్పొంగుమదిన్ - ఉబుకుచుండు మనస్సునందలి - కాంతుద్ధీరన్ - కోరికలు తుదముట్టునట్టుగా - మేనెల్లఁ గన్నులు గావించి - శరీరమంతయు నేత్రములు చేసుకొని - కుమారు - కొమరుప్రాయముగలస్వరోచియొక్క - జవ్వనమున్ - యౌవనమును - చెన్నున్ - చక్కఁదనమును - చూచుచందంబునన్ - చూచినదోయనునట్టుగా - కలయన్ - అంతటవ్యాపించునట్టుగా - కూర్మిఁ జెమర్చు - ప్రేమచేతఁ జెమ్మగిలుచున్న - అంగములన్ - అవయవములయందు - లగ్నంబైన - అంటుకొన్న - సన్నంపు - సూక్ష్మమైన - మంజులకౌశేయమునందున్ - మనోహరమైన పట్టుతాప్తాయందు - మించు - ఒప్పుచుండు - కమలస్తోమంబుచేన్ - చిత్రముగా వ్రాసినపద్మములసమూహముచేత - చూచెన్ - వీక్షించినదాయెను— ఇక్కడ స్త్రీ గట్టినపట్టుతాప్తాపితాఁదను గమలాకృతులుగా బస్మాబుటాలు తీర్చియున్నవని విచారించవలెను॥ స్తంభః ప్రళయరోమాంచాస్స్వేదో వైవర్ణ్యవేపథూ - అశ్రు వైస్వర్యమిత్యష్టౌ సాత్వికాః కౌశేయం క్రిమికోశోత్థమితి॥ ౮౧

వ॥ ఇత్తెఱంగున ననంగరంగ సంతరంగంబులుం గలకురంగాక్షులయపాంగంబులం దుఱంగలించు సితేతరత
రళ తరచ్ఛగ్రోచులనభంగశృంగారరసవీచుల చాలునంబోలెఁ బొలుపొంబడి యాలంబిత చీనాంబర ప్రాలంబ
మాలికా చిత్రమ్ములగు నాతపత్రమ్ములు మెఱయఁ బత్రమ్ములడిగ్గి దుర్గాధిపతు లేమే మయని త్రోపుత్రోపాడుచు
వీచు వీచోపుల స్వచ్ఛమ్ములగు కౌముదీగుచ్ఛమ్ముల సంతరింపనంతిక వైజయంతికలం గ్రాలు పలువలంబొలయు
చిఱుగరువలిం దూలు నీలాలకలయలకల్లుభయపార్శ్వ సముత్తుంగమత్తమాతంగమద సౌరభసంగిభృంగసం
ఘంబుల నెలయించుపనింపారు కలహంబులబ్బాటునం జేటులెత్తి యొండొరుల యొత్తడింబోడి పాడిమైయెంగ
యొయ్యవిస్ఫురద పరాగపరాగంబు చదల నెల్లెడనల్లెడవట్టి నట్టనడుమ రదట్టదట్టమ్ముగ పొగు నాగరుల వాగారవమ్ము
లు నిగుడ నెడవడక పొగడుపొగడి కలకలకలంబులును బుంఖానుపుంఖశంఖభేరీ పటహ కాహళ వేణువీణాది
వాదనధ్వానంబును గల మధురకిన్నరీ నిక్వాణంబుల రాణం ద్రాణ చెఱచు విన్నాణంబులు గొలుపు మెలు
గుల వేల్పుగాణలు వాడు లక్ష్మీనారాయణుల కళ్యాణంపుఁ బాటలందీటుకొను తిన్ననిగవంబులం గలసిబ
సికొను కోలాహలమ్ములిమ్ములతో సందడుల నెడ గలుగం జడియు వేత్రహస్తుల ప్రశస్తతర పాహిపాహి నా
దంబు సంబంధించి పెంపొలయ నత్యంత కాంతంబై నిరంతరగతిం గ్రంతనడవ నడదివియలై కుకుటారవింద గా
గంబులు వెలుంగ నలుగడల సామంతసందోహంబు గ్రందుకొన నందఱుం దగ మునుంగ మునుం జనుబృందారక పేసం
ఘంబు పెన్నుద్దిండత నుచ్ఛాయాకలాపంబు జంబేటి జంబాల కదళిబకంబు డంబు విడంబింపఁ దిన్నని రవంబునం గ
లసిబలసిన కోలాహలంబు హంసాదివిహంగమహృదయంగమ రావంబును బెడంగువడ నడచు గ్రంతనత్యంత
దర్శనీయంబులై మెఱయు మంగళద్రవ్యంబుల నెడ నెడం దీండ్రించు పుండ్రేక్షుకాండంబుల కడలం గడలుకొను ప
సరుటాకుల డాలుశైవాలంబునం దనర గ్రందుగా మండు చేదివియలు చెందొవలనుం గాఁ బార్శ్వద్వయ సము
త్తుంగమణి సౌధవీధికా రోదోంతరాళంబున గంధగజ ఘటాఘనాఘన కాంతిక ధూళి మాగధ ప్రవాహంబు
సంగూలంకషంబగు నృపతిపథయమునా ప్రవాహంబు గగనగంగావగాహనాభ్యాసంబున నిండుకొని పోవు నదియు
నుం బోలెఁ దనరఁ దన సముద్దామ తేజోభరంబున జడిసిన మేరుగిరి మేనులం బోలెం దీరుగల భుజంబులం
దారుమారుగా నిడిన తారతారంపు పంచసరంబులు దోరంతరహారంబులు గేయూరహారంబులు గరకంకణ
కురువిందకం దళంబులు గటికనక మేఖలా ఘటితంబగు చారుకరాచరీ మరకతంపు పిడి మెరుంగులుం ద
ఱసి వెన్నెల క్రొన్నురువులం బోలనన్నగు నరపడుగు జిలుగు కంచుకంబున మించి వెలుపలం దోఁప మంచుగ
విసిసరోషాణ మహీధరంబునుం బోలె రాజభవనాంగణంబు చేరవచ్చె నంత నక్కడ॥ ౯౧

టీక॥ ఇత్తెఱంగునన్ - ఈ ప్రకారముగా - కరంగు - కరిగి
పోవుచుండు - అంతరంగంబులుం గల - మనస్సులుగలిగిన
కురంగాక్షుల - స్త్రీలయొక్క - అపాంగంబులందుఁ దుఱంగ
లించు - క్రేగన్నులయందుఁ జెంగలించుచున్న - సితేతర
తరళతరచ్ఛగ్రోచులన్ - నల్లనై మిక్కిలి చలించుచున్న చూ
పులయొక్క - కాంతులచేత - అభంగశృంగారరస వీచులచా
లునంబోలెన్ - భంగములేని శృంగారరస తరంగములయొ
క్క పంక్తి చేతఁ బోలె - పొలుపొంబడి - వ్యాపింపఁబడినవాఁ
డై - ఆలంబిత చీనాంబర - అవలంబింపఁబడిన చీనాపట్టు
వస్త్రముల చేతను - ప్రాలంబ మాలికా - వంకర లేక వ్రేలు
చుండు జాలరుల చేతను - చిత్రమ్ములగు - ఆశ్చర్యకరములై
న - ఆతపత్రమ్ములు మెఱయన్ - గొడుగులు ప్రకాశించఁగా
పత్రమ్ములడిగ్గి - వాహనములపై నుండి దిగి - పత్రం వాహ
న పతంగయోరిత్యమరః - దుర్గాధిపతులే మేమయని - దుర్గము
లకుఁ బ్రభువులై రాజులు మేమే మేమేయని - త్రోపుత్రో
పాడుచున్ - ఒకరినొకరు తోసుకొనుచును - వీచువీచోపు
లు - వేయుచుండు వింజామరలు - అనఁగా వెల్లచామరలు - అ
చ్ఛమ్ములగు - స్వచ్ఛములైన - కౌముదీగుచ్ఛమ్ముల సంత
రింపన్ - వెన్నెలగుత్తులను గల్పించఁగా - అంతిక - సమీ
పమందలి - వైజయంతికలం గ్రాలు - కేతనములయందుఁ గ్రా

శోభించుచున్న - వలువలంబోలియు వస్త్రముల వలనవ్యాపించుచున్న - చిఱుగరువలిందూలు - పిల్లవాయువులచేత దూగాడుచున్న - నీలాలకల - నల్లనిముంగురులుగలస్త్రీలయొక్క - అనఁగావయస్సస్త్రీలయొక్క-యనుట-అలకలు ముంగురులు - ఉభయపార్శ్వ - ఈవలావలిప్రక్కల యందలి - సముత్తుంగ - మిక్కిలియున్నతములైన - మత్తమాతంగ - మదపుటేనుఁగులయొక్క - మదసౌరభసంగి - దానోదకవాసనలనుబొందియున్న - భృంగసఘంబులన్-తుమ్మెదగుంపులను - ఎలయింపన్ - ఉల్లసింపఁజేయఁగా-ఇంపారు - మిక్కిలియిష్టమౌచున్న - కలవంబులు - చందనాదిలేపనములు - అబ్బాటునంజేటులెత్తి - మందికాఁడ్రచేత నెండిబీటికలువాటి - ఒండొరుల యొత్తిడిన్ - ఒకరొకరియొత్తుడుచేత- పొడిపొడియై రొంగయు- నలిగిచూర్ణమైయెగురుచునుండు - విస్ఫురద - వ్యాపనశీలమైన పరాగపూగంబు - ధూళిసమూహము చదలనెల్లెడన్ - ఆకాశమందంతటను - ఉల్లోచవట్టినట్టమరన్ - ఉల్లచముపట్టినటొప్పఁగా - చట్టనట్టమ్మగసాగు - తోఁద్రోపులుగానడుచుచునుండు నాగిరుల - పురజనుల యొక్క - వాగారవమ్ములనిరుడన్- మాటలసందడులతిశయించఁగా - ఎడవడకపొగడు విరామములేక డస్తోత్రముచేసెడు - పొగడికలకలకలంబులును - కైవారముల యొక్క-కోలాహలములును పుంఖానుపుంఖ తరతరము లౌచున్న - శంఖ - దింబును - పుంఖానుపుంఖ తరతరమ లౌచున్న - శంఖ - దిండిములును - భేరీ - పెద్దనగారులు - పటహ - తప్పెటలు - కాహళ - తుతారలు - వేణు పిల్లనగ్రోవులు వీణాది- వీణలుమొదలుగాఁగల వాదనధ్వానంబును- వాద్యములయొక్క-ధ్వనులును - కలసుఘుకకిన్నరీ - అవ్యక్తవ ధురములైనకిన్నరీవీణలయొక్క - నిక్వాణంబులరాణన్ - ప్రమోదవైఖరిని - ప్రాణముచెలుకు రక్తిగట్టునట్టి- విన్నాణంబులు గొల్పు మెలుంగుల-చమత్కృతిగనుపట్టుచున్నస్వరముల తోడి వేల్పుగాణువాడు - అప్సరస్త్రీలుపాడుచుండు లక్ష్మీనారాయణుల - శ్రీమహాలక్ష్మీ-విష్ణుదేవులయొక్క-కళ్యాణంపు పాటలందిట్టు ను - పెండ్లిపాటలయందొప్పుచుండు - తిన్ననిరవంబులన్ మృదువైనసాదములను- కలసి - ఏకీభవించి - అనఁగానొక్కటిగాఁగలుసుకొని బలసికొను బలమౌచున్న - కోలాహలమ్ములు కలకలములు - ఇమ్ములతోన్ - ఉపాయముగా సంకటములనెడగలుగంజడియు న్నడఁచుచున్న - వేత్రహస్తుల - వేత్రపాణులయొక్క - అనఁగానకీబులయొక్క - ప్రశ - ధించి - ప్రశస్తతర - ప్రసిద్ధములైన - సావధానాదంబు సంబంధించి - పరాకుహెచ్చరికయనువాక్యధ్వనులతోడఁగలసి పెంపొలయన్ - అతిశయించఁగా - అత్యంతకాంత బై మిక్కిలిమనోహరమై నిరంతరగతిన్ - ఎడబాటులేకుండ క్రంతనడవన్ - పెండ్లికొడుకువాండ్రు పెండ్లికొమార్తెను బ్రధానముచేసి కొమనిమిత్తమై పట్టుకొనిపోవుస్తుసమూహమునకుఁగ్రంతయనిపేరగుకయ్యటి క్రంతనడుచుచునుండఁగా నడదివియలై నడకలదివిటీలనియన్నట్టుగా- కుకుటారవిందశాగంబులు వెలుంగన్- కిరీటములయందలిపద్మరాగమణులు ప్రకాశించఁగా - నలుగడలన్- నాలుదిక్కులయందు - సామంతసందోహంబుగ్రందుకొనన్ - సమానప్రతిపత్తిగలరాజసమూహముసందడిఁజేయుచుండఁగా - మందమందగమనంబునంజను మిక్కిలితిన్నగతిచేతనడుచుచునుండు బృందారకవేదండంబుపైన్ - ఐరావతగజముమీఁద - ఉద్దండతనుచ్ఛాయాకలాపంబు - ఉత్కటమైనశరీరకాంతిసమూహము జంబేటి - జమ్మూనదీసంబంధమైన జంబాలకదంబకంబుడంబున్ బురదవపూఁతయొక్క-సొగసును విడంబింపన్ - ప్రకటముసేయఁగా - తిన్ననిరవంబునంగలసి మృదువైనధ్వనితోడఁగలుసుకొని - బలసినకోలాహలంబు-బలమైనకలకలము - హంసాదివిహంగమ-మరాళములు మొదలైనపక్షులయొక్క- మృదయంగమరావంబును - మనోహరమైనవాక్యధ్వనియును జెడంగువడవడచు గ్రంతన్ - ప్రకటమౌనట్లు గానడుచుచునుండు ప్రధానద్రవ్యసమూహమందు - అత్యంతదర్శనీయంబులై - మిక్కిలిచూడఁదగినవై - మెఱయు - ప్రకాశించు- మంగళద్రవ్యంబులన్ - శోభనవస్తువులలో - ఎడనెడందిఁద్రిమ్మట తటంతట మెఱయుచున్న పుండ్రేక్షుదండంబుల - తెల్లచెఱుకుగడలయొక్క - కడలఁగడలుకొను - చివరలయందొప్పుచున్న - పసరుటాకులడాలు - పచ్చనియాకులయొక్క-కాంతి - శైవాలంబును - పాచితీఁగలును- అందండఁగ్రందుగామండు - అంతటంతటకవళిగా వెలుఁగుచున్న చేడియలు - కరదీపికలు - చెండోవలు మంగారు - యెట్టిగలువలు గాను - పార్శ్వ...బునన్ - పార్శ్వద్వయ రెండువైపుల యందును - సముత్తుంగ - మిక్కిలిపొడవైన-మ

నఅంగుళీముద్రిక - వ్రేళ్లయుంగరాలును - ఆదిభూషలుదొడి - మొదలైనసొమ్ములు పెట్టుకొని - పారి...బూని - పారిజాత - కల్పవృక్షములయొక్క - వికసత్ప్రసవావళి బూని - నగమువికసించినపుష్పములుధరించి - ఒయ్యన్ - మెల్లగా అవ్వేలది - అనునెూరమ - వివాహవేదికన్ - పెండ్లియరుగుమీఁదికి - అలివేణులు దేన్ - స్త్రీలు వెంటఁబెట్టుకొని రాఁగా - చనుడెంచెసిగ్గునన్ - లజ్జవచుచువచ్చినదామెను పారిహార్యమనఁగా వంకీ యనియుఁ జెప్పవచ్చును॥ ఆవాపక పారిహార్యః - కటకో ప్రకోష్ఠకపద్మతీత్యు భయ త్రామరః॥

తే॥ ఇటగృహద్వారసీమకు నేగుదెంచు। నాకుమారునకిందీవరాక్షుఁడెదురు। చనిమరుత్కరిడిగ్గి వందన మొనర్చు। నతని దీవించి హితమంత్రియుతముగాఁగ॥ ౯౪

టీక॥ ఇటన్ ఇక్కడ - గృహద్వారసీమకున్ - సింహద్వారముముందరికి - ఏగుదెంచు - వచ్చిన - ఆకుమారునకున్ - ఆస్వరోచికి - ఇందీవరాక్షుఁడెదురుచని - ఇందీవరాక్షుఁడెదురుగాఁబోయి - మరుత్కరిడిగ్గి - ఐరావతగజమును దిగి. వందన మొనర్చు - నమస్కారముచేసిన - అతని దీవించి - ఆస్వరోచిని నాశీర్వదించి - హితమంత్రియుతముగాఁగన్ - ఇష్టులతోఁ బ్రధానులతోఁ గూడ॥ ౯౪

వ॥ భూసురాశీర్వాదనాదంబులు రోదసి నిండ నభ్యంతరగృహంబునకుం దోడ్కొనిపోవునప్పుడప్పుడమిఱేఁడెడనెడం బుణ్యాంగనలు సంగుప్తనీరాజనోపచారమ్ములాదరింపుచుం గక్ష్యాంతరద్వారదేశంబుల మంగళార్థంబు గానిడిన పూర్ణకలశమ్ము మొదలైన పదార్థంబులఁ గనుంగొనుచుఁ దోరణస్తంభాయమానరంభాతరుకిసలయోత్తాలతాలవృంతానిలంబులఁ గుంతలంబులు చలియింపమంథరగతిఁ గింపురుషవృషభుండగు గంధర్వరాజప్రధానుండు తోడ్కొనివచ్చి దండఁ గొని యల్లనల్లన నడిచి పురోహితబ్రాహ్మణబంధుపురంధ్రీసందోహనీరంధ్రంబై వైవాహికక్రియారంభసంభారసంభ్రమద్రంభాదిమరుద్రంభోరువులకలికి సూనుసోగపలుకుల కలకలంబు నగొలగొలమను కౌతుకాగారంబు సొత్తెంచి॥ ౯౫

టీక॥ భూసురాశీర్వాదనాదంబులు - బ్రాహ్మణులదీవెనలధ్వనులు - రోదసినిండన్ । భూమ్యాకాశమధ్యభాగమంతయు సంపూర్ణము కాఁగా - అభ్యంతరగృహంబునకున్ - లోపలినగరికి - తోడ్కొనిపోవునప్పుడు - వెంటబెట్టుకొనిపోవు సమయమందు - అప్పుడమిఱేఁడు - భూమికి రాజైన యాస్వరోచి - ఎడనెడన్ - మధ్యమధ్యను - పుణ్యాంగనలు సంగుప్తైదువలిచ్చుచుండు - నీరాజనోపచారమ్ములాదరింపుచున్ । మంగళారతులనంగీకరింపుచును - కక్ష్యాంతరద్వారదేశంబులన్ - భవంతులయొక్క వాకిళ్లయందు - మంగళార్థంబు గానిడిన - శుభనిమిత్తముగానుంచిన । పూర్ణకలశ అలంకరించినిండనీళ్లునించిన - బంగారుబిందెలును - ముకుర - అద్దములును - ఆదిపదార్థంబులఁ గనుంగొనుచున్ - మొదలైనవస్తువులనుజూచుచును - తోర...బులన్ తోరణస్తంభాయమాన - తోరణకంబములౌచున్న - రంభాతరు - అరఁటిచెట్లయొక్క - కిసలయ - మోపుటాకులను - ఉత్తాల - ఎత్తుగల - తాళవృంతానిలంబులన్ - తాటాకువిసనకఱ్ఱలవలని వాయువుచేత - అనఁగా నరఁటిమోపులుచలించఁగాఁబుట్టిన వాయువు చేతననుట । కుంతలంబులుచలియింపన్ । తలవెండ్రుకలుకదలియాడఁగా - మంథరగతిన్ - మెల్లనినడచేత - కింపురుషవృషభుండు - కింపురుషులలో శ్రేష్ఠుఁడైన - గంధర్వరాజప్రధానుండు తోడ్కొని - ఇందీవరాక్షుఁడు మంత్రియుచ్చుచున్నకై దండఁగొని - చెయ్యిసాయమవలంబించి - అల్లనల్లనడిచి - తిన్నతిన్నగా నడిచి - పురో...బై పురోహిత । పురోధస్సులయొక్క - బ్రాహ్మణ - విప్రులయొక్క - బంధు - చుట్టములయొక్క - పురంధ్రీ - ముత్తైదువులయొక్క - సందోహ - సమూహముచేత - నీరంధ్రంబై - ఎడములేకుండనున్నదై - వై వా...వుల - వైవాహిక - వివాహసంబంధమైన క్రియారంభ సంభార - క్రియయొక్క ఆరంభమందలివస్తువులు సాధించుట యందు సంభ్రమత్ - తొట్రుపడుచున్న రంభాది - రంభ మొదలుగాఁగల - మరుద్రంభోరువుల - దేవతాస్త్రీలయొక్క - కలికి - చక్కనైన - సూను - మృదువైన - సోగపలుకుల - తీఁగదీసినట్లుగా

పూర్వకమైన నమస్కారముతోడ - పరిపూర్ణనిష్ఠన్ - సంపూర్ణమైననియమశ్రద్ధచేత - కొల్చిరి - సేవించిరి - ఉడుపీథిన్ - నక్షత్రవీథియందు - అక్షీణనాశము లేని - సుస్థితిన్ - లెస్సయైనయునికియందు - స్థాయిన్ - ఉన్నవాఁడైన - తోషితరమాధవునిన్ - సంతోషపెట్టఁబడినలక్ష్మీపతియైన నారాయణమూర్తిగలిగిన - ధ్రువున్ - ఔత్తానపాదిని - వీక్షించిరి - చూచిరి - పరి...సతికిన్ - శరణయప్రాప్త - వివాహనిమిత్తమై వచ్చిన - సప్తర్షిప్రియా - పడుగురుమునులయొక్క భార్యలలో - ప్రేక్ష్య | చూడఁదగినయున్న - సాధ్వీమణి యైన యరుంధతీసతికిన్ ప్రత్యక్షమై నయరుంధతీదేవికి - వినతి - నమస్కారముచేసిరి - సకలసంయమిగణ సమస్తమునిసమూహమునకు - నమస్కరణకృత్యమాచరించి - నమస్కారముచేసి - తదీయ - వారియొక్క - హస్తాభిమంత్రితాక్షతలు - కరములచేతనభిమంత్రించఁబడినయక్షతలు - అత్యాదరమునన్ - మిక్కిలియాసక్తిచేత - మౌళిఁదాల్చిరి - శిరస్సునందుధరించిరి॥ పాతివ్రత్యనిమిత్తమరుంధతీదర్శనము నుదీర్ఘాయుష్యనిమిత్తముధ్రువదర్శనముసు జేయవలెననివిచారించవలెను॥ ౧౧౭

ఉ॥ సూరిమిమంత్రితోడనలకూబరుఁ డేకతనాడి పెద్దబం। గారపుఁగోరఁ గల్పవనికాజనికాంతములైనచీరలున్
హారవిభూషణావళియు నమ్మిథునంబునకుం బ్రియంబుతో - నారదమునిచేత నదనంజదివించెఁ గుబేరు
పేరుగాన్॥ ౧౧౮

టీక॥ నలకూబరుఁడు - కుబేరునికొమారుడైననలకూబరుఁడు - సూరిమిమంత్రితోడన్ - ఇష్టుఁడైనయమాత్యునితోడ ఏకతమాడి - ఆలోచనచేసి - పెద్దబంగారపు గోరన్ - గొప్పదైనబంగారపుపళ్లెరమునందు - కల్పవనికాజనికాంతములైన - కల్పవృక్షములవలనయుత్పత్తిగలవికనుక నేమిక్కిలిమనోహరములైన - చీరలున్ - వస్త్రములును హారవిభూషణావళియున్ - ముత్యాలహారములయొక్కయితరాభరణములయొక్కసమూహమును - అమ్మిథునంబునకున్, ఆవధూవరులకు - ప్రియంబుతోన్ - ప్రీతితోడ - నారదమునిచేతన్ - నారదమహామునీశ్వరునిచేత - అదనన్ - కట్నములు చదివించవలసినసమయమునందు - కుబేరు పేరుగాన్ - తనతండ్రియైన కుబేరుని పేరుచెప్పి - చదివించెన్ - కట్నముసుజదివించెను॥ ౧౧౯

క॥ కలిమిమెఱయంగమఱియుం। గలబాంధవులొసఁగిరపుడు కాంచనమణిభూ। షలుఁజీరలు నరపతికిం। బాలతికిను నుంగరలు ముదమునిగుడఁగనంతన్॥ ౧౨౦

టీక॥ కలిమిమెఱయంగన్ - వారివారిసంపదలు ప్రకాశించునట్టుగా - మఱియుంగలబాంధవులు - ఇంకనుండుచుట్టములు - నరపతికిన్ - స్వరోచికి - బాలతికిన్ - మనోరమకును - ముదముపొదలఁగన్ - సంతోషమువృద్ధిపొందునట్టుగా అపుడున్ - ఆసమయమునందు - కాంచనమణిభూషలున్ - సువర్ణవికారములునుమణిఖచితములునైనయాభరణములును - చీరలున్ - వస్త్రములును - ఉంగరలు - కట్నములు - ఒసఁగిరి ఇచ్చిరి - అంతన్ - ఆటుపిమ్మట॥ ౧౨౦

సీ॥ పొగడపూవంటికంపులమదాంబువులును। మధునిభదంతశంబములు మెఱయ। భీకరస్వరచారుబృంహితంబులుఘనాం। గారకగ్రహకాంతికన్నులమర। నిలఁజుట్టువడుతుండములమించుపూర్వాంగ। మెత్తరంబై పిఱుందత్తమిల్లఁ గటములుతక్కటమ్ములై నిటలముల్ బటువులై - సిబ్బెపుమొగములమ్ముసీఱ॥ తే॥ స్వర్ణకక్ష్యాంకుశప్రాసశరధిసాఙ్గ। ఖేటకుథఘంటికాద్యలంకృతులు చెలువ। మెసఁగుగంభీరవేదిభద్రేభశతము నల్లునకునిచ్చెగంధర్వవల్లభుండు॥ ౧౨౧

టీక॥ పొగడపూవంటికంపుల - వకుళపుష్పములవాసనవంటివాసనగల - మదాంబువులును - దానోదకములును॥ సి॥ మదోదానమిత్యమరః - మధువర్ణ - తేనెవన్నెగల - దంతశంబములు - వజ్రాయుధములవంటివిషాణములు - అనఁగాదంతములును - మెఱయన్ - ప్రకాశించఁగా - భీకర...బులు - భీకరస్వర - భయంకరమైనధ్వనిగల - చారు - సుందరమైన బృంహితంబులు - ఘీంకారములును॥ సి॥ బృంహితంకరిగర్జితమిత్యమరః ఘనాంగారకగ్రహకాంతి - అధికమైనకుజగ్రహచ్ఛాయగల - కన్నులు - నేత్రములును - అమరన్ - ఒప్పుచుండగా - ఇలఁజుట్టువడు - భూమిమీఁదఁ జుట్టగాఁబడియుండు అనఁగామిక్కిలిపొడవైన - తుండములమించు - తొండములచేతనతిశయించు - పూర్వాంగమెత్తరంబై - ముందరిదేహమే

సీ॥ అవనతాంగుష్ఠాగ్రహార్యనిర్యద్రత్న । ఖనిఘనాంతరితశృంగాటకములు । మదముదావహదివ్యమైరేయధారేయగోత్రభిన్విటపినిష్కుటయుతములు। మహిళాకదంబడింభగ్రాహ్యగృహచరన్మృగనాభిసౌరభ్యనిర్భరములు - ప్రఖరాఖునఖరధారావిదీర్ణోద్దీర్ణసౌవర్ణమృత్తికాకీర్ణజాంగలములు ॥ తే॥ కోకకలహంసముఖరితాబ్జాకరములు । సిద్ధచారణగంధర్వసేవితములు ; మందరద్రోణిఁగొన్ని గ్రామములుగూర్చి। తనయుపసపునకొసఁగె గంధర్వవిభుఁడు॥ ౧౩౧

టీక ॥ అవనతాంగుష్ఠాగ్ర - వంచఁబడిన కాలిబొటనవ్రేలివరచేతను - హార్య - హరింపఁదగినవై - నిర్యద్రత్న - బయలుదేఱుచున్నమణులుగల - ఖని - గనులచేత- ఘనాంతరితే - అధికమవునట్లుగాఁగప్పఁబడిన - శృంగాటకములు- చతుష్పథములుగలిగిన - మద...ములు - మదముదావహ - మత్తతవలనసంతోషమునుబొందించెడు - దివ్య మైరేయ - దేవతాయోగ్యమైనమద్యమును - ధారేయ - ధరించునవియైన - గోత్రభిన్విటపి - కల్పవృక్షములుగల- నిష్కుటయుతములు- గృహారామోద్యానములతోఁగూడినవైన- మహిళా... ములు - మహిళాకదంబడింభగ్రాహ్య - స్త్రీలచేతను జిన్నవాండ్రచేతను గూడ గ్రహింపఁదగినవై - గృహచరత్ - ఇండ్లలోఁదిరుగులాడుచునుండు - మృగనాభిసౌరభ్య - కస్తూరిమృగములయొక్క - కస్తూరివాసనలచేతను - నిర్భరములు - అతిశయములైనవియు - ప్రఖరా...ములు - ప్రఖర - మిక్కిలితీక్ష్ణములైన - ఆఖు - ఎలుకలయొక్క - నఖరధారా - గోళ్లవాయిచేత - విదీర్ణ - బ్రద్దలు చేయఁబడి ఉద్దీర్ణ - బయిటికివచ్చినవియు- సౌవర్ణ- సువర్ణమయమైన- మృత్తికా - మట్టిచేత - ఆకీర్ణ - వ్యాపింపఁబడిన- జాంగలములు- నిర్జలస్థలములుగలిగిన - కోక...ములు - కోక కలహంసముఖరిత - చక్రవాకములచేతను గాదంబములచేతను రొదచేయఁబడుచున్నవియు - అబ్జాకరములు - పద్మసరస్సులుగలిగినవియు - సిద్ధ...ములు- సిద్ధ - చారణ - గంధర్వ - సేవితములు - వీరిచేత సేవింపఁబడుచున్న - మందరద్రోణి - కవ్వపుకొండయొక్క లోయయందుండు - కొన్ని గ్రామములు- ఊళ్లు కొన్ని కూర్చి తనయుపసపునకున్ - గారాపుకూఁతురిపసపుకుంకుమకుగాను - గంధర్వవిభుఁడు- ఇందీవరాక్షుఁడు- ఒసఁగెన్ - ఇచ్చెను॥ ముక్కాల్లు నలుపుగలదికలహంస॥ ౧౩౨

తే॥ పౌరయాత్రికసురసిద్ధచారణాహి । యక్షగంధర్వసాధ్యవిద్యాధరులను । నిజపురంబులకనిచె నిందీవరాక్షుఁ । డుపగరలొసఁగి విభవంబుగడలుకొనఁగ॥ ౧౩౨

టీక ॥ పౌరయాత్రిక...లన్ - పౌరయాత్రిక - తమతమపట్టణములనుగురించి ప్రయాణమైన- సుర- దేవతలను- సిద్ధ - చారణ- అహి- పన్నగులను- యక్ష- జక్కులను - గంధర్వ- దేవగాయకులను- సాధ్య - విద్యాధరులను- ఇందీవరాక్షుఁడు- ఇందీవరాక్షుఁడను గంధర్వరాజు- విభవంబుగడలుకొనఁగన్ - ఐశ్వర్యమతిశయించునట్లుగా - ఉపగరలొసంగి - కట్నముయిచ్చి - నిజపురంబులకున్ - వారివారిపట్టణములకు- అనిచెన్ - పంపించెను ॥ ఉపగరయనఁగా విరళవస్త్రమని యాంధ్రభాషార్ణవము॥ ౧౩౩

వ॥ అనినవిని జైమినిమునీంద్రుండు మీఁదటివృత్తాంతంబానతీవలయునని యడుగుటయును॥

టీక ॥ అనినవిని- పక్షులీప్రకారము చెప్పఁగావిని - జైమినిమునీంద్రుండు- మునిశ్రేష్ఠుఁడైన జైమిని మీఁదటివృత్తాంతంబానతీవలయునని - మీఁదికథచెప్పవలసినదని - అడుగుటయున్ - అడుగఁగా॥

మ॥ అతులక్షాంతిగభీరభీరహితచిత్తాంభోజభోజక్షమా । పతివిద్యాపరిపాకపాకరిపు శుంభద్భోగభోగాశిప । త్రితరస్ఫూర్త్యనుభావభావభరితశ్రీకాంతకాంతారప । స్థితకాళింగకులేశలేశతరవృత్తిక్షీణవైరివ్రజా॥ ౧౩౩

టీక ॥ అతుల- సమానములేని- క్షాంతి- ఓర్పునందు- గభీర- గంభీరుఁడైనవాఁడా- భీరహిత- భయములేని- చిత్తాంభోజ- మానసాబ్జముగలవాఁడా - భోజక్షమాపతి- భోజరాజువంటి- విద్యాపరిపాక- విద్యాసిద్ధిగలవాఁడా- పాకరిపు- దేవేంద్రునివలె- శుంభద్భోగ - ప్రకాశమానమైనసుఖముగలవాఁడా- భోగాశిపత్రితరస్ఫూర్త్యనుభావ- భోగాశిపత్రి- పన్నగాశనుఁడువలె- అనఁగా గరుత్మంతునివలె - తరస్ఫూర్త్యనుభావ - వేగాతిశయమును ప్రభావమునుగలవాఁడా- భావభరితశ్రీకాంత - ఆత్మచేతధరింపఁబడిన శ్రీమహావిష్ణువుగలవాఁడా - కాంతా... లేశ,

కాంతారపాతిత - అరణ్యమునందుఁబడ వేయఁబడిన- కాళింగకులేశ - కళింగదేశాధిపతి - అనఁగా గజపతి గలవాఁడా- లేశ...ప్రజా - లేశతర - లవాంశమైన - వృత్తి- జీవనోపాధియందును - క్షీణ - హీనమైన - వైరిప్రజా- శత్రుసమూహముగలవాఁడా ‖ అనఁగా శత్రుసమూహమునకు లేశాంశమైనప్పటికిని జీవనోపాధి లేకుండఁ జేసినవాఁడని తాత్పర్యము - భోగయన్నపుడు సర్పశరీరమునకును ఫణమునకును నర్థముగనుక తద్విశిష్టమయినసర్పమును భక్షించువాఁడని గరుడపర్యాయమైనయర్థము చెప్పవలెను- భోగస్సుఖే స్త్ర్యాదిభృతా వహేశ్చ ఫణకాయయోరిత్యమరః‖ ౧౩౩

క ‖ నాగాంబాసుతజితకద। నాగతమదనాగసంగమాంబాప్లుత॥ భోగాభోగపురందర। భోగీంద్రశయానపురుషపూజాప్రవణా‖ ౧౩౪

టీక ‖ నాగాంబాసుత - నాగమ్మకుఁ గొమారుడైనవాఁడా - జిత...భోగా - జిత - జయించఁబడిన - కదనాగత - యుద్ధములవలననుండివచ్చిన। మదనాగ । మదపుటేనుఁగుల యొక్క । సంగమ- సంపర్కముచేత- అనూప - జలప్రాయదేశమైన - అనఁగా మదజలముచేతఁ జిత్తడితలాడుచుండెడు - గృహాభోగా - గృహపరిపూర్ణతగలవాఁడా భోగ - సుఖానుభవమందు - పురందర- ఇంద్రుఁడవైనవాఁడా భోగీంద్రశయానపురుష - శేషశయనుఁడైన విష్ణుమూర్తియొక్క - పూజా- అర్చనయందు- ప్రవణా - మిక్కిలినమ్రుఁడైనవాఁడా‖ఆభోగః పరిపూర్ణతా‖ ౧౩౫

మాలిని ‖ సరభసజయధాటీచండవేదండకోటీ। కరవమథుహిమానీకంపితాశావధూటీ। పరమహితహసంతీభావభాస్వ్భూరితేజః। పరుషదహనకీలాప్రస్ఫురచ్చక్రవాళా‖ ౧౩౬

టీక ‖ స భ స...చక్రవాళా - సరభస - వేగముతోఁగూడుకొన్న - జయధాటీ - జయప్రయాణమైనదండయాత్రయందలిదాడియొక్క - చండవేదండకోటీ - తీక్ష్ణతరములైనయేనుఁగుగుంపులయొక్క - కరవమథు - తుండములవలనబయలువెడలుతుంపురులనెడు- హిమానీ - మంచుతెరలచేత - కంపిత - వడఁకుచున్న- ఆశావధూటీ - దిక్కాంతలకు - పరమహిత - మిక్కిలిప్రియమైన - హసంతీభావభాక్ - నిప్పులకుంపటియాటను బొందుచున్న - అనఁగా నంగారధానికయగుచున్న - భూరితేజః- అధికమైనతేజస్సును - పరుషదహనకీలా - కఠినాగ్నిజ్వాలలచేత - ప్రస్ఫురత్ - మిక్కిలిప్రకాశించుచున్న- చక్రవాళా - భూమిచుట్టునుండు చక్రవాళపర్వతముగలవాఁడా‖ అనఁగా నీరాజుసేనయందునసంఖ్యములైనయేనుఁగులు గలవాఁడనియు - భూమియంతంతట వ్యాపింపఁబడినప్రతాపముగలవాఁడనియుభావము॥ అంగారధాని కాంగారశకట్యపిహసంత్యపీత్యమరః‖ ౧౩౭

గద్య‖ఇది శ్రీమదంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాక్షపాదాంబుజాధీనమానసేందిందిరనందపుర వంశోత్తంస శఠగోపతాపసప్రసాదాసాదిత చతుర్విధకవితామతల్లికాల్లసాని చొక్కయామాత్యపుత్ర పెద్దనార్య ప్రణీతంబైన స్వారోచిషమనుసంభవంబనుమహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము‖ ప్రథమాశ్వాసాంతగద్యమునకు జెసినప్రకారమే దీనికిని టీక విచారించదగ్గది- అయిదవయాశ్వాసము టీకతోఁ గూడ సమాప్తిసినది‖ ౧౩౮



నము చేయుచుండి రవగవ - సుష్మాగుప్పన - కచపింఛమున - గా - నెన లిపి చెవఁటితలచేఁ బ్రకటమౌ - కాలాగరుధూపము వెట్టి నలయఁగఁ బోఁగ వేసి - జవాదినంటు పూసి - జవ్వాదిమొదలుగు చేతఁ జిక్కుఁ దీసి నిపుణతఁ - నేర్పుచేత॥ రవతవంయనఁగాఁగరగరయునకొండలు॥ ౫

సీ॥ చెంగల్వపూదండఁ జేర్చి పెందుఱుముపై ఘనసారమునసూసకమ్ము ఘటించి। పన్నీటితోఁ గదంబము చేసి మృగనాభిఁ బూసి కుంకుమ సేసబొట్టు నిల్పి। విశదము త్తాదావరశనఁ జందురుకావి వలిపెపువలువపై నలవరించి। యఱుతవెన్నెలఁ గాయుహారమొక్కటిఁ బెట్టి। మణుల సొమ్ములు మేనమట్టువఱచి॥ తే॥ కన్నుఁగవ గాల్చి డాకాలఁ గట్టి సనఁగ। ఘల్లుఘల్లనఁ బెండెంబుగండుమీలు। గదలనల్లననడిపించి పొదివి తెచ్చె। నెచ్చెలులపిండు యావతి నా నృపతికడకు॥ ౬

టీక॥ చెంగల్వపూదండఁ జేర్చి - హల్లకమాలికలు దఱిమి పెందుఱుముపైన్ - పెద్దకొప్పు మీఁద ఘనసారమునన్ - కర్పూరము చేతరచించిన పత్రములచేత - సూసకము ఘటించి - వాలపాశ్యావిశేషము నలంకరించి - అనఁగా రాగిడిబిళ్లమొదలైన శిరోభూషణాదిక మని యాంధ్రభాషార్ణవాదిగ్రంథములయం దున్నది. యీ వ్యాఖ్యాత - కొప్పువలయని వ్రాసిదానికి యుక్తిగూడ వ్రాసినాఁడు - ఘనసారమనుపదమునకు నాయర్థమిక్కడ సరిపడ లేదుగనుక - ఘనసారముచ గొప్పయైనశిరోగాంశము చేతననియర్థమున్నట్లుతోఁచుచున్నదని కొందఱు చెప్పినారు - ఇక్కడ సంప్రదాయమేమనఁగాఁ - సేవలపుష్పమాలికలైనఁ బరివళ మెప్పటికిని విడిచియుండదని కర్పూరముతోఁ బుష్పమాలికలురచించి వానిచేతఁ గొప్పపై నిలువగాన మర్చినదాని పేరుసూసక మనియందురు - అది శిరోభూషణములు గానున్నది. పన్నీటితోఁ గదంబము చేసి - హిమాంబువుతోఁ గలిపినదిగఁ జేసి - మృగనాభిఁ బూసి - కస్తూరియలఁది కుంకుమ - కాశ్మీరజన్మముచేత సేసబొట్టు నిల్పి - చుక్కబొట్టుపెట్టి - విశద - స్వచ్ఛమైన ము త్తాదామరశన - ముత్యాలపేరుచేత రచించిన మొలనూలును చందురుకావివలిపెపువలువపైన్ - సన్నపుచంద్రకావి చీరమీఁద - అలవరించి - కుదురుపఱచి - అఱుతన్ - కంఠమందు - వెన్నెలఁ గాయు - తెల్లనికాంతులచేఁ బ్రకాశించు హారమొక్కటి పెట్టి ముత్యములసరమొకటియుంచి - మణులసొమ్ములు - రత్నస్థాపితములైన యాభరణములు - మేనమట్టువఱచి శరీరమందు నలంకరించి కన్నుఁగవ గల్చి - కన్నులచేత జయించి - డాకాలఁ గట్టి సనఁగన్ - ఎడమ కాలికిఁ గట్టి వేసినదేమో యన్నట్లుగా - ఘల్లుఘల్లనన్ - ఘలుఘలుమను ధ్వనిచేత - పెండెంబుగండుమీలు - గండపెండేరమునఁ జెక్కఁబడిన బంగారుతోఁ జేసినగండుచేఁపలు - కదలన్ - కదలియాడఁగా - అల్లననడిపించి - మెల్లమెల్లగా నడిపించి పొదివి - కౌఁగిలించిపట్టుకొని - నెచ్చెలులపిండు - మిక్కిలి ప్రియమైనచెలికత్తెలయొక్కగుంపు - నృపతికడకున్ - ఆస్వారోచి వద్దికి - యావతిన్ - ప్రాయపుదైన నమ మనోరమను తెచ్చెన్ - తీసుకొనివచ్చెను॥ ౬

క॥ తెచ్చుటయుఁ గేళిభవనము। చొచ్చెనొ చొరదో యనంగ సుదతుల నీడం। జొచ్చి పయిఁ గొప్పదోఁపఁగ। నచ్చెడియ తలుపుదండ నల్లన నిలిచెన్॥ ౭

టీక॥ తెచ్చుటయున్ - చెలికత్తెలు ప్రకారము తీసుకొనివచ్చుటయుఁ గాఁ - కేళిభవనము - పడకటిల్లు - చొచ్చెనొ చొరదో యనంగన్ - ప్రవేశించినదో లేదో యనునట్లుగా సుదతుల నీడం జొచ్చి - చెలికత్తెల నీడఁ బ్రవేశించి - పయిఁ గొప్పదోఁపఁగన్ - వెలుపటికిఁ గబరీమాత్రము కనుపడునట్లుగా - ఆ చ్చేడియ - ఆమనోరమ - తలుపుదండన్ - కవాటము చెంతను - అల్లన నిలిచెన్ - మెల్లగా నిలిచినదాయెను॥ ౭

క॥ తదనంతరంబ బోఁటులు। చదగులనగవులను బ్రొద్దు జరిగిగిన గేళీ। సదనమునొక్కొక్కవసుసెప। మొదవగ వెడలుటయుఁ జిత్తమున్విభుఁ డలరెన్॥ ౮

టీక॥ తదనంతరంబ - అటుతర్వాత బోఁటులు చెలికత్తెలు చదరులన్ - కోడిగపుమాటలచేత నగవులన్ - నవ్వులచేతను - ప్రొద్దుజరిగినన్ - కాలహరణముకాఁగా - ఒక్కొక్క పని సెబ మొదవగన్ - ఒక్కొక్క కార్యమూలమున కేళీసదన

బడుచుపడుబడిన - శరీరమై - అంతములుకలగలదై - అనఁగా | జిలుక పలుకుల వంటి పలుకులుగలదై పలికెన్ వచించెను॥

తే॥ అఘమంచారవిద్యాధరాత్మభవను । ననుఁ బ్రావసియంత్రుఁ గంధర్వవరులు। తెలిపియుండుదు నిమ్మహీ

తలమునందఁ। బరగు మృగపక్షి జాతులభాషలెల్ల॥ ౨౨

టీ॥ అనఘ పాపరహితుఁడవైనయో స్వరోచీ మంచా రవిద్యాధర మందారుఁడను విద్యాధరుని యొక్క - ఆత్మభవను - కొమార్తెను - ననున్ - నన్ను - గంధర్వవరులు గంధర్వశ్రేష్ఠులు - విభావసియంత్రు విభావసి యనియందురు - ఇమ్మహీతలమునందుఁ బరగు - ఈ భూమియందుఁ బ్రవర్తించు మృగపక్షి జాతుల మృగజాతులయొక్క - పక్షిజాతులయొక్క - భాషలెల్లన్ - భాషలనన్నిటిని - తెలిసియుండుదున్ - ఎఱుఁగుదును ॥ అనఁగా మెకములయొక్కయును పులుఁగులయొక్కయును బాస తెలియుఁగుదునని యనుట॥ ౨౨

క॥ అమ్మేటి విద్య నాచే। నిమ్ముగ నంతయును నేర్చి గిన్నృపననుఁ బ్రోవా । సొమ్మగు మనవుడు రెండవ। కొమ్మ మదిం

బ్రేమ గడలుకొనఁ గ్గ నిట్లనియెన్॥ ౨౩

టీక॥ నృప - ఓయి రాజా - అమ్మేటి విద్యన్ - అశ్రేష్ఠమైన విద్దెను - నాచేన్ - నాచేత - ఇమ్ముగన్ - యుక్తమానట్లుగా | అంతయును నేర్చి - సర్వము గ్రహించి - నన్ను వివాహమ్మగుము - నన్నుఁ బెండ్లియాడుము - అనవుడు - అనిపలుకఁగా - రెండవకొమ్మ ద్వితీయస్త్రీ - మదిం బ్రేమ గడలుకొనన్ - మనస్సునందనురాగమతిశయించఁగా - ఇట్లనియెన్ ఈ ప్రకారము పలికెను॥ ౨౩

ఆ॥ పాఱుఁడనఁగఁ బరగు బ్రహ్మర్షి మాతండ్రి । యతఁడు విద్యలెల్ల నభ్యసించి । తపము నిచ్చ సేయఁ దలపోసి కర

భృం। గాలిరమ్యమైన యాశ్రమమున॥ ౨౪

టీక॥ పాఱుఁడనఁగఁ బరగు - పాఱుఁడనునట్టుగాఁ బ్రసిద్ధుఁడైన - బ్రహ్మర్షి - బ్రహ్మర్షియైన మునీశ్వరుఁడు మాతండ్రి నా జనకుఁడు - అతఁడు విద్యలెల్లన్ - అతఁడు సమస్తవిద్దెలు - అభ్యసించి నేర్చి - తపము నిచ్చ సేయఁ దలపోసి నిరంతరము తపస్సు చేయఁదలఁచి - కీరభృంగాలి - చిలుకలతుమ్మెదల సమూహము చేత - రమ్యమైన - సుందరమైన - ఆశ్రమమునన్ - ఒకతపోవనమందు॥ ౨౪

మ॥ ఫలమూలచ్ఛదనాంబుభుక్తిపవనాభ్యాసక్రియాయుక్తిని । ర్దళితాంతర్గతశాత్రవప్రకరజాగ్రద్గర్వసర్వ

స్వుఁడై। చలికిన్ వానకు నెండకున్ మనము నుత్సాహంబు గానీక కం। దళితానందముతో ముకుందచరణ

ధ్యానావధానంబునన్॥ ౨౫

టీక ॥ ఫల... స్వుఁడై - ఫల పండులును మూల గడ్డలును ఛదనములు ఆకులును - ఛదన - పండుటాకులును - అంబు - ఉదకము ను భుక్తి - వీనియొక్క - యాహారముచేతను - పవనాభ్యాసక్రియాయుక్తి - వాయుధారణచేయుట ధ్యానవ్యాపారయోగము చేత - నిర్దళిత - ఛేదింపఁబడిన - అంతర్గత - లోపలి - శాత్రవప్రకర - శత్రుసమూహముయొక్క - అనఁగాఁ కామక్రోధలోభమోహమదమాత్సర్యములను నరిషడ్వర్గముయొక్క - జాగ్రత్ - ప్రకాశించుచున్న - గర్వసర్వస్వుఁడై - యహంకారము గలవాఁడై - అనఁగా నరిషడ్వర్గమును జయించినవాఁడై - చలికిన్ - శీతమునకును వానకున్ వర్షమునకును - ఎండకున్ - ఆతపమునకును - మనముకా - మనస్సును - అనుత్సాహంబు గానీక వ్యథపడనియ్యక - అనఁగా సహించి - కందళితానందమునన్ - అంకురింపుచుండు ప్రమోదము చేత ముకుందవిష్ణుమూర్తియొక్క - చరణధ్యాన - పాదారవిందధ్యానమందలి - అవధానంబునన్ - నిలుకడచేత॥

క॥ అంగుష్ఠమున నిలమోపిప । తంగుని పైఁజూపుసాఁచి ధగధగ లర్చి । స్తుంగతనింగులు నాకెడు । నింగలము

లు నాల్గుదెసల నిడుకొని కడఁకన్॥ ౨౬

టీక॥ అంగుష్ఠమునన్ - ఒంటికాలిబొటనవ్రేలిని - ఇలమోపి - భూమిపైనానించి పతంగుని పైన్ - సూర్యునిమీద చూపుసాఁచి

దృష్టినిలిపి ధగధగలు ధగధగమనం జెడు- అర్చిస్తుంగతరన్- మంటలపొడవుచేత నింగులు నాకెడు- ఆకాశమునంటుచున్నడు- ఇంగలములు - అగ్నిహోత్రములు - నాల్గుదెసలనిడుకొని - నాల్గుదిక్కులనుంచుకొని - కడఁకన్ జాపూనికచేత॥ ఇంగలములనగా బొగ్గులనుట యిప్పుడు నింగాలమని యందురు॥

క॥ సురగరుడ యక్షరాక్షస। నరకిన్నరసిద్ధసాధ్యనాగోత్కరమి।ట్లరుదనఁగఁ దపము నెఱపెం। బురుహూతుఁడు దాననాత్మఁ బొడమెడు భీతిన్॥ ౨౭

టీక॥ సుర...రము- సుర దేవతలయొక్క- గరుడ- గరుడులయొక్క- యక్ష- జక్కులయొక్క- రాక్షస- రక్కసులయొక్క- నర- మానవులయొక్క - కిన్నర- మనుష్యముఖము గుఱ్ఱపుశరీరముగల దేవయోనులయొక్క- సిద్ధ- సిద్ధులయొక్క- సాధ్య- సాధ్యులయొక్క- నాగ- పన్నగులయొక్క- ఉత్కరము- సమూహము- ఇట్లు- ఇటువంటితపస్సు అరుదనఁగన్- మిక్కిలి యాశ్చర్యమని యనఁగా- తపము నెఱపెన్- తపస్సు చేసెను- పురుహూతుఁడు- ఇంద్రుఁడు- దానన్- ఆతపస్సువలన- ఆత్మఁ బొడమెడు మనస్సునందుఁ బుట్టుచున్న - భీతిన్- భయముచేత॥ పైపద్యముతో నన్వయము- ఇక్కడ నింద్రుఁడు భయపడుట యెందుకనఁగా నీతఁడు త్రిభువనాధిపత్యమును గోరి తపస్సు చేయుచున్నాఁడేమో యను తాత్పర్యముచేత భయపడెనని భావము॥ ౨౭

క॥ తనయొద్దఁ బుంజికస్థల। యనునచ్చరలేమయున్న నమ్మునికడకుం। జనుమని యనిపినఁ బతిశా। సనమున వని కేఁగుదెంచె సంభ్రమలీలన్॥ ౨౮

టీక॥ తనయొద్దన్- తనసమీపమునందు- పుంజికస్థల యను- పుంజికస్థల యనెడు - అచ్చరలేమ యున్నన్- అప్సరస్త్రీ యుండఁగా- అమ్మునికడకున్- ఆఋషిసన్నిధికి- చనుమని యనిపినన్- పొమ్మని పంపించఁగా - పతిశాసనమునన్- ప్రభువునాజ్ఞచేత- సంభ్రమలీలన్- తొట్రుపాటుతో వని కేఁగుదెంచెన్- ఆఋషియుండు నరణ్యమునకు వచ్చెను॥ ౨౮

ఉ॥ చిలుకలు ముద్దుపల్కులకుఁ జేరఁగ రా నెఱి వేణికాంతికిన్। మలయుచుఁ బైపయిన్ మధుపమాలిక పాయక సంచరింపఁగా। నలసవిలాసయానమున నమ్మునిపాలికి వచ్చె వేల్పుతొ। య్యలి నునుసానఁ బట్టిన యనంగుని మోహనబాణమో యనన్॥ ౨౯

టీక॥ చిలుకలు- శుకములు- ముద్దుపల్కులకుఁ జేరఁగ రాన్- తనమనోహరమైన వాక్కులకుఁ జేర రాఁగా - అనఁగా స్వజాతి శుకవాక్యభ్రాంతిచేత రాఁగా నని తాత్పర్యము నెఱి వేణికాంతికిన్- బాగైన జడయొక్క ద్యుతికి- మలయుచున్- వ్యాపించుచును - పైపయిన్ మీఁదమీఁద - మధుపమాలిక తుమ్మెదచాలు - పాయక సంచరించఁగాన్ - విడిచిపోక తిరుగఁగా। అనఁగా జడను జూచి తుమ్మెదచాలు భ్రాంతిచేతఁ దిరిగినవని తాత్పర్యము - అలసవిలాసయానమునన్ - మందమైన యొయ్యారముతోఁ గూడిన నడకచేత- అమ్మునిపాలికిన్ - ఆమునీశ్వరునిసన్నిధికి- వేల్పుతొయ్యలి అప్సరస- నునుసానఁబట్టిన - నున్నని మెఱుఁగుసానఁ బట్టిన అనంగుని మన్మథునియొక్క - మోహనబాణమో యనన్- సమ్మోహనాస్త్రమో యనునట్టుగా - వచ్చెన్ - ఏతెంచెను॥ ౨౯

వ॥ ఆసమయంబున॥ టీక॥ ఆపుంజికస్థల మునిసన్నిధికి వచ్చిన వేళయందు॥

చ॥ అనువగు వల్లనొప్పు మలయానిలవాహము నెక్కి తేంట్లనల్లిన నిడువాగెఁ బూని లవలీనవవల్లిక లెమ్మె సొమ్ములై। పనుపడఁ జెట్లు పట్టి మను ప్రాఁతదళమ్ములతోడఁ దోలెనా। మని వొరమంచు రాజు మాడి మంచగఁ గోయిలగంటు మోయఁగన్॥ ౩౦

టీక॥ అనువగు - యుక్తమైన వల్లనొప్ప - తిరుగుడులచేతనమరుచున్న యని మలయమారుతపరమైన యర్థము- శ్రేష్ఠమైన దేవమణి మొదలైన యశ్వావర్తములచేత నొప్పుచున్న యని యశ్వపరమైన యర్థము - మలయానిల - చందనాచల మారుతమను - వాహము నెక్కి- గుఱ్ఱమును నారోహించి- తేంట్లనల్లిన - తుమ్మెదలచేతఁ బెనవేసిన వాలనెడు- నిడువా

గొంబూని - పొడుగుగలకత్తిమునుబట్టుకొని - లవలీనవవల్లికలు - లవలీయనఁగా వెన్నెలకుఁబండునట్టిలతావిశేషము - దానియొక్క - నూతనమైనతీఁగలే - ఎమ్మెసొమ్ములై - రమ్యమైనయాభరణములై - పనుపడన్ - ఒప్పుచుండఁగా - ఆమనిదొర - వసంతకాలమనుప్రభువు - మంచురాజు - హేమంతమనుప్రభువును - చెట్టువట్టిమను - వృక్షములనుబట్టుకొని బ్రతుకుచునుండు - ప్రాఁతదళమ్ములతోడన్ - మూలబలముతోఁగూడనని యర్థము - జీర్ణపర్ణములతోఁగూడనని భావము - మడియుంచగన్ - తూలిపడిపోవునట్టుగా - కోయిలగంటమ్రోయఁగన్ - కోవెలయను ఘంటామణిమ్రోయఁగా - తోలెన్ - గుఱ్ఱపువువుచేసెను॥ అనఁగాఁ జెట్టియాకురాలుపుతోఁగూడ హేమంత ఋతువుగడచిపోయెననియు - మలయమారుతమును దుమ్మెదగుంపులును లవలీలతాసమూహములును॥ వసంతఋతువును వ్యాపించెననియు భావము - ఈ ౩౦ వపద్యము మూఁడవచరణమందుఁ బనుపడననుపదమునకు - ఉదాహరణము రాఘవపాండవీయము మూఁడవయాశ్వాసము ౧౩౦ వపద్యము॥ కం॥ వనదేవతలర్చించిరి - పనుపడితచ్ఛాపమోక్షపరిమోచితభీ - మునిజనసుతు నాన్యవనం - దనువిశుభానిలచలల్లతాకుసుమములన్॥ ఇందునాగ్నజిత్తిపరిణయము ౩ వయాశ్వాసమందు ౫౦ వపద్యము ౩వచరణము॥ అని చెలువెల్లడాసి చిగురాకుజిరాదొరవానిబంట్లపైఁ - గనరున వేగనాడిమెలిఁగన్గొని యుంకిటజాగుసేయుఁగాఁ - బనుపడదిందుకై యొకనెపంబుగఁ బించియొక రత్తకాలయమ్ - పన మొనరించునట్టి సదుపాయమి కెట్లనుచున్ రయంబునన్॥ ౩౧

సీ॥ పొనదేఱి పొటమరించి నెఱవాసినయట్టి - యాకురాలుపుగండ్లయందుఁ దొరఁగి - యతిబాలకీరచ్ఛదాం
కురాకృతిఁ బొల్చి । కరవీరకోరకగతిఁ గ్రమమున । నరుణంపుమొగ్గలై యరవిచ్చి పికిలియీ - కలదండలట్టు
గుంపులయి పిదప । రేఖ తేర్పడక వర్ణిలి వెడలై చెన్ను । పసరువారుచునిక్కఁ బసరకప్పు॥ తే॥ పూఁటపూఁ
టకు నెక్కొని కప్పుసకుఁదగిన । మెఱుఁగు నానాఁటికిని మీఁదఁ గిరిగొనంగ । సోగయై యాకుఁ బ్రాలంగఁ జొంపము
గుచుఁ । జిగురుదళుకొత్తె దరులతా శ్రేణులందు॥ ౩౨

టీక॥ పొనదేఱి - చెన్నుయుబికి - పొటమరించి - అంకురించి - నెఱవాసినయట్టి - నెఱ్ఱవాసిన - అనఁగా బొఱ్ఱపడిన యానుట - ఆకురాలుపుగండ్లయందుఁ దొరఁగి - పండుటాకులురాలిపోయినగట్లలో పొడిచి పెట్టి - అతి...బొల్చి - అతిబాలకీర మిక్కిలిపిల్లయయిన చిలుకయొక్క - ఛదాంకుర - రెక్కల ఱెక్కలయొక్క - ఆకృతిఁబొల్చి - రూపమువలెనే యొప్పి - కరవీరకోరకగతిన్ - ఎఱ్ఱగన్నేరుమొగ్గలవలె - క్రమమునన్ - వరుసగా - అరుణంపుమొగ్గలై - ఎఱ్ఱనిమొగ్గలవలెలవలెనుండి - అరవిచ్చి - సగమువిచ్చుకొని - పికిలియీకలదండలట్టు - పికిలిపిట్టల ఱెక్కలలోఁగట్టినకుచ్చులవలె - గుంపులయి - గుమ్ములై - పిదపన్ - పిమ్మట - రేఖ తేర్పడక వర్ణిలి ఈ నెలు స్పష్టము గాకుండునట్లుగా నెదిగి - వెడలై - విశాలమై - చెన్ను పసరువారుచునిక్కన్ - కొమ్మపచ్చబడుచు నిక్కఁగా - పసరకప్పు - పసరువన్నె - పూఁటపూఁటకు నెక్కొన - ఆవేళకావేళకు హెచ్చఁగా - కప్పునకుఁదగిన - ఆ పసరువన్నెకు యోగ్యమైన - మెఱుఁగు - కాంతి - నానాటికిని మీఁదఁగిరిగొనంగన్ - దినదినము నకుఁ బయికినావరించఁగా - సోగయై యాకుఁబ్రాలంగన్ - నిడుపై యాకుప్రాలఁబడఁగా - జొంపముగుచున్ - గుబులొందును - తరులతాశ్రేణులందున్ - వృక్షములయొక్క తీఁగలయొక్క సమూహములందు - చిగురుదళుకొత్తెన్ - పల్లవములు ప్రకాశించెను॥ లతలనఁగాఁ గొమ్మలనియు నర్థము చెప్పవచ్చును॥

క॥ హిందోళంబునఁ బాడెఁ । బృందారకసతులు విరహిబృందార్తిగఁ దేఁ । చెందేఁటులు వాసంతిక విందునఁ
బికశిశువు నాడి వెడలం దోలెన్॥ ౩౩

టీక॥ బృందారకసతులు - దేవతాస్త్రీలు - విరహిబృందార్తిగన్ - వియోగిజనసమూహమునకు బాధకలుగునట్లుగా - హిందోళంబునన్ - హిందోళరాగముచేత - పాడిరి - గానము చేసిరి - తేఁటులు - తుమ్మెదలు - వాసంతికవిందునన్ బండిగురువిందలపూఁదేనెయొక్కవిందుచేత - క్రేచెన్ - తృప్తిఁబొంది తేఁపువిడిచెను - పికశిశువున్ - కోయిలపిల్లను -

నిండపాలై యనుట - పాపపుజవ్వనము - కోఱగానియావ | మీఱునట్టుగా - ఎదిరించెఁ - అటుముకొనెను॥ ౪౬
నము- నా మేనఁ - నాశరీరమందు- జిగిమెసఁగఁ - కాంతి |

శా॥ ఆవేళంబొడగాంచి ఖేచరుఁడొకం డాసక్తిదేవాపిసంజ్ఞావంతుండు సబాంధవుండగుచు నిశ్శంక కన్న
నఁ వేఁడు వాఁ । డై వాచంయముఁడగ్నికార్య నిరతుండై యున్నచోఁబర్ణశా । లావాసంబున కేఁగుదెంచి ని
జభావాకాంక్ష సూచించినఁ॥ ౪౭

టీక॥ ఆవేళంబొడగాంచి- ఆసమయమందుఁజూచి-దేవాపిసంజ్ఞావంతుండు - దేవాపియను పేరుగలిన - ఖేచరుఁడొకండాసక్తిఁ- ఒకగంధర్వుఁడుప్రేమచేత- సబాంధవుండగుచుఁ - తనచుట్టములతోఁ గూడుకొన్నవాఁడగుచు - నిశ్శంకఁ - సంకోచము లేకుండ-ననుఁ వేఁడువాఁడై - నన్నడగఁదలఁచినవాఁడై - వాచంయముఁడు - మౌనవ్రతియై నమునీశ్వరుఁడు - అగ్నికార్య నిరతుండై యున్న చోఁ- హోమకార్యమందాసక్తుఁడై యుండఁగా - పర్ణశాలావాసంబున కేఁగుదెంచి- ఉటజగృహమునకువచ్చి - నిజభావాకాంక్షఁ- తనమనస్సునందుకోరికను-సూచించినఁ- సూచనసేయఁగా॥ వాచంయమోమున్యరిత్యమరః॥ ౪౭

సీ॥ శిఖిపింఛనఖపరిష్కృతములై సేవంతి । విరులతీరగు శిరోవేష్టనములు । నెఱగంటిచూడ్కిఁ దాయతు
లబాహువులువంచి । నారాచులల్లార్చు నారజములు। కాదంబరీగంధగర్భంబులై వల్చు ! ఘనసారమిళదాస్య
గంధములును । దరహాసములఁదోఁచు తాంబూలసేవాంధ । కారితాధర రదక్షతులయొఱపు॥ తే॥ చిటులు
గందంపుఫ్రాఁతలు జిహ్వకలకు । ననుపు నెఱవాదిబంటు పంతపుఁబదరులు । ఘనమగుజుగుప్సఁ బెనుపనజ్ఞన
ముసూచి । ఋషిమనంబునఁగడునసహ్యించుకొనుచు॥ ౪౮

టీక॥ శిఖిపింఛనఖ- నెమలిపించెయింఁకెలచేత-పరిష్కృతములై - అలంకరించఁబడినవై - సేవంతివిరులతీరగు - చేమంతిపువ్వులవరెనున్న - శిరోవేష్టనములు - తలపాగలును - ఎఱగంటచూడ్కిఁ- మదపానముచేత నెఱ్ఱనైనకన్నులయొక్కచూపును- తాయెతులబాహువులువంచి - సందటితాయెత్తులుగల భుజములువంచి - నారాచులల్లార్చుఁ- చేఁతుల లోనుండు టంకాయుధములు - అనఁగాఁ జీరనపుటులుజవ్వాడించెడు - ఆరజములు - ఆగడములును- కాదంబరీగందగర్భంబులై - సారాయివాసనలోపలగలవై- వల్చు - పరిమళించెడు - ఘనసారమిళత్ - కర్పూరముతోఁ గూడుకొన్న - ఆస్యగంధములును - నోటికంపులును - దరహాసములఁదోఁచు- చిఱునవ్వులతోఁగనుపడుచున్న - తాంబూల...యొఱపు - తాంబూలసేవాంధకారితా - వీడెమువేసుకొనుటచేతఁగనుపడ నివిగాఁ జేయఁబడిన - అధర పెదవులయందలి - రదక్షతులయొఱపు - పలుగాట్లయొక్కయొప్పిదమును - చిటులుగందంపుఫ్రాఁతలు- పేటెత్తినగంధపుఫ్రాఁతలును జిహ్వకలకు...ననుపు- జిహ్వకలకు-నాలుకలకునల వాటుపడియుండు - నెఱవాదిబంటుపంతపుఁబదరులు- చాతుర్యముతోఁగూడినబంటుపంతములుపలికెడుబడాయిమాటలును- అనఁగాపిటకానిలక్షణములు-ఘనమగుజుగుప్సఁ బెనుపఁ- అధికమైనభీభత్సరసమును నతిశయింపఁజేయఁగా - అజ్ఞనముసూచి - ఆవచ్చినవారినిజూచి- ఋషి - మునీశ్వరుఁడు-మనంబునఁగడునసహ్యించుకొనుచుఁ మనస్సునమిక్కిలియసహ్యపడుచును॥ ౪౮

శా॥ ఆహాధన్యుఁడనైతిమద్విమలవంశాచారవిద్యాతపః - శ్రీహోమాదులు నేడుగాతుద ఫలించెఁ నా
గవాసంబుమ । ద్గేహశ్రోణికి బిడ్డవేఁడుటకు నే తేఁగాంచుటఁ బ్రాహ్మ్య మిం - కోహో చాలుఁబో
కాలిపోమెకరో పోపోనోటి క్రొవ్వేటికిఁ॥ ౪౯

టీక॥ ఆహాధన్యుఁడనైతిఁ- ఔరా నేను కృతార్థుఁడనైతిని - నాగవాసంబు - భోగపుమేళము - మద్గేహశ్రోణికిఁ నాయింటికి - బిడ్డవేఁడుటకు నే తేఁగాంచుటఁ - చిన్నదానినడుగునిమిత్తమై వచ్చుటచుచ్చినందున - మద్వి...మలు - మద్విమల - నాపరిశుద్ధమైన- వంశ - కులమును - ఆచారనడుపడిమును - విద్యా - జ్ఞానమును-తపః శ్రీ - తపస్సయొక్కసమృద్ధియు- హోమము - అగ్నికార్యమును - ఆదులు మొదలైనవి - నేడుగాతుదఫలించెఁ - ఈదినముగదా సాఫల్యమాయెను - బ్రాహ్మ్యమింకోహో చాలుఁ - బ్రాహ్మణ్యమిఁక మీఁదనాహా చాలును - పో కాలిపోమెదరో- పోకాలిపోమెదరో - పోరో- పోరా- నోటిక్రొవ్వేటికిఁ-నోరుక్రొవ్వినమాట లెందుకాడుచున్నారు॥ ౪౯

క॥ మీతరము నార లేతటి। నేతరితనమునఁ దపస్వి గృహకన్యకలన్। వీతభయవృత్తి వేఁడిరొ। కోతముఁ దరిక్రింపకొరఁ బ్రొవ్వులటంచున్॥ ౫౨

టీక॥ మీతరమువారలు - మీవంటివాండ్రు - అనఁగానట విటగాయకులైన గంధర్వులు - ఏతటిన్ - ఏకాలమందైనను ఏతరితనమునన్ - గొండగొయ్యతనముచేత - తపస్విగృహ కన్యకలన్ - మునికన్నియలను - వీతభయవృత్తిన్ - భయములేకుండను - తముఁదరిక్రింపగ - తమయోగ్యతతమరువి చారించుకొనకుండ - వేఁడిరొకో - అడిగినారుగా - ఓరి క్రొవ్వులటంచున్ - ఓరి మదమనియనుచును॥ ౫౨

క॥ వసుధేశ ముక్కుఁ డుస్సిన। పసరము క్రియఁ గెరలి తిట్టెఁ బకున్ బుషి వా। రుసురుసుని వెడలిపోయిరి। ముసలిగదా పుట్టినిల్లు మున్ క్రోధమతకున్॥ ౫౩

టీక॥ వసుధేశ - ఓయి రాజా - బుషి - మునీశ్వరుఁడు - ముక్కుఁ డుస్సినన్ - ముక్కుదాడు తీసిన - పసరముక్రియన్ - వృషభమువలె - కెరలి - రోషించి - తిట్టెఁబకున్ - వెనుక ముందుఁజూడక తిట్టెను - వారు - ఆగంధర్వులు - ఉసురుసుమని వెడలిపోయిరి - ఉస్సురని నిరాశులై లేచిపోయిరి - మఱి క్రోధమతకున్ - ప్రధానమైన తీక్ష్ణత్వము నకు - ముసలిగదా పుట్టినిల్లు - ముసలివాఁడే కదా జన్మస్థానము - అనఁగా ముదివచ్చినకొలఁది కోపము హెచ్చుచున్నదనుట॥ ౫౩

వ॥ అట్టియెడం దన మనోరథంబు విఫలంబగుటకుఁ గ్రోధాంధుండై నన్ను భిలషించు గంధర్వుండిట్లనియె॥

టీక॥ అటియెడన్ - ఆసమయమందు - తనమనోరథంబు విఫలంబగుటకున్ - తనయొక్క కోరిక వ్యర్థమైనందుకు క్రోధాంధుండై - కోపముచేతఁ గన్నుగానని వాఁడై - అనఁగానధిక కోపముగలవాఁడై యనుట - నన్ను భిలషించు గంధర్వుండు - నన్నుఁ గోరిన గంధర్వుఁడు - ఇటనియెన్ - ఈలాగని పలికెను॥

శా॥ నీవైశిష్ట్యము తిట్టులన్నె యయ నే నీకంటె నేదక్కువే। యీవే కన్యక నీవుగాక మఱిమద్వృత్తాన్వయాచారముల్। నీవా పేర్కొనుపాటివాఁడవిలఁ గానీనిల్తుగాకేమిపో। పోవిప్రాధమ నిన్నుఁ బోలనికనల్పుల్లే రుదంభవ్రతా॥ ౫౪

టీక॥ నీవైశిష్ట్యము - నీయొక్క వైశిష్ట్యకము - తిట్టులన్నె అయ నే - శాపెనలచేతఁ బ్రకాశించునా - నీకంటె నేఁదక్కువే - నీకన్నను నేను దక్కువవాఁడనా - ఈవేకన్యక నీవుగాక చిన్నదానినిన్నవ్వకపోయినఁ బోనీగాని - మఱి మీఁదిమిక్కిలి మద్వృత్తాన్వయాచారములు - మావ్యాపారము మావంశము మాయాచారము నీవినిని - నీవా పేర్కొను పాటివాఁడవు - నీవా యెంచెడు పాటివాఁడవు - ఇలఁగానీనిల్తుగాకేమి - భూమియందు బ్రదుకుదువుగాని లే - పోపో విప్రాధమ బ్రాహ్మణాధమా పోపో - నిన్నుఁ బోలని కనల్పుల్లేరు - నీవంటినీచులు వేఱు లేరు - దంభవ్రతా - కపటపునీమముగలయో మునీశ్వరుఁడా॥ ౫౪

తే॥ అనుచుఁ బగచాటిపోయి వాఁడర్ధరాత్రసమయమున శస్త్రనిహతి మజ్జనకుఁ జంపె। నట్లయగుఁ గాకఁ బుడమిఁ గామాంధచిత్తుఁ। డెవ్వరి వధింపఁ డెటు సేయఁ డేమి గాఁడు॥ ౫౫

టీక॥ అనుచుఁ బగచాటిపోయి - అని యీతీరున విరోధపుమాటలాడిపోయి - వాఁడర్ధరాత్రసమయమునన్ - ఆగంధర్వుడు సగమురాత్రివేళ - శస్త్రనిహతిన్ - కత్తిపోటుచేత - మజ్జనకుఁ జంపెన్ - మాతండ్రిని వధించెను - అటయగుఁ గాకన్ - ఇందుకాశ్చర్యమేమి యది సరేకదా - యేమనఁగా - పుడమిఁ గామాంధచిత్తుఁడు - భూమియందుఁ గామముచేతఁ గన్నుగానని వాఁడు - అనఁగా మంచి శబ్బరలు తెలియని వాఁడనుట - ఎవ్వరి వధింపఁడు - ఎవరిని జంపఁడు - ఎట్లు సేయఁడు - ఏమి పని చేయఁడు - ఏమి గాఁడు, ఏమై పోఁడు - అనఁగా నెటువంటి పూజ్యులనైనఁ జంపును - ఎట్టిదుష్కార్యమైనను జేయును - ఎటువంటి నీచత్వమునైనఁ బొందును॥ ౫౫

తే॥ అపుడు మెడఁ గోయ మునిరోఁజూటాలకించి। మేలు కొనిదివ్వె యిడి సంభ్రమించి యేన్చ - ననుఁ బొదివిరి పొరిగిండ్లనున్న తపసు। లాదుకాచారుఁ డును భాతెనటను మునుగ॥ ౫౬

టీక॥ అపుడు - ఆసమయమందు - మెడఁగోయఁబడిన రోఁజు టాలకించి - గంధర్వుఁడు కంఠము ఛేదించఁగా మాతండ్రి యాయాసపడుటవిని - మేలుకొనిదిద్దేవ యిడి - నిద్రలేచి దీపము వెలిగించి - సంభ్రమించియేఁడ్చునన్నున్ - తొందరపడి లోడనముచే నేడుచున్న - పొరుగిండ్లనున్న తపసులు - ఈ వలావలియిండ్లమునీశ్వరులు - పొదివిరి - క్రమ్ముకొనిపోదార్చిరి అటకుమునుపే - అంతకుమునుపే - ఆదురాచారుఁడును బాపాత్ముఁడైన గంధర్వుఁడును బఱుగెత్తిపోయెను॥

వ॥ అంతఁ దెలతెలవేగుటయుఁ బ్రభాతసమయంబున

టీక॥ అంతఁదెలతెలవేగుటయున్ - అంతటఁదెల్లవాఱఁగా । ప్రభాతసమయంబునన్ - ఉదయకాలమునందు॥

క॥ ధారాళక్షతజోక్షిత । ఘోరజరాధవళితోరుకూర్చ ముగఁ గరా । ళచూరికి మెడదెగియుటజా । గారంబు

నఁబడినమూఁడుగాళ్లముసలికిన్॥ ౫౭

టీక॥ ధారా...ముగన్ - ధారాళ - అడ్డులేనటుగాస్రవించు । క్షతజ - రక్తముచేత - ఉక్షిత - తడపఁబడిన - ఘోరజరాధవళిత - భయంకరమైనముదిమిచేత - తెల్లగానెఱిసిన - ఉరుకూర్చముగన్ - గొప్పగడ్డమును మీసములుగలుగునట్లుగా - కరచూరికి మెడదెగి - చూరుకత్తిచేత గొంతుదెగి - ఉటజాగారంబునఁబడిన - పర్ణశాలయందుఁబడియున్న - మూఁడుగాళ్లముసలికిన్ - కేవలవృద్ధునకు॥ క్రియాపదముముందరిపద్యమునఁజెప్పినాడు - పూర్వమునఁగానదుమూ మొదలైనవన్నందుకుఁ బ్రమాణము దొరకలేదు॥ ౫౭

ఆ॥ అగ్నియిడ్చి యకట యాబాల్యముగ నన్నుఁ । బెనిచె నెదల్లి వై చిచనిసపిదపఁ దా నెతల్లిమాటు నై నెమ్మినట్టి

ము । జ్జనకుఁ డీల్గె నేటిమనికి యనుచు॥ ౫౮

టీక॥ అగ్నియిడ్చి - అగ్నిసంస్కారముచేసి - అకట - అయ్యో - తల్లివై చిచనిసపిదపన్ - జననిప్రాణమువేసిపోయినతర్వాత - తానెతల్లిమాటునై - మాయమ్మప్రత్యామ్నాయమునుదానేయయి - ఆబాల్యముగన్ - చిన్నప్పటినుండి - నెమ్మిన్ - నెనరుచేత - నన్నుఁబెనిచెన్ - నన్నుఁబెంచెను - అట్టిమజ్జనకుఁడీల్గెన్ - అట్టిమాతండ్రిమృతిఁబొందెను - పటిమనికి యనుచున్ - ఇఁక నేమిబ్రతుకనుకొని॥ ౫౮

క॥ వందురి వగలన్ దేహము । పొందెడలఁగఁ జూచు నన్నుఁ బొడగని దివిఁ దా । నెందుల కేగుచు నో గిరి । నందన

దిగివచ్చి కరుణ నాకిట్లనియెన్॥ ౫౯

టీక॥ వందురి - విలపించి - వగలన్ - చింతలచేత - దేహము పొందెడలఁగఁజూచు - శరీరసాంగత్యమువదలవలెనని - అనఁగా మృతిపొందవలెననియత్నపడుచున్న - నన్నుఁబొడగని - నన్నుఁజూచి - దివిన్ - అంతరిక్షమందు - తానెందులకేగుచు - తా నెక్కడికో వెడలుచును - గిరినందన - పార్వతీదేవి - దిగివచ్చి - భూమికిదిగివచ్చి - కరుణ నాకిట్లనియెన్ - దయచేతనన్నుగురించియొకవాక్యముపలికెను॥ ౫౯

మ॥ అతిసౌందర్యనిశాంతమీతనువలభ్యం బిట్లు శోకాతురా । న్వితవై దీనిఁ దొలంగఁ గాఁ దగదు నేతద్వ్యచాలు

నీసాహసం । బతిలోకుండు స్వరోచి నీకుఁ బతియౌ నారాజు చేఁబట్టియ । ప్రతిమశ్రీవిభవంబు గాంచెదవు నాప

ల్కుండు గా నేర్పవే॥ ౬౦

టీక॥ అతిసౌందర్య - మిక్కుటమైనచక్కఁదనమునకు - నిశాంతమీతనువు - ఆలయభూతమైనదియీశరీరము - అలభ్యంబు - ఇదిదొరుకునదికాదు - ఇట్లుశోకాతురాన్వితవై - ఈప్రకారముగాదుఃఖవ్యాధితోఁ గూడినదానవై - దీనిఁదొలంగఁగాఁదగునే - ఈదేహమునువదలుటన్యాయమా కాదనఁగాన్యాయముకాదు - తన్వీ - చిన్నవయసుగల కళావతీ - చాలునీసాహసంబు - నీవుచేయఁబూనినతెగువచాలును - అతిలోకుండు స్వరోచి - లోకాతీతమైనప్రభావముగలస్వరోచియనుపురుషుఁడు - నీకుఁబతియౌను - నీకుపెనిమిటియవుచున్నాఁడు - ఆరాజుచేఁబట్టి - ఆరాజుచేపట్టి

ఉ॥ ఆకయ నిట్టిరోఁతలకు నాలయముల్ జలజాక్షులేటికిన్ । వీరలతోడి సంగమిఁక వీడెద నంచుఁ దలంచి తోన దు । ర్వారములైన కోరికలవంక వివేకము చొప్పదక్కి యిం । పారఁగ నాఱునాఱు సురహాయనముల్ చరియిం చెఁ గ్రమ్మఱన్ ॥ ౮౭

టీక॥ ఆకయన్ - విచారించఁగా - జలజాక్షులు - స్త్రీలు ఇట్టిరోఁతలకు నాలయముల్ - ఇటువంటి యసహ్యములకు నివాసస్థానములు - ఏటికిన్ - వీరలతోడి సంగము - ఈ స్త్రీలతో సహవాస మెందుకు - ఇఁక వీడెద నంచుఁ దలంచి - ఇఁక విూఁద విడిచిపెట్టెద నని విచారించుకొని - తోనన్ - వెంబడిగా - దుర్వారములైన - నివారింపశక్యముగాని - కోరికలవంకన్ - కాంతలమూలముగా - వివేకము చొప్పదక్కి - తెలివిమార్గము విడిచిపెట్టి - ఇంపారఁగన్ - ఇష్టసంప్రాప్తి యగునట్టుగా - ఆఱునాఱు సురహాయనములు - ఆఱువందల దేవమాన సంవత్సరములు - క్రమ్మఱన్ - మరల - చరియించెన్ - విహరించెను॥ ౮౭

వ॥ తదనంతరంబ క్రమక్రమంబున మనోరమ యందు విజయుండును విభావసియందు మేరునందనుండును కళావతి యందు విభావసుండును నను నందనులం గాంచి పద్మినీవిద్యాప్రభావంబునం బాకశాసనదిశాముఖంబున విజయు నకు విజయాఖ్యపురంబును గిన్నరేశ్వర హరిదంతంబున మేరునందనునకు గంధవతియను పుటభేదనంబును దక్షి ణంబున విభావసునకు ధారాహ్వయోదార మహానగరంబును గల్పించి యనల్పవిభవంబున నక్కుమారుల నప్ప ట్టణంబులకుఁ బట్టంబు గట్టి కృతార్థుండై యొక్కనాడు॥ ౮౮

టీక॥ తదనంతరంబ - ఆటుతర్వాత - క్రమక్రమంబునన్ - వరుసవరుసగా - మనోరమయందు విజయుండును - మనోరమ యను భార్యయందు విజయుఁడును - విభావసియందు మేరునందనుండును - విభావసియను భార్యయందు మేరునందనుండును - కళావతియందు విభావసుండును నను - కళావతియను భార్యయందు విభావసుఁడును నను - నందనులం గాంచి - కుమారులనుగని - పద్మినీవిద్యాప్రభావంబునన్ - పద్మినీవిద్యయొక్క మహిమచేత - పాకశాసనదిశాముఖంబునన్ - తూర్పుదిక్కునందు - విజయునకు విజయాఖ్యపురంబును - విజయుఁడను కొమారునికి విజయమను పట్టణమును - అనఁగా విజయపురమనుట - కిన్నరేశ్వరహరిదంతంబునన్ - ఉత్తరపుదిక్కునందు - మేరునందనునకు గంధవతియను పుటభేదనంబును - మేరునందనుఁడను కొమారునికి గంధవతియను పట్టణమును దక్షిణంబునన్ - దక్షిణపుదిక్కునందు - విభావసునకు ధారాహ్వయోదారమహానగరంబునున్ - విభావసుఁడను వానికి ధారాయను పేరుగల యతిశయమైన మహాపట్టణమును । అనఁగా ధారాపురియనుట కల్పించి - నిర్మాణము చేసి - అనల్పవిభవంబునన్ - అధికైశ్వర్యముచేత - అక్కుమారుల నప్పట్టణంబులకుఁ బట్టంబుగట్టి - ఆకొడుకుల నాపురములకుఁ బట్టాభిషేకము చేసి - కృతార్థుండై - మనోరథసిద్ధిగలవాఁడై - ఒక్కనాడు - ఒకానొక దినమునందు॥ ౮౮

ఉ॥ శాసితశత్రుఁ డా నృపతిచంద్రుఁడు తూణధరుండు సజ్యబా । ణాసనపాణిపంకజుఁడునై మృగసంఘము లెల్లఁ బెల్లసం । త్రాసమునొందఁ గ్రూరత నరణ్యమునన్ మృగయాకుతూహలో । ల్లాసమునం జరించెఁ జలలక్ష్యవిభేదవిధావధానుఁడై ॥ ౮౯

టీక॥ శాసితశత్రుఁడు - శిక్షించఁబడిన విరోధిరాజులుగల - ఆ నృపతిచంద్రుఁడు - ఆ రాజశ్రేష్ఠుఁడు - అనఁగా స్వరోచి - తూణధరుండు - అంబులపొదిని ధరించినవాఁడును - సజ్యబాణాసనపాణిపంకజుఁడునై - సజ్య - నారియెక్కించిన - బాణాసన - వింటితోఁ గూడుకొన్న - పాణిపంకజుఁడునై - కమలములవంటి హస్తములుగలవాఁడునునయి - మృగసంఘము లెల్లన్ - మెకములసమూహములన్నియు - పెల్లుసంత్రాసమునొందన్ - మిక్కిలిభయపడునట్టుగా - క్రూరతన్ - కఠినభావముచేత - అరణ్యమునన్ - అడవియందు - మృగయాకుతూహలోల్లాసమునన్ - వేటయందలి సంతోషవికాసముచేత - చలలక్ష్య - చరించుగురియొక్క - విభేదవిధా - భేదనక్రమమందలి - అవధానుఁడై - చిత్తస్ఫురణకలవాఁడై - చరించెన్ - సంచరించెను॥ కుతూహలమనఁగా వేడుక యనియు నర్థము॥ ౮౯

క॥ కుటిలకృశసాంధ్యరజనీ । విటకోరకకోమలచ్ఛవిస్ఫుటదంష్ట్రా । త్కటపోత్రఖనిత్రాగ్ర । స్ఫుటితవసీధాత్రి నొక్కపోత్రిం గనియెన్ ॥ ౯౦

టీక॥ కుటిల - ధాత్రిన్ కుటిల - వంపుగలిగిన - కృశ - క్షీణించిన । సాంధ్య - సంధ్యాకాలసంబంధమైన - రజనీవిట - చంద్రునివ

టీక ॥ నృపశేఖర - ఓయి రాజశ్రేష్ఠుఁడా - నామనంబు - నాయొక్క యుల్లము - చెదరక - చలింపక - నీయెడ నిల్చి - నీయందు నిల్చి - మన్మథప్రదర పరంపరా - మన్మథుని బాణపరంపరలయొక్క - నిహతిఁ బాల్పడి దెబ్బపాలై - వ్రేఁగెడు - తపించుచున్నది - అటుగానన్ - అదిగనుక - నాయెదట పడఁగింపుమన్నన్ నాతమకము నివారింపఁ జేయుమని యనఁగా - హరిణాంగనవీవు - నీ వాఁడు లేఁడివి - నరుండనే నేను మనుష్యుఁడను ముదంబొదవఁగన్ - సంతోషము ఘటించునట్లుగా నీకు నాకున్ - నీకును నాకును - మిథునోచితకృత్యములు - సంగమక్రియకుఁ దగిన కార్యములు - ఎట్లు చేకూరున్ - ఏలాగునఁ గలుగును॥ ౯౭

క ॥ నావుడు ననునాలింగన । మీవనురాగమునఁ జేయుమింతియ చాలున్ । భూవర యన్నఁ గృపార్ద్రుఁడుగా । పున నా నృపతి హరిణిఁ గౌఁగిటఁ జేర్చెన్॥ ౯౮

టీక ॥ నావుడు - ఆ విస్వరోచి పలుకఁగా - ఈవనుగాక మునన్ నీవు ప్రేమచేత ననునాలింగనము చేయుము నన్ను గౌఁగిలించుకొనుము - ఇంతియ చాలున్ - ఇంతే చాలును - భూవర - ఓయి రాజా - అన్నన్ - అనియనఁగా - కృపార్ద్రుఁడుగావునన్ - దయార్ద్రమనము గలవాఁడు గనుక - నృపతి రాజు - హరిణిన్ - ఆఁడు లేఁడిని కౌఁగిటఁ జేర్చెన్ - ఆలింగనము చేసికొనెను॥ ౯౯

సీ ॥ వల్లీమతల్లి లావణ్య సర్వస్వంబు । విమలాంగరేఖ నావిర్భవింప । మంజులమంజరీమహిత సౌభాగ్యంబు । పరివృత్తకుచవృత్తిఁ బరిణమింపఁ । బల్లవచ్ఛదచారుభావానుభావంబు । మృదుహస్తలీలమూర్తీభవింప । రమణీయముకుళ విభ్రమభాగధేయంబు । కరరుహస్ఫూర్తి సాక్షాత్కరింపఁ ॥ తే ॥ జేసి మృగియై వహించు నక్షిద్వయంబు । భాసురంబుగఁ దనయంకపాళిలోన । మించు క్రొమ్మించు నుపమించు మెలఁతయగుచు । నిలుచు నవ్వనదేవత నృపతిసూతి॥ ౧౦౦

టీక ॥ వల్లీ స్వంబు - వల్లీమతల్లి - శ్రేష్ఠమైన తీఁగలయొక్క - లావణ్యసర్వస్వంబు - చక్కఁదనము యావత్తును - విమలాంగరేఖన్ - నిర్మలమైన యవయవ సౌష్ఠవము చేత - ఆవిర్భవింపన్ - పొడగట్టఁగాను మంజు ...గ్యంబు - మంజుల - మనోహరమైన మంజరీ - పువ్వుగుత్తులయొక్క - మహితసౌభాగ్యంబు - ఒప్పు చుండు చక్కఁదనము పరి. మింపన్ - పరివృత్త వర్తులి వట్రువలైన - కుచ - స్తనముల యొక్క - వృత్తిన్ - వర్తనము చేత - పరిణమింపన్ పరిణమించుచుండఁగాను - పల్లవ ...ంబు - పల్లవచ్ఛద - చిగురాకులయొక్క - చారుభావానుభావంబు - విలాసత్వప్రభావము - మృదు ...పన్ - మృదుహస్తలీలన్ - కోమలమైన కరములయాకృతి చేత - మూర్తీభవింపన్ - స్వరూపము వహించఁగాను - రమ... యంబు రమణీయ - సుందరమైన ముకుళ - మొగ్గలయొక్క - విభ్రమ - విలాసము యొక్క - భాగధేయంబు - భాగ్యము కర...రింపన్ - కరరుహస్ఫూర్తిన్ - గోళ్లయొక్క స్ఫురణచేత - సాక్షాత్కరింపన్ - ప్రత్యక్షము గాఁగాను చేసి. ఒనర్చి - మృగియై వహించు - లేఁడియై ధరించిన - అక్షిద్వయంబు - కన్నుఁగవ భాసురంబుగన్ - ప్రకాశించఁగా - అనఁగా లేడికన్నులవంటి కన్నులతో - తనయంకపాళిలోనన్ - తన తొడయందలి - మించు - అతిశయించుచుండు - క్రొమ్మించున్ - క్రొత్త మెరుపుతీఁగను - ఉపమించు మెలఁతయగుచున్ - పోలిన స్త్రీయవుచును - నిలుచు నవ్వనదేవతన్ - నిలిచిన యా కాననాధిదేవతను - నృపతిసూతి - రాజైన స్వరోచి వీక్షించి

క ॥ ఘూనినవిస్మయరసమున । మానిని మృగివై చరించి మఱియంగనవై । కానంబడితివి చిత్రం । బే నెన్నఁడు నెఱుఁగఁ జెప్పవే చెలియంగన్॥ ౧౦౧

టీక ॥ ఘూనిన - వహించిన - విస్మయరసమునన్ - ఆశ్చర్యరసముచేత - మానిని - ఓ చిన్నదానా - మృగివై చరించి - లేఁడివై ప్రవర్తించి మఱియంగనవై మఱి యొక స్త్రీరూపము గలదానవై - కానఁబడితివి - కనఁబడితివి చిత్రంబు - ఈ విచిత్రము - ఏ నెన్నఁడు నెఱుఁగన్ - నేనెప్పుడును రెఱుంగను - చెప్పవే తెలియంగన్ - ఇది తేటపడునట్టుగా చెప్పవే॥

సీ॥ నావుడు నమరకాంతాతనూభవుఁ జూచి । యివ్వనదేవత నేన రేంద్ర । సకలభూభువనరక్షాదక్షుఁడగు మనువ ర్యు - నీయందుఁ బడయు నెన్నిక సమస్త । దివిజులు నన్నుఁ బ్రార్థించి నవచ్చితి । ననురాగవతి నై ననను వరించి । పడయుము నాయందపత్యంబు నీవనీ । కనుఁ బుణ్యలోక సంప్రాప్తి యనిన ॥ తే॥ నట్లకాకని యయ్యంబుజాయ తాక్షి । నేకచిత్తంబుతో దనం గీకరించెఁ । జాలనిట్లు సుఖాంబుధిఁ దేలుచుండి । యంతగర్భిణి యయ్యె శుభంబ గుదినము ॥ ౧౦౩

టీక ॥ నావుడు - అనిస్వరోచి పలుకఁగా - అమరకాంతా తనూభవుఁ జూచి - దేవతాస్త్రీ యగు వరూథినికుమారుఁడై నస్వరోచిః వీక్షించి - నరేంద్ర - ఓయి రాజా - ఇవ్వన దేవత నేన్ - నేను నీ కానన దేవతను - సకల...వర్యుఁ - సకలభూ భువన - సమస్తమైన భూలోకముయొక్క - రక్షాదక్షుఁ - అవనము సమర్థుఁడైన - మనువర్యుఁ - శ్రేష్ఠుఁడైన మను వును - నీయందుఁబడయుః - నీవలనఁగను నిమిత్తము - ఎన్ని క సమస్త - ఖ్యాతియగునట్టుగా సకలమైన - దివిజులు - దే వతలు - నన్నుఁ బ్రార్థించినవచ్చితిఁ - నన్ను వేఁడుకొనఁగా నే తెంచితిని - అనురాగవతి నైన - ప్రేమగలిగియున్న - న నువరించి - నన్ను నీవు పరిగ్రహించి - నాయందుఁ - నాయె డల - అపత్యంబుఁ - సంతానమును - పడయుము - పొందు ము - పుణ్యలోకప్రాప్తి - స్వర్గాదిభువనాధిగమము - అనఁ గాఁ బుణ్యలోకమును బొందుట - దీననీకఁ - ఇందువలన నీకు పుణ్యలోకప్రాప్తి - అనినఁ - అనివన దేవత పలుకఁగా - అట్లకా కని - అతిపసనే కానిమ్మని - అయ్యంబుజాయతాక్షిఁ - తామర రేకుల వలె నెడల్పైన నేత్రములుగల యాస్త్రీ - ఏ కచిత్తంబుతో డనఁగీకరించెఁ - చలించని యాసక్తి చేతఁ బరి గ్రహించెను - చాలఁ - మిక్కిలి ఇట్లు సుఖాంబుధిఁ దేలుచుండి - ఈప్రకారము గాభోగములను సముద్రమందు నీఁదులాడి - అ నఁగా బహుభోగములననుభవించి - అంతగర్భిణియయ్యె - అట పిమ్మట వేఁకటియాయె - శుభంబగు దినమునఁ - ఒకానొకమంచి దినమందు ॥ ౧౦౩

శా ॥ కాంచెం బుత్రు విశాలనేత్రుఁ బృథువక్షఃపీఠవిభ్రాజితుం । బంచాస్యోద్ధత శౌర్యధుర్యఘనదోస్తంభద్వ యుఁ దేజోనిధిం । బంచాస్త్రప్రతిమానమానమునుసామ్రాజ్యైకహేతుప్రభా । లాంఛల్లక్షణలక్షితుఁ సుగుణరత్నానీకరత్నాకరుఁ ॥ ౧౦౪

టీక ॥ విశాలనేత్రుఁ - వెడల్పైనకన్నులుగలిగిన - పృథువ క్షఃపీఠవిభ్రాజితుఁ - గొప్పపీఁట వంటియు స్థూలముచే తఁ బ్రకాశించుచున్నవాఁడును - పంచా...ద్వయుఁ - పం చాస్య సింహమువలెనే ॥ ని॥ సింహోవ్యాఘ్రేగేం ద్రః పం చాస్యహర్యక్ష కేసరిః ॥ ఉద్ధత - హెచ్చైన - శౌర్యధుర్య - ప రాక్రమమును వహించిన - ఘన - దీర్ఘములైన - దోస్తంభద్వ యుఁ - ప్రకాశించుచునుండు భుజములుగలిగిన వాఁడును - తేజోనిధిఁ - కాంతికిస్థానమైన వాఁడును - పంచాస్త్రప్ర తిమానుఁ - మన్మథునితో సమానుఁడైన వాఁడును - మాన ఘనుఁ - చిత్తసమున్నతిచేత నధికుఁడైన వాఁడును - సామ్రా జ్యైకహేతు - సముద్రపర్యంతభూమండలాధిపతి త్వమునకు ముఖ్యకారణములై - ప్రభూత - ప్రచురములై న - లాంఛల్లక్షణ - శుభచిహ్నములచేత - లక్షితుఁ - ఒప్పు చున్నవాఁడును - సుగు...కరుఁ - సుగుణరత్నానీక - సుగు ణములను మణిసమూహములకు - రత్నాకరుఁ - సముద్రుఁ డైనవాఁడును నైన - పుత్రుఁ - కుమారుని - కాంచెఁ - కనియెను ॥ ౧౦౪

క ॥ వేడుకనయ్యవసరమున । నాడిరి సురసతులు కిన్నరాంగనల్ దం । బాడిరి గంధర్వులు గొని । యాడిరి సురతూర్యనినదమగ్గలమయ్యెఁ ॥ ౧౦౫

టీక ॥ అయ్యవసరమునఁ - ఆసమయమందు - వేడుకఁ - వాఁగము చేత - ఆడిరి సురసతులు - అప్సరసలు నాట్యము చే సిరి - కిన్నరాంగనలర్థిం బాడిరి - కిన్నరస్త్రీలాసక్తి చేత గా నము చేసిరి - గంధర్వులు గొనియాడిరి - దేవగాయకులంద రు స్తోత్రము చేసిరి - సురతూర్యనినదము - దేవదుందుభుల యొక్క నాదములు - అగ్గలమయ్యెఁ - అతిశయమాయెను - ఈ పద్యమున కేపాఠాంతరము ॥ వీణె మొదలైన దియు - ము ఖ్యదళ మొదలైనదియు - పిల్లంగ్రోవి మొదలైనదియు - తాళ ము మొదలగు నదియును దూర్యములనఁ బడును ॥ ౧౦౫

టీక ॥ వ్యాయామ...బంధ - వ్యాయామము - సంచరించుచున్నప్పుడు - స్థిర - కదలకుండునట్టి - సంధిబంధ - కీళ్లసంధులుగలవాఁడా - కృతకా...ఖడ్గాగ్ర - కటకాధ్యక్షునకుఁగ - కటకము న స్వకటకమున కధీశ్వరుఁడై నగజపతిననుసరించియుండు - క్షోణీభృత్ - రాజులయొక్క - కాయ - దేహములనెడు - గ్రావ - పర్వతములయొక్క - భిదావిధా - భేదనక్రియయందు - భీకర - వజ్రాయుధమైన - దోఃఖడ్గాగ్ర - భుజమందలి కత్తియొక్క మొనగలవాఁడా - ఉగ్రాచల - కైలాస పర్వతముకంటె - వ్యాయామ...పంచ - వ్యాయామ - శ్రేష్ఠతరమైనకీర్తిభరప్రపంచ - కీర్త్యతిశయముతోఁగూడినప్రపంచముగలవాఁడా - వర...యాంక - వర - శ్రేష్ఠమైన - పంచారామ - అమరారామ - కొమరారామ - భీమారామ - క్షీరారామ - ద్రాక్షారామములను నయిదుపట్టణములయందలి - రామామణీ - శ్రేష్ఠమైన స్త్రీలచేత - గేయ - గానముచేయఁదగిన - అమేయ - ఎన్నశక్యముగాని - జయాంక - జయలాంఛనములుగలవాఁడా - పంక...కృతీ - పంకజవ్యక్తతామరరేకులవంటికన్నులుగల స్త్రీలచే - అంగీకార - సత్కృతమైన - ధీరాకృతీ - మనోహరమైనరూపముగలవాఁడా॥ ఈ శ్లో॥ రామమానిభిమేశ్వరఖండమునందుప్రసిద్ధము॥ ౧౩౧

క ॥ కాంతాలతాంతశరమః కాంతికభక్తిప్రతోషితాంభోధిసుతా । కాంతాప్రతాపరవిశశి కాంతాయితవి
మతనృపతి కాంతాహృదయా॥ ౧౩౨

టీక ॥ కాంతా - సౌందర్యవతులైన స్త్రీలకు - లతాంతశర మన్మథప్రాయుఁడవైనవాఁడా - అనఁగాఁబుష్పములే బాణములుగాఁగల వాఁడపుట - ఏ కాంతి...సుతా. ఏ కాంతికభక్తియుక్తమైన - భక్తి - భక్తిచేత - ప్రతోషిత - మిక్కిలి సంతోషపెట్టఁబడిన అంభోధిసుతా కాంతా - లక్ష్మీదేవిగలదైనవిష్ణుమూర్తిగలవాఁడా - ప్రతాప...హృదయా - ప్రతాపరవి - ప్రతాపమనుసూర్యునివలన - శశికాంతాయిత - చంద్రకాంతములవలెనాచరించుచున్న - విమతనృపతి - శత్రురాజులయొక్క - కాంతా - భార్యలయొక్క - హృదయా - డెందముగలవాఁడా - అనఁగా సూర్యునివలనఁ జంద్రకాంతము లేతీరునవికాసహీనమై యుండునో ఆతీరున నీయొక్క ప్రతాపమువలన శత్రురాజకాంతలహృదయములు వికాసహీనమై యుండునని తాత్పర్యము॥ ౧౩౨

వనజసయహారకము॥ రాజపరమేశ ఫణిరాజబలఫుల్లాం । భోజముఖభోజముఖభూపవిపులాంసో । త్తేజితధరా
భరణదీక్షితభుజాని । ర్వ్యాజభయదాజివిజితారినృపరాజీ॥ ౧౩౩

టీక॥ రాజపరమేశ - రాజపరమేశ్వరబిరుదుగలవాఁడా - ఫణిరాజబల - శేషాహివంటిబలిమిగలవాఁడా - ఫుల్లాంభోజముఖ - వికసించినకమలమువంటి మోముగలవాఁడా - భోజ...భుజా - భోజముఖభూప| భోజరాజు మొదలైన రాజులయొక్క| విపులాంస విశాలములైన భుజములచేత |ఉత్తేజిత| మిక్కిలి మెఱుఁగుపెట్టఁబడిన|ధరా-భూమియొక్క| భరణభరించుటయందు| దీక్షిత|సంజాతదీక్షగల |భుజా| బాహువులుగలవాఁడా-నిర్వ్యాజ...రాజీ - నిర్వ్యాజ - నిర్ణిమిత్తముగానట్టుగా - భయదాజి - భీతినిచ్చుచునుండుయుద్ధములయందు - విజితారినృపరాజీ - జయింపఁబడినశత్రురాజసమూహముగలవాఁడా॥ ౧౩౩

గద్య ॥ ఇది శ్రీమదంధ్రకవితాపితామహ సర్వతోముఖాంక పంకజాతుపాదాంబుజాధీనమానసేందిందిరనం
దవరవంశోత్తంస శఠగోపతాపసప్రసాదాసాదితకవితామతల్లికాల్లసానిచొక్కయామాత్యపుత్త్ర పెద్దనార్యప్ర
ణీతంబైన స్వారోచిషమనుసంభవంబను మహాప్రబంధంబునందు సర్వంబును షష్ఠాశ్వాసము॥

దీనికి టీక షష్ఠమాశ్వాసప్రకారమే యనియెఱుఁగునది.

మనుచరిత్రము - సంపూర్ణము.

---